





# ధర్మము

## విచారణ

### సంఘ నిర్మాణ శాస్త్రము - మను ధర్మ శాస్త్రము నుంచి





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

దివ్యజ్ఞాన చంద్రిక – 13వ కిరణము

# సంఘ నిర్మాణ శాస్త్రము

(మనుధర్మశాస్త్రము ననుసరించి)

బాబు భగవాన్ దాసుగా

ఆంగ్లగ్రంథము ననుసరించి

గుంటూరు వేంకటసుబ్బారావు గారిచే

సంగ్రహముగా తెలుఁగులో వ్రాయఁబడినది



ప్రకాశకులు:

అయ్యంకి వేంకటరమణయ్య,

బెజవాడ.

# "సంఘ నిర్మాణ శాస్త్రము"

## ఉపోద్ఘాతము

### మనుస్మృతి ప్రశంస

బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వేంకటసుబ్బారావుగారు

*మనుస్మృతి భారతీయ మత గ్రంథముల లోనే గాక మానవ ధర్మశాస్త్రము లన్నింటియందును, ఆది స్మృతి, ఉత్తమోత్తమ గ్రంథము. ఇప్పుడు మన జాతి జీవితమును సంస్కరించుటకుగాని, మానవకోటి నుద్ధరించుటకుగాని, మనుస్మృతి పరిచయ మవసరము. ఇటీవల భారతమంత్రి ఏమరీదొర తమ మేగ్నాకార్టా (Magna Charta)యే బ్రిటిష్ స్వాతంత్ర్యమునకును, మానవకళ్యాణమునకును మూలాధారమని యుపన్యసించినపుడు మన మనుస్మృతియే మన జీవితాశయము లన్నింటికిని మూల మని నేను ప్రత్యుత్తర మొసంగితిని. అట్టి మనుస్మృతి ననుసరించి సుప్రసిద్ధ తత్వవేత్త లగు బాబూ భగవాన్ దాసు మహాశయు డీ "సంఘనిర్మాణశాస్త్రము"ను ఆంగ్లమున రచించెను. ఆ గ్రంథమును ఆంధ్రనాయకులలో నొకరును, సుప్రసిద్ధ గ్రంథాలయోద్యమ స్థాపకులు నగు మహారాజశ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగా రాంధ్రీకరణ మొనర్పించి తేట తెనుగు బాసలో, మృదుమధురశైలిని ఆంధ్రలోకమునకీ రూపమున ప్రచురింపించుచున్నారు. ఇది యాంధ్రుల భాగ్యమని నా యభిమతము.

---

* మనశ్శబ్దము - మనస్సు - మానవుడు - మనువు. (Mind - Man)

ఈ "సంఘనిర్మాణశాస్త్రము"న నాలుగధ్యాయము లున్నవి. (1) మనుధర్మశాస్త్రమున కాధారములు (2) జీవిత విషయమున మానవ పరిణామము - వర్ణాశ్రమ ధర్మములు (3) విద్యావిషయము- బ్రహ్మచర్యముగూర్చి (4)గృహస్థ, వానప్రస్థ,సన్యాసధర్మములు."ఒక్కొక్క యుగమందు మనుష్య జాతి ధర్మము లొక్కొక్క తీరున నుండును. ఆయా కాలములయందు మానవజాతి పొందుచున్న వికాసమున కనుకూలమయిన ధర్మము విధింపబడును. మనువు విధించిన స్మృతిలోని ధర్మముల తత్త్వములు సర్వకాలములందును అవలంబించ దగినవి యైనను వివరములు దేశకాలములనుబట్టి మారుచుండక తప్ప"దని బాబూభగవాన్‌దాసుగారు యిందలి 171వ పుటలో జెప్పినవాక్యము ప్రశంసనీయ మైనది. ఈగ్రంథ మున మనుస్మృతి నాధారము చేసికొనియు, ఇతర అధి కారముల బట్టియు, మానవోత్పత్తివివరములు, మానవ పరిణామము; వర్ణ విషయములు, ఆశ్రమ విషయములు, విద్యా విషయములు, సాంఘిక జీవితము, మున్నగు మానవసమస్య లెన్నింటిం గూర్చియో విపులముగను, దీర్ఘముగను, సరసముగను చర్చించబడినది. ఇందు ప్రాక్పశ్చిమముల చిత్తవృత్తి తారతమ్యము(8-10) వీని రెండింటి సామరస్యము కొఱకై యీ యుభయుల "బ్రాహ్మణులు"ను (అనగా విద్యావంతులు)అన్యోన్య సహకారముతోఁ బని చేయవలె నని చెప్పబడినది.

## ఇది "స్మృతి సమయము"

ప్రపంచ మందంతటను యిప్పు డొక నూతన స్మృతి సమయ మని తెనుక శ్రీ ఆంధ్రరత్న గోపాలకృష్ణ

డనెడివాడు. ది 1-8-1943 తేదీతో యిప్పటి కలియుగ మంత మగు నని 'చేతావని' చెప్పుచున్నది. ఆ విషయ మెట్లున్నను, యిప్పటి హిట్లరు, ముసులోనీల నడుమ యీ ప్రపంచ మంతయు అట్టుడికిన ట్లుడుకుచున్నది. 1943-44 నాటి ప్రపంచ పునర్నిర్మాణమునకై, మన మెల్లర మెసురుచూడవలె నని బ్రిటిష్ ప్రధాని విన్స్టన్ చర్చిల్ నేడు చెప్పుచున్నాడు. అప్పటి నుండియు మానవజాతి కంతకును నొక నూతనయుగమో, శకమో, పరిణామమో, పరితాపమో, యేదో ఒకటి రానున్న దని మనము నమ్మవచ్చును. అట్టి నూతన సృష్టికి సాంఘిక మూలసూత్రము లెట్టివైయుండవలె నను ప్రశ్న సామాన్యము కాదు. ఇందుగూర్చి పాశ్చాత్యప్రము ఖులు కొందర ఊహా ప్రపంచమున విహార మొనర్చు చున్నారు. కాంగ్రెసు నాయకులు సంశయాత్మ లగు చున్నారు. ఈ విషయమునే బాబూ భగవాన్దాసు గారిందు విపులముగ చర్చించి, సారాంశములను పాఠ కుల యెదుట నుంచిరి.

మనుధర్మశాస్త్రము గురించి గాని, అందుపై యీ వ్యాఖ్యానము గురించిగాని విమర్శించుటకు నే నిచ్చట బూనుకొనను. 'మనుస్మృతి'లో పండ్రెండధ్యాయము లున్నవి. వానిలో 1. జగత్సృష్టిక్రమము, 2. బ్రహ్మ చర్యాది విద్యానియమములు, 3. 4. 5. 6. బ్రాహ్మణ గృహస్థాశ్రమవిధులు, 7. రాజధర్మములు, 8. న్యాయ దండన- సుంకములువగైరా, 9. స్త్రీలవిషయము, 10. జాతిధర్మములు, 11. ప్రాయశ్చిత్తప్రకరణము, 12. మోక్షప్రశంస చర్చించబడినవి. ఇందలి "సాంఘిక

సూత్రము"లను బాబూభగవాన్ దాసుగారు తమ గ్రంథరాజమున కొంతవఱకు ఆధునిక దృష్టితో బ్రస్తావించిరి. ఈ గ్రంథముయొక్క విలువను గ్రహించుటకై యిప్పటి మనయువక ప్రపంచము నెక్కుడుగా కలవరపరచుచున్న ఒకటి రెండు అంశముల గూర్చి మాత్రము స్థాలీపులాక న్యాయముగ నెత్తుకొని మానవ కోటి కంతకును మనుస్మృతి యెట్టి సహాయకారి కాగలదో పాఠకులకు విశదీకరింప యత్నింతును.

## "బ్రహ్మతేజోమయం దండం"

ఉదాహరణ కొక్క దండనీతి గూర్చి యోజింతము. మనదేశమున రాజనీతిని దండనీతి యని యందురు. ఆ "దండము" గూర్చి మనువు తన 7 వ అధ్యాయమున యెన్నియో సూత్రరాజములను వెదజల్లెను. రాజు తన కార్యసిద్ధికై సకలప్రాణిసంరక్షకుడైనవాడగు, ధర్మమును పుత్రుని, బ్రహ్మతేజస్స్వరూప మైనదండమును బ్రహ్మ సృజించెను. ఆ దండభయమువలన స్థావరజంగమము లగు సకల భూతములును భోగసౌఖ్యముల ననుభవింపుచున్నవి. తమ తమ స్వధర్మముల నుండి తొలగక ఆచరించుచున్నవి. ఆ దండమును దేశకాలానుగుణ్యముగ, శాస్త్రోక్తముగ అపరాధు లగువారి యం దుపయోగింపవలయును. ఆ దండమందు రాజబలమున్నందున నదియే రాజు. తక్కిన వారందఱు ఆడువారివలె ఆదండమునకు లోబడుదురు గనుక నదియే పురుషుడు. ఆ దండముచేతనే అన్ని కార్యములు నెఱవేర్చబడును. కాన నదియే నాయకుడు. ఆదండమే శాసనము చేయుచున్నది గావున నదియే శాసనకర్త. ఆదండమే నాలుగువర్ణముల-

వారికిని పూటరై యున్నది. ఆ దండము జనులకందఱకును ఆనతిచ్చును. రాజువలె రక్షించును. రక్షకులు నిద్రించినను, దండము మేల్కొని కావలి కాచును. దండము ధర్మహేతువు గాన దానినే ధర్మ మందురు.'' భారతమున చెప్పినట్లుగ,

పేదలకును సాధులకును
వేదములకు వేయునేల వేధాది సమ
స్తాదిత్యులకును దండమ
కాదే బ్రతుకిచ్చు రాజు కడు రక్షింపన్.

ఈ దండప్రయోగము గూర్చి మనుస్మృతిలో ననేక వివరము లత్యద్భుతముగ చిత్రించబడినవి. ''శాస్త్రము వలన చక్కగా బరికించి, అపరాధానుగుణముగ కాపాడినచో దండము ప్రజల నందఱను రంజింప జేయును. అట్లు పరికింపక ప్రయోగించినచో నట్టిదండము అందఱను నశింపజేయును. ఏమఱుపాటున రాజు దండ్యులందు చక్కగా దండమును బ్రయోగింపడేని, బలవంతు లగువారు బలహీనులను శూలమునందు మత్స్యమునుబోలె గ్రుచ్చివేయుదురు. యజ్ఞములందలి పురోడాశమును కాకములు భక్షించును. కుక్కలు పాయసమును, హవిస్సును నాకును. ఒక్కనికిని ఒక్క వస్తువు నందును స్వాతంత్ర్యము లేకపోవును. తక్కువ వారెక్కువగను, హెచ్చువారు తక్కువగను బరిగణింపబడుదురు. ఈ లోకమంతయు దండముచేతనే నియమింపబడినదై సన్మార్గమునం దున్నది. లోకమునందు దండము లేకయే స్వాభావికముగ బరిశుద్ధుడైన వాడుండుట యరుదు. దండ భయమువల్లనే యీ జగమంతయు అవ

శ్యకమగు భోజనాదులను జరుపుకొన గలుగుచున్నది. దేవ దానవ గంధర్వులును, రాక్షస గరుడపన్నగులును, పరమేశ్వరుని దండనకు వెఱచియే తమతమ కార్యములను చక్కగ జేయుచున్నారు. దండము నాచరింపమిచే, వర్ణసంకరము కలుగును; పురుషార్థములు నశించును; లోక సంక్షోభము కలుగును. ఏ దేశమందు నల్లని వన్నెగలదియు, యెఱ్ఱని కన్నులు గలదియు నగు దండము పాపముల నెల్ల భోగొట్టుచు సంచరించుచున్నదో, అచ్చట దండనాయకుడగు రాజు జాగ్రత్తతో నేరమునకు తగినట్లు దండనచేయు నేని, అచ్చట ప్రజలు కలవరము లేక సుఖులై యుందురు." (7-14-25)

శ్లో॥ యత్ర శ్యామో లోహితాక్షో దండశ్చరతి పాపహా।
ప్రజాస్తత్ర నముహ్యంతి నేతా చే త్సాధు పశ్యతి॥

## రాజ్యాంగ విషయము

గత నలభై, యేభైయేళ్ళనుండియు మన దేశీయులు మనకు "స్వరాజ్యము" కావలయు నని ఆందోళన చేయుచున్నారే! వీరిలో నాయకులైన వారైనను యీ "స్వరాజ్య" స్వరూప మెట్లుండవలెనో, భారత రాజ్యాంగ సంప్రదాయము లెట్టివో, వీనికిని పాశ్చాత్య పార్లమెంటరీ విధానమునకును గల భేదమెట్టిదో యీ మున్నగు విషయములను విచారించుట యరుదు. మన పెద్దలందరు పూర్వము తాము; పాశ్చాత్య పార్లమెంటరీ విధానమే మన ఆశయమనెడివారు. ఇటీవల కొందఱు రష్యారాజ్యమే స్వరాజ్యమనియు, మఱి కొందఱు భావిపరిషత్సభ (Constituent Assembly)

యీ స్వరాజ్య స్వరూపనిర్ణయము గావించవలె ననియు చెప్పుచున్నారు. కాని వీరిలో నొక్కరైనను భారత స్వరాజ్య స్వరూపము నెఱుంగని వా రగుటచే భావి భారత రాజ్యాంగ విషయమున మనదేశీయుల స్థితి "కానని వాని నూతగొని కాననివాడు విశిష్టవస్తువుల్, కానని భంగి"యన్నట్లున్నది. ఇట్టితరి మన యువకు లైనను మనుస్మృతి, భారత, భాగవతాది గ్రంథములను పరిశీలించినచో మన సాంప్రదాయమునకును, భావి యవసరములకును అనుగుణ్య మగు రాజ్యాంగ సూత్రములు మనకు లభించకపోవు.

ఉదాహరణకు బ్రిటిష్ పార్లమెంటరీ విధానమందు శాసనసభలు ( Legislature ), న్యాయస్థానములు (Judiciary), మంత్రివర్గములు (Executive), యీ మూడును 'త్రయాంగము'లగుచున్నవి. కాని ఈ 'త్రయాంగములు' మన సాంప్రదాయ విరుద్ధము లేగాక– (శాసనసభలలో రెండు యిళ్ళు (Houses), అందులో ఒక వాగ్ధాటి (Speaker), ఒక కొరడా (Whip), ఒకరు నోరు మూయించుట (Point of Order), యివన్నియు మన కపభ్రంశములు కావని యెవరనగలరు?)–పాశ్చాత్య ప్రపంచమందు కూడ దాదాపు అన్ని దేశములలో యీ పార్లమెంటరీపద్ధతి నిరుపయోగ మని రుజువు చేయబడి, నిరాకరింపబడుచున్నది. కావుననే కొందఱు పాశ్చాత్య శాస్త్రజ్ఞు లిటీవల యేదో యొక నూతనరాజ్యాంగవిధానమునకై అన్వేషించుచున్నారు. ఐరోపాలో హిట్లర్, లెనిన్, ముసులోనీలు యిందుకై కొన్ని క్రొత్త త్రోవలు ద్రొక్కిరి. కాని వారి జీవితకాలముననే వీరి విధానము

లెట్టి యొడుదుడుకులను దెచ్చుచున్నవో మనము నిత్యము గనుచున్నాము. ఈ మధ్య హెచ్.జి. వెల్సు అను నొక ఆంగ్ల పండితుడు కొన్ని మానవసూత్రములను బోధింప సాహసించెను. కాని తమ దేశమందే యీతడు అమెరికాకు పోకూడదనియు, అచ్చట యీతని అస్పృశ్యునిగ జూడవలె ననియు, అప్పుడే ఆందోళన బయలుదేరెను. ఇట్టి పరిస్థితిలో భారత రాజ్యాంగ విధానము గూర్చి మనుధర్మశాస్త్ర మేమి చెప్పెనో యెఱుంగుట మిక్కిలి యవసరము.

## సప్తాంగములు

మనుస్మృతిలో రాజ్యాంగముగూర్చి యిట్లు చెప్ప బడియున్నది.

స్వామ్యమాత్యౌపురం రాష్ట్రంకోశదండౌ సుహృత్తథా,
సప్త ప్రకృతయోహ్యేతా స్సప్తాంగం రాజ్యముచ్యతే॥
—9–294.

(అనగా రాజు, మంత్రి, కోట, రాజ్యము, బొక్క సము, సేన, మిత్రులు యీ యేడును రాజ్యమున కేడు మూల ప్రకృతులు. కావుననే, రాజ్యాంగము సప్తాంగ మనబడు చున్నది.)

సప్తానాం ప్రకృతీనాంతు రాజ్యస్యాసాం యథాక్రమమ్,
పూర్వం పూర్వం గురుతరం జానీయాద్వ్యసనం మహత్.
—9–295.

(వీనిలో వరుసగా, వెనుకటి దానికంటె ముందటిది యెక్కుడు ముఖ్యమైనది. అనగా మిత్రులకంటె సేనయు, సేనలకంటె ధనము, ధనముకంటె రాజ్యము,

రాజ్యముకంటె కోట. లేక ముఖ్య పట్టణము, కోట కంటె మంత్రి, వీనికంటె రాజును, యెక్కుడు ప్రధానములు)

శ్లో॥ సప్తాంగ స్యేహ రాజ్యస్య విష్టబ్ధస్య త్రిదండవత్,
అన్యోన్య గుణవైశేష్యా న్నకించి దతిరిచ్యతే.

శ్లో॥ తేషుతేషు తు కృత్యేషు తత్తదంగం విశిష్యతే,
తేన యత్సాధ్యతే కార్యం తస్మిన్ శ్రేష్ఠ ముచ్యతే.
—9-296-297.

(ఈ సప్తాంగములు గల రాజ్యాంగము నందలి యే డంగములలో ఒండొంటికి తోడ్పాటు కలదు. కావున నొక దానికంటె యింకొకటి యధికము కానేరదు. అయ్యా కార్యములలో నయ్యెయంగము ముఖ్యము. కాని యా కార్యము మఱొక్కయంగముచేత జేయనలవికాదు. కావున ఒండొంటి కన్నియంగములును ముఖ్యములే).

ఈనాలుగు శ్లోకములలో రాజకీయవిజ్ఞాన మెంతయో యిమిడియున్నది. శివాజీవంటి రాజొక డుండెననుకొందము. ఆతడు క్రమముగా శ్రీసమర్థ రామదాసు వంటి గురువు లేక మంత్రిని, రామదుర్గమువంటి యొక కోటను మహారాష్ట్రమువంటి దేశమును కొల్లగొట్టియో, పన్నులువేసియో కొంతకోశమును,ఒక దండు,కొందఱు మిత్రులను చేపట్టిననాడు యాతడు మహాసామ్రాజ్య స్థాపనాధికారి కాలేదా? ఇక "రాజ్యాంగము"న కేమి కావలయు? కావుననే మన పెద్దలు "సభా సప్తాంగ లక్షణమ్" అని చెప్పిరి. ఇందు మిత్రులు లేకపోయినను తన సైనికబలముచే రాజు మిత్రులనుగూడ పొందగలడు.

స్వంత సైన్యము లేకపోయినను, ఫ్రెంచి సేనాని మూరు లను సంపాదించినట్లు ధన మున్నచో కొంత సేనల నేర్పాటు చేయవచ్చును. ఒక రాజ్య మున్నచో ధనము వచ్చును. దేశముకంటె కోట ముఖ్యము- కోటకంటె మంత్రి, రాజులు నవసరము. వీటి యన్నిటికిని అన్యోన్య సంబంధమే కాదు—— అన్ని యంగములును ఒక్క శరీరమందలి భాగములే కాని, వీనిలో ఒక యంగము నింకొకదానితో మార్పు జేయకూడదు! ఒక్కని పని కింకొక డనర్హుడు. ఇప్పటి నవీనులు (Separation of the executive and judiciary) అనగా న్యాయ్య, కార్యవర్గములను విడదీయుట యను ఆధునిక సూత్రము ఇంతకంటె నెక్కుడు విస్పష్టముగను, విశాలముగను మనుస్మృతియందు వివరించ బడలేదా? ఈ సూత్రములను మన రాజకీయావేత్త లెందఱు గ్రహించుచున్నారు? అన్వ యించుచున్నారు? లేనిచో మన కిక "స్వరాజ్య" మెట్లు సిద్ధించును?

## పరిపాలనా విధానము

ఇటులనే రాజ్యపాలన గూర్చియు ఒకరాజు తన రాజ్యము నెట్లు పాలించుకొనవలెనో, మను విట్లు వర్ణించెను.

ద్వయోస్త్రయాణాం పంచానాం మధ్యేగుల్మమధిష్ఠితమ్
తథా గ్రామశతానాంచ కుర్యాద్రాష్ట్రస్య సంగ్రహమ్.

గ్రామస్యాధిపతిం కుర్యా ద్దశగ్రామపతిం తథా
వింశతీశం శతేశంచ సహస్రపతి మేవ చ.

గ్రామదోషాన్ సముత్పన్నాన్ గ్రామికశ్శనకైః స్వయమ్
శంసే ద్గ్రామదశేశాయ దశేశో వింశతీశ్వరే.

వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్,
శంసే ద్గ్రామశతేశస్తు సహస్రపతయే స్వయమ్.
యాని రాజప్రదేయాని ప్రత్యహం గ్రామవాసిభిః,
అన్నపానేంధనాదీని గ్రామిక స్తా న్యవాప్నుయాత్.
దశీ కులంతు భుంజీత వింశీ పంచకులానిచ,
గ్రామం గ్రామశతాధ్యక్షః సహస్రాధిపతిః పురమ్.
తేషాం గ్రామ్యాణి కార్యాణి పృథక్కార్యాణి చైవహి
రాజ్ఞోఽన్య స్సచివ స్స్నిగ్ధ స్తాని పశ్యే దతంద్రితః.
—7- 114-120.

(అనగా, ఒక రాజు తనరాజ్యమున రెండు, మూడు, లేక అయిదు గ్రామముల మధ్య నొక "గుల్మము" నేర్పరచవలెను. అట్లే నూరేసి గ్రామముల కొక విచారణాధికారిని నియమించవలెను. వీనిలో ఒక్కొక్క గ్రామమున కొక్క గ్రామాధికారి,పదిగ్రామముల కొక యాధిపతి, యిరువది గ్రామముల కొకడు, నూరుగ్రామముల కొక శతగ్రామాధికారి; వెయ్యియూళ్ల కొక సహస్రపతిని నియమించవలెను. ఇందు గ్రామాధికారి తన గ్రామమున జరుగు నేరములను తాను నెమ్మదిగా విచారించి, ఆనేరములను దశగ్రామాధికారికి తెలుపవలెను. ఇట్లే దశగ్రామాధికారి శతగ్రామాధికారికి, ఆతడు సహస్రగ్రామాధికారికిని తెలుపగా, ఆత డట్టి నేరములను విచారించి తీర్పుజెప్పును. గ్రామాధికారి ప్రతిదినము గ్రామజనులు రాజున కొసంగవలసిన యన్నము, నీరు, వంటచెఱకు, మున్నగు వానిని తాను తన జీవికకై కైకొనవలెను. పదిగ్రామముల యధిపతి ఒక "కులము" భూమిని తన జీవికకై యనుభవించ

వలెను. ఇరువది గ్రామముల యధిపతి ఐదు "కులముల"ను
ననుభవించ వలెను. నూఱు గ్రామముల యధికారి
ఒక సామాన్య గ్రామమును, వేయిగ్రామముల
యధిపతి యొక పట్టణమును అనుభవింపవలయును.
గ్రామాధిపతి మొదలగువారు చేసిన తీర్పు లొండొంటికి
విరుద్ధములై, గ్రామజనులు రాజునకు జెప్పికొన్న
యెడల అట్టి వివాదములను మంత్రి చక్కగ విచారించ
వలెను.

ఇప్పటి బ్రిటిష్‌రాజ్యమునందలి గ్రామమునసబు,
ఫిర్కా-ఇన్స్పెక్టరు, తాలూకా తహసల్దారు, జిల్లా
కలెక్టరు, యీ విధాన మంతయు సూత్రప్రాయముగ
బీజరూపముగ మనుస్మృతిలో జెప్పబడినది. వీరందరి
నిత్యవిధులు, పారితోషికములు, ఒకరిపై నింకొకరి పై
"అప్పీళ్ళు" యిందు విధించబడినవి. ఈ సూత్రములను
అనేక హిందూరాజులే కాదు – తురకరాజులే కాదు-
యిటీవల బ్రిటిష్‌పాలనకూడ భేదింపజాలకపోయెను.
ఇందలి ఆర్థికసూత్రములను విచారించినచో మన
బి. యే., ఎం. యే. లందఱు ఇక తమ బొస్టబుల్సుకు
స్వస్తి జెప్పి,మనువునారాధించక తప్పదు.ఉదాహరణకు
మన గ్రామాధికారుల నౌఖరీ యీనాము లీ మనుస్మృతి
ననుసరించుచున్నవి. అట్లుగాక మన వెట్టివాని మొదలు
ప్రభువులకు జీతముల నిచ్చెడిచో యెంత ధన వ్యయ
ము? ఎంత వృథా ప్రయాస? లేక గ్రామాధికారి
మొదలు గవర్నరు వఱకు ప్రభుత్వ "యీనాందా
ర్ల"యినచో పరిపాలన యెంత సుకరముగ నుండును?
ప్రజల కెంతతుష్టి, ప్రభువుల కెంతగౌరవము లభించును.

అటులని ప్రస్తుత జమీందారీలవంటి బోద-కాలు ప్రభుత్వ మును కాదు. అనగా రాజుకు పదిలక్షలు - ప్రజకు నిత్యోపవాసవ్రతమును! ఈ మనుస్మృతి రాజకీయ సూత్రములను గమనించినచో మన ప్రకాశం బిల్లు వంటి అవక తవక సంస్కృతి యవతరించెడిదే కాదు. సైమను రిపోర్టులోని పేటక నివేదికయు, మన కబ్బె డిది కాదు. భారత పాలన తిరిగి యెప్పటికైనను తన సమాజ సామరస్యమును, సౌభాగ్యమును, బొందవలె నన్నచో, తిరిగి మనుశాసనములు ప్రతిష్ఠింప బడవలసి నదే. ఇందుకు నాకెట్టి సందేహమును లేదు.

"అహింసా పరమో ధర్మః"

మన మీ రోజులలో నిత్యమును, విధి విరామములు లేక, జపించుచున్న "అహింసా" మంత్రము గూర్చి మను వేమనెనో మన మొక్కసారి చూచినచో యిప్పటి మహా అజ్ఞాన తిమిర మొక్క త్రుటిలో నంత మొంద గలదు.

శ్లో॥ ఏవం విజయమానస్య యేఽస్య స్యుః పరిపంథినః;
తానానయే ద్వశం సర్వా న్సామాదిభి రుపక్రమైః.
శ్లో॥యది తేతు న తిష్ఠేయు రుపాయైః ప్రథమైస్త్రిభిః,
దండే నైవ ప్రసహ్యైతా ఞ్ఛనకైర్వశమానయేత్,
శ్లో॥సామాదీనా ముపాయానాం చతుర్ణామపిపండితాః,
సామదండౌ ప్రశంసంతి నిత్యం రాష్ట్రాభివృద్ధయే.
—7-107-109.

(రాజు తన విరోధు లగు నరపాలురను సామదాన ద దండోపాయములచే వశపరచుకొనవలెను.

వారు మొదటి మూడు ఉపాయములవల్లను లొంగరేని అప్పుడు బలముచే యుద్ధము చేసియే బలాత్కారముగ వారిని మెల్లగా వశపరచుకొన వలయును. ఈ నాలుగు ఉపాయములలో సామమున ప్రయాస, ధనవ్యయము, జన నాశము మొదలగు దోషములు లేనందునను, దండమున నవి యున్నను, కార్యసిద్ధి యగును గాన, సామ దండములను రెండింటిని రాజ్యాభివృద్ధికొఱకు పండితులు ప్రశంసించుచున్నారు.)

శ్లో॥ యా వేదవిహితా హింసానియతాఽస్మింశ్చరాచరే,
అహింసామేవ తాం విద్యా ద్వేదా ద్ధర్మోహి నిర్బభౌ.
(5-44)

(వేద విహితమగు హింస అహింసయే యగును. ఏల యన, వేదమునుండియేకదా ధర్మము వెలయుచున్నది!)

శస్త్రం ద్విజాతిభి ర్గ్రాహ్యం ధర్మో యత్రోపరుధ్యతే,
ద్విజాతీనాం చ వర్ణానాం విప్లవే కాలకారితే.
ఆత్మన శ్చ పరిత్రాణే దక్షిణానాం చ సంగరే,
స్త్రీవిప్రాభ్యుపపత్తౌ చ ఘ్నన్ ధర్మేణ దుష్యతి.
గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్
ఆతతాయిన మాయాంతం హన్యా దేవావిచారయన్.
—8- 348-50.

(ఏ సమయమున సకలవర్ణముల వారికి.సకల ఆశ్రమముల వారికి సాహసికులు మున్నగు వారివలన స్వధర్మము నడుప వీలుగాక పోవునో, అప్పుడును, రాజ్యము లరాజకములై యుండునపుడును,శత్రురాజులు దండెత్తి వచ్చినపుడును స్త్రీలను బ్రాహ్మణులను సంరక్షించు

టకును, ఆత్మరక్షణమునకును, ద్విజాతులు శస్త్రముల బూని, తమ్ము జంపవచ్చిన శత్రువులను ధర్మయుద్ధమున జంపుట పాపముకాదు. గురువు, బాలుడు, వృద్ధుడు, బహుశ్రుతుడగు బ్రాహ్మణుడు వీరిలో నెవరైనను జంప వచ్చిన ఆతతాయులైన నిస్సంశయముగ జంపవలెను.)

## యుద్ధ విషయములు

ఇటులనే యుద్ధ సంబంధమగు విషయముల గూర్చి మనుస్మృతి చక్కగ వివరించుచున్నది. శత్రుమిత్రులలో నొక రాజ్యమునకు ప్రక్కవాడు సాధారణముగ మనకు శత్రు వగును. వాని కవతలవాడు యేకాంతర మిత్రుడు. (7-158) మనతోడిరాజు లందరితో సామాద్యుపాయముల బ్రయోగించి, వేరువేరుగ గాని, సమిష్టిగాగాని, సంధి చేసుకొనవలెను. (Individual and Collective or Axis Alliances)

సంధించ విగ్రహం చైవ యాన మాసన మేవ చ,
ద్వైధీభావం సంశ్రయంచ షడ్గుణాం శ్చింతయే త్సదా.
—7-16

(ఉభయుల ప్రయోజనములను యోజించి, సంధి, యుద్ధము, యుద్ధయాత్ర, ముట్టడి, వేరుపరచుట, శత్రు బాధ కోర్వక శత్రుని మించిన రాజు నాశ్రయించుట, యీ ఆఱు ఉత్తమగుణములను బరికించి, యే గుణము నాశ్రయించిన తనకు మేలును, శత్రువునకు కీడును గలుగునో, అట్టి గుణము నవలంబింపవలయును.) ఈ యాఱుగుణములు తిరిగి పండ్రెండు శ్రేణులుగ విభజించ బడినవి. (Defensive and offensive) "ఎప్పుడు

తనకు ముందు ముందు లాభము కలుగు నని నమ్మక ముండునో, అప్పుడు తాను స్వల్పముగ శత్రువున కొసంగికాని, తాను శత్రువునుండి కైకొనిగాని, సంధి చేసుకొనవలెను. ఎప్పుడు తనమంత్రులు, ప్రజలు ఉత్సాహముగ నున్నారో, తనసేన, బొక్కసము నిండి యున్నవో, అప్పుడే శత్రువుపైకి దండెత్తవలెను. ఎప్పుడు శత్రుబలము దుఃఖమయమై, శోషించి యుండునో, అప్పుడు వానిపై దండెత్తవలెను. ఎప్పుడు తనబలములు క్షీణించి విచారగ్రస్తముగ నుండునో, అప్పుడు మంచి మాటలతో ను, దానము చేతను శత్రువులను స్నేహము చేసికొనవలెను." "ఒండొరులతో బోరాడు రాజులకుయుద్ధమున జయాపజయములు నిత్యములుకావు. కావున యెప్పుడును యుద్ధముచేతనే శత్రువులను లోబఱచుకొన జూడరాదు. కాని మొదటి మూడు ఉపాయముల వల్లను కార్యసిద్ధి కానప్పుడు మాత్రము యెట్లు శత్రువును జయింప సాధ్యమో అట్లు పూనికతో యుద్ధమునే చేయవలయును."

రాజలక్షణము లెట్లుండవలెనో, మంత్రి, సేనాధిపతి, చారులు, సేవకులు యెట్టివారిని నియమించవలెనో సాక్షులు, శిక్షలు, సుంకములు, వడ్డీవిషయము మున్నగు విషయము లెన్నియో యీ మనుస్మృతివల్ల మనము గ్రహించగలము. రాజవధ్యు డగుచో, యీ కాలమున రాజ మండలి (Council of Regency) అనబడు సంస్థ కిచ్చుట చక్కని సూత్రములు నిరూపించబడినవి. కోటలు ఆఱువిధములు-మరుదుర్గము, భూదుర్గము, జలదుర్గము, వృక్షదుర్గము, మనుష్యదుర్గము, గిరిదుర్గము-రాజు

తన రాజ్యలోపముల నొరులకు తెలియనీయక శత్రుమర్మము లను తెలుసుకొనుటకు యత్నించ వలెను. నాలుగు వీధుల నడుమ వేశ్యాగృహము, పూటకూళ్ళయిండ్లు, చోరులను బట్టు స్థలములు నుండరాదు. యుగసంధిలో ధర్మసందేహముల దీర్చుటకును, స్మృతిధర్మములను మార్చుటకును, పండిత పరిషత్తులు సూచించ బడినవి. (Provision for Amendment of Constitution )ఈ పరిషత్సభ్యుల గుణగణము లెట్లుండవలెనో, అట్టివారు పదుగురు లభ్యము కానిచో, వేదవిదు డొక్కడే పరిష త్తన బడును.

శ్లో॥ మునీనామ్ ఆత్మవిద్యానామ్
ద్విజానామ్ యజ్ఞయాజినామ్
వేదవ్రతేషు స్నాతానామ్
ఏకోపి పరిష ద్భవేత్.

## ఇతర విషయములు

ఇట్లనే యెన్నియో విషయము లీ స్మృతియందు వివరించ బడినవి. ఒక్క రాజధర్మములే కాదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదు లందఱ విధులును, స్త్రీ పురుష ధర్మములును యిందు నిరూపించ బడినవి.

ఒక్క ఐహిక విషయములే కాదు. ఆముష్మికముల గూర్చి గూడ మనుస్మృతి మోక్షసాధనమే.

ఏవం య స్సర్వభూతేషు పశ్యత్యాత్మాన మాత్మనా,
స సర్వసమతా మేత్య బ్రహ్మాభ్యేతి పరంపదమ్. 12-125

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
సమంపశ్యన్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి. 12-91

సర్వ మాత్మని సంపశ్యే త్సచ్చాసచ్చ సమాహితః,
సర్వం హ్యాత్మని సంపశ్య న్నాధర్మే కురుతే మనః.

ఆత్మైవ దేవతా స్సర్వా స్సర్వమాత్మ న్యవస్థితమ్,
ఆత్మాహి జనయత్యేషాం కర్మయోగం శరీరిణామ్.

ఖం సన్నివేశయే త్ఖేషు చేష్టన స్పర్శ నేఽనిలమ్,
పక్తి దృష్ట్యోః పరం తేజః స్నేహేఽపో గాంచ మూర్తిషు

మనసీందుం దిశః శ్రోత్రే క్రాంతే విష్ణుం బలే హరమ్,
వాచ్యగ్నిం మిత్ర ముత్సర్గే ప్రజనేచ ప్రజాపతిమ్.

ప్రశాసితారం సర్వేషా మణీయాంస మణోరపి,
రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తం పురుషం పరమ్
12-118-122.

బ్రహ్మచర్యంబున గురువును దైవముగను, గాయత్రిని మాతగను, స్త్రీలకు భర్తయే దైవమనియు తుదకు తన్నుతా నెఱుగుటకై ఇంద్రాదిదేవత లందఱు తనలోనే యున్నారని యీ విశ్వమందు జీవుడు తన బాహ్యాకాశమును ఉదరాదులతో గూడిన శరీరాకాశమునందును, దైహిక వాయువునందు బాహ్యవాయువును, కడుపులోని.కంటిలోని వెలుగునందు నగ్నిసూర్యులను, దైహిక జలములందు బాహ్యజలములను, బాహ్యపృథివిని శారీర పార్థివ భాగము అందును, మనంబునందు జంద్రుని, శ్రోత్రముల దిక్కులను, పాదములందు విష్ణువును, బలమున హరిని, వాక్కున నగ్నిని, పాయ్వింద్రియమున మిత్రుని, ఉపస్థేంద్రియమున బ్రజాపతిని లీన మొనర్చి తాను సిద్ధుడగుటయే ఉత్తమోత్తమ మానవాదర్శముగ మనువు చెప్పుచున్నాడు.

కొన్ని చోట్ల మనుశాసన మీ కాలమున కన్వయించని మాట వాస్తవమే. మఱికొన్ని చోట్ల యీ సూత్రములు మనకు శూలముల వలె స్ఫురించును. ఉదాహరణకు ఆంధ్రులను ఆ కాలమున మనువు అడవిమృగములను హింసించుజాతిగ వర్ణించెను. 10:48. శూద్రులగూర్చియు యిచ్చట కొన్ని తీవ్రభాషణములు లేకపోలేదు. కాని మనుస్మృతి యీ ౫౦౪౧ వ కల్యబ్దమున కుద్దేశించబడిన గ్రంథము కాదు. మనుస్మృతినాటికి బ్రాహ్మణులు యజ్ఞములందును, శ్రాద్ధభోజనములందును, ప్రాణాపాయదశయందును, మాంసభక్షణ జేయవచ్చునని యిందు వ్రాయఁబడినది. (5-28) "శ్రాద్ధ విధిచొప్పున శ్రాద్ధకాలమందు మనుజుడు మాంసమును భక్షింపడేని, ఆతడు దేహాంతమున నిరువది యొక్క జన్మములు పశువుగ జన్మింప గల"దని మనువు వ్రాసెను. (5-35) కాని అప్పటికిని, యిప్పటికిని దేశకాల భేదము లెన్నియో కలవు. అందుచేతనే "కలౌ పారాశరః" అని యీ కలియుగమందు పరాశరస్మృతి సిద్ధాంతముగ జెప్పుచున్నారు. ఇప్పుడు తిరిగి యింకొక యుగాంశ మారుచున్నదని పెద్ద లందురు. కావునయిప్పుడు కాలానుగుణ్యముగ యింకొక మానవస్మృతి యవసరము. కాని, యీ స్మృతి నిర్ణయించుట కైనను యీ సంఘస్థాపకు లగు మను, గౌతమ, పరాశరాదుల స్మృతి ధర్మములను పఠించుట, గ్రహించుట మన కెల్లరకు విధి. దీనినిబట్టి మేగ్నాకార్టాగాని, మీన్ కేంఫ్ గాని, కమ్యూనిస్టు మేనిఫెస్టోగాని, అమెరికా రాజ్య చట్టము గాని, మనము పఠింపనక్కర లేదని కాదు. కాని మనజాతి కిప్పు డబ్బిన దీర్ఘ

విస్మృతిలో తిరిగి మన శృతి స్మృతుల నొక్కసారి స్మరించుట యవసరము. భారతీయు లెన్నటికిని యింకొక జాతి ననుకరింప జాలరు. మానవకోటిలో మన వ్యక్తిత్వమును మనము నిలువబెట్టుకొనవలెను. ఇందుకీ స్మృత్యాదులే మన కిప్పటి ఆధారములు. వీని పఠనము తిరిగి మనజాతిని ఆత్మోన్ముఖుల జేయును. తదుపరి మన కొక నూతన స్మృతియు, నూతన సృష్టియు నబ్బగలవు. అప్పుడే భారతీయులు భారతీయు లగుదురు. మన "స్వ" రాజ్యమందలి "స్వ" త్వము సార్థకము కాగలదు.

## సాంఘిక విషయము

బాబూ భగవాన్‌దాసు గారి వ్యాసములు సంఘ నిర్మాణమున కెక్కుడు సంబంధించిన వగుటచే మన ప్రస్తుత సాంఘిక అవసరములగూర్చి యొక్క ముక్క జెప్పు టవసరము. ఇదియొక నూతన స్మృతి సమయ మనియు, యిప్పుడొక నూతన స్మృతి యవసర మనియు, మన ఆంధ్రరత్న యభిమత మని పైన వాక్రుచ్చితిని. పూర్వము మన్వాదులు తమ గ్రంథములందు వర్ణించిన సంఘస్థితికిని, యిప్పటి మన సంఘమునకును యెంతయో తారతమ్య మున్నది. ఇచ్చట భగవాన్‌దాసు గారు చెప్పినట్లు పూర్వకాలపు శూద్రజాతు లెందరో యిప్పుడు ద్విజాతు లైరి. పూర్వపు బ్రాహ్మణోత్తములును వణిగ్వ్యాపారాది కార్యకలాపమున బడియు, గుణసాంకర్యము చేతను, కొందఱు వైశ్యులు, మరికొందఱు చండాలురుగూడ నగుచున్నారు. గీతలలో శ్రీకృష్ణుడు సూచించినరీతిగ భారతావనియందును, మానవకోటి యంతకును గూడ, గుణకర్మలబట్టి యిప్పుడు తిరిగి సంఘవిభజన,

పునర్నిర్మాణము కావలసియున్నది. క్రైస్తవ, ముసల్మాన్, బౌద్ధప్రపంచ మెల్ల నిప్పుడు హాలాహల మధ్యమున బడి భస్మీకృత మగుచున్నది. ఈ మథనము మన హైందవ ప్రపంచమునకు గూడ త్వరలో రాకతప్పదు. అందుచే భావి భారతసృష్టి యెట్లుండవలె నను ప్రశ్న యిప్పు డసమంజసము కానేరదు. క్రైస్తవ, బౌద్ధ మతము లంతరించిన వని చెప్పవచ్చును. ఇప్పు డీ దేశముననే కాదు. ప్రపంచ మంతలోను యిస్లామ్ మతము బ్రతిష్ఠించవలె నని ఖక్సార్ మున్నగు సంఘముల వారు యత్నించుచున్నారు. ఆంధ్రరత్న గోపాలకృష్ణుడిప్పు డీ సంఘమునంతను, పేక కలిపినట్లు, తిరిగి కలిపి, సంఘవిభజన గావించి, ప్రపంచమం దంతటను బ్రాహ్మణ ధర్మస్థాపన జేయవలె నని సంకల్పించెను. లోగడ బౌద్ధమతానంతరమున అవతరించిన ఆదిశంకరుల వలె శ్రీ గోపాలకృష్ణుడు తన నూతన బ్రాహ్మణ ధర్మమునకు క్రైస్తవ ముసల్మాన్ ఆది (సంఘ) సమన్వయ సూత్రము నే సూచించెను. గాంధీ మహాత్ముడు, కాంగ్రెసు హిందూసభ, మున్నగువారందఱు నిట్టి సమన్వయమునే ఆశించుచున్నారు. కాని యీ సమన్వయ మెట్లు లభ్యమగునో యెవ్వరును సూచింపజాలకున్నారు. కేవల హృదయ సంపుటివల్లగాని (Heart union) లేక దస్తావేజు ఖరారుల (Pacts) వల్లగాని యిట్టి సమన్వయము సమకూరు నను ఆశలన్నియు అడియాస లగుచున్నవి. హృదయము మొకసారి యిటు, యింకొకసారి యింకొక వైపు లాగును. ఖరారునామాల కంతకంతకు విలువ తగ్గుచున్నది. సరి యగు, స్థిరమగు సంఘ సమన్వ

యమునుగూర్చి బాబూ భగవాన్ దాసుగారి గ్రంథమున నొకచోట యీ విధముగ సూచింప యత్నించెను.

“వర్ణములో మార్పు యెట్లు చేసికొన వలెనో 10-57—65 లో మనువు విధించెను.

శ్లో|| శూద్రో బ్రాహ్మణతా మేతి
బ్రాహ్మణ శ్చైతి శూద్రతామ్
క్షత్రియా జ్జాత మేవం తు
విద్యా ద్వైశ్యా త్తథైవచ.

ఈ మార్పు పూర్వ కాలములో ఒక్క జన్మము లోనే సాధ్యపడుచుండెను. కాని తరువాత తరువాత కొన్ని జన్మలలోగాని యది సాధ్యము గాక యుండెను. ఇప్పుడు ఒక వర్ణములో పుట్టిన బిడ్డయొక్క జాతకమును చూచినయెడల వాడు మరియొక వర్ణమునకు జెందిన స్వభావము గలవాడుగా కనబడుట సాధారణముగా తెలిసిన విషయమే. ఈ జాతకశాస్త్రమును బాగుగా నవలంబించిన యెడల వర్ణవిభాగము సులభ మగును. దానివల్ల వృత్తివిభాగము కూడ సులభమగు”నని బాబూ భగవాన్దాసుగారి సూచన. (137 పుట).

ఈ విషయమై మన బాలకుల విద్యావిధానము గూర్చి ఆంధ్రరత్న భావములు, అతని ‘పురుషార్థములు’ 5 వ అధ్యాయమునుండి గ్రహింప నగును. ఇందలి విషయ ప్రాముఖ్యముచే, ముఖ్యసూత్రములను మాత్ర మిట బొందుపరచుచున్నాను.

## అధికారి వివేచనము

“బాలశిక్ష:—గుణకర్మవిభాగము ననుసరించి యధి

కారి నిర్ణయ మొనర్పవలయును. ఇదియే బాలకుని స్వరూప స్వభావనిర్ణయము. అయిదు తరగతులు ముఖ్యముగా నేర్పబడును. సత్త్వవృత్తి ప్రధానముగా గలవారును, రజోవృత్తి ప్రధానముగా గలవారును, తమోవృత్తి ప్రధానముగా గలవారును, సములును, మిశ్రులును. ఇందు సములు చాల అరుదుగా నుందురు. .........కావున సామాన్యముగా నాలుగు గణములు మాత్రమే యేర్పడును. సత్త్వగణము, రజోగణము, తమోగణము, మిశ్రగణము. ఈ నాలుగును నాలుగు తరగతుల పేర్లు...ఈ గుణ విభాగమునకు మూడంశము లాధారభూతములు.

౧. బాలకుని కులగోత్ర సంప్రదాయములు.

౨. జాతకము.

3. అనుభవము.

మొదటి రెండును బాలకుని స్వభావము నిదమిత్థమని నిర్ధారణ చేయజాలవు కాని, సూచించుననుట మాత్రము నిజము. ఈ సూచనను బట్టియే యనుభవము నడచును. అనుభవమునకు మాత్రము సిద్ధాంతాధికార మున్నది....

"సత్త్వగణము:—శృంగార, కరుణ, శాంత, రసనిష్ఠు లగువా రిందు చేర్చబడుదురు. అనగా 'విద్యాబోధకులు' 'మతబోధకులు' న్యాయస్థానము నందు పని చేయు వారును, మంత్రులు, అమాత్యులు, వైద్యులు, వేద శాస్త్రములందు శ్రవణమననాదులు గలవారి యొక్క భావపరంపర, శాంతరస పోషకము లగు వ్యాపారము లందే సంచరించుచుండును." కావున బోధన విషయ ములు వారి కను వగునట్లు కూర్పవలయును.........

"రజోగణము.—శృంగార, వీర, కరుణ, హాస్య, రౌద్ర, రసపోషకము లగు వ్యాపారముల యందాదరణ గలవారి నీ గణమందు జేర్పవలయును. క్షాత్రకర్మ; పరిపాలనాపేక్ష; సంగీతసాహిత్యనాట్యాది కళాకలాపము, వినోదక్రీడలయం దత్యంతాభిరుచి, రూప కల్పన, సంగీత, సాహిత్య, చిత్రలేఖన, శిలా, దారు, తక్షణ, శిల్పనాట్యాదిమార్గములయందు సంచరించు వారిందుండ నర్హులు." బోధనాపద్ధతులలో యేతద్రస ప్రధానవిషయములు నేర్పవలయును.........

"తమోగణము—శృంగార, హాస్య, రౌద్ర, బీభత్స, భయానక రసపోషకము లగు వ్యాపారములయం దాద రణగలవారి నీ గణమందు జేర్పవలయును. ఇందు శస్త్ర కర్మ, వ్యవసాయము, వణిగ్వృత్తి, పాశుపాల్యము, వస్తుకల్పన: అనగా స్వర్ణకారవృత్తి, వడ్రంగము, నేత, పాత్రనిర్మాణవృత్తి మొదలయిన మార్గములందు సంచ రించువా రిందుండనర్హులు." బోధనాపద్ధతులలో ఏతద్రస ప్రధానము లగు విషయములు నేర్పవలయును......

"మిశ్రగణము—రసాభాసవ్యాపారము లం దాద రణగలవారిందు జేర్పబడవలయును. వీరు ప్రస్తుత మిట్లు న్నను సాధనచే నితర గణములయందు జేర నర్హులగు దురు"...భటవృత్తి. గౌండ్ల, కుమ్మరివృత్తులు, అంబష్ఠ వృత్తి, రజకవృత్తి, చర్మకారవృత్తి మొదలగు వృత్తుల యందుండువారు మిశ్రగణమునకు జెందుదురు. బోధనా విషయములందు రసపిపాసకులనుగ జేయునవి వీరికి నేర్ప వలయును.

"ఈ సత్వ రజస్తమోగుణములలో ఉత్తమమధ్య
మాధమాది వివక్షత తప్పు; నిరర్థకముగూడ నగును ఆట్లు
భావించుటవలన గీతావాక్యానుసారమైన స్వధర్మాను
ష్ఠానమునకు భంగము వాటిల్లును. వృత్తిభేదము, మార్గభేద
నిరూపణ గావించునదిగాని వేరొండు గాదు. ప్రతివ్యక్తి
యందును మూడుగుణములు నుండును, అందెద్దియొ
యొకటి ప్రాధాన్యము వహించును. సత్వగుణ ప్రధాను
లకు జ్ఞానమార్గమును, రజోగుణప్రధానులకు భక్తిమార్గ
మును, తమోగుణప్రధానులకు కర్మమార్గమును అనుష్ఠేయ
ములు." (ఆంధ్రరత్న పురుషార్థములు)

## సాంఘిక ప్రణాళిక

ఈ విభాగములందు జేర్పబడు బాలకుల చిత్త
వృత్తులు, ఆహారవ్యవహార నిద్రాదినియమములు, వీరికి
వలయు ఉపాసనాశిక్షణల గూర్చి శ్రీఆంధ్రరత్న మా
గ్రంథమునందే స్థాలీపులాక న్యాయముగ సూచించెను.
కాని వానిగూర్చి యిట విస్తరింపవీలులేదు. శ్రీకృష్ణుడు
గీతలలో "గుణత్రయ విభాగయోగము"న నుదహరిం
చిన మూలసూత్రములను, మనజాతీయ విద్యావిధాన
మున, పైన గోపాలకృష్ణులు సూచించిన మార్గమున బ్రతి
ష్ఠింపించుటయే యిప్పటి విద్యావిధానమునకు వలయు
మూలసంస్కారము. మన విద్యావిధానమీరీతిగ సంస్కా
రింపబడిన పిమ్మట మన జాతియంతయు సత్వోద్భూత
ముగ నూతనసాంఘికపరిణామము నొందగలదు. ఇది
యెట్లుండు ననగా—

"ఈ నూతన బ్రాహ్మణసంఘమున" కొందఱు
వైదికులుందురు...వీరు సత్వగుణప్రధానులు. మరికొం

దఱు క్షత్రియు లుందురు. వీరు రజోగుణప్రధానులు.
ఇందు చేరుటకు రాజపుత్రులు, మహమ్మదీయులు,
సిక్కులు, ఘూర్ఖాలు మున్నగువా రర్హులై యుందురు.
అటులనే మన వైశ్యజాతు లందఱును కలసి నూతన
వైశ్యులగుదురు. సేవకు లందరు శూద్రు లనబడుదురు.
ఇందులో మూలసూత్రములు మూఁడుసూత్రములే. సమన్వ
యములో మాత్రము ఇప్పటి సంఘములో నున్నటుల అర్థ
రాహిత్యముగ గాక సరిగా శాస్త్రముఁజూచి, సంఘముఁ
జూచి, శాస్త్రములోని ముఖ్యసూత్రములు, సంఘము
లోని ప్రధాన వృత్తులతో సమన్వయ పరచి యే ఫక్కీని
నడిపిన యీ జాతిముక్తియు, లోక కల్యాణమును
చేకూరునో, ఆ రీతిగా ఈ సంఘమును నడపుట మన
ధర్మము. ఇందు కొకటి రెండుదాహరణల నిట బొందు
పరచెద. కొందఱు బ్రాహ్మణేతర జాతులలో వైదిక
కౌంతు, పూజారియర్హత యున్నవారు కలరని వింటిమి.
వారికి సరియైన యర్హత యున్నచో తప్పక వారిని
పూజారులలో కలుపవచ్చును ఇప్పుడు శూద్రు లనియెడి
కమ్మ, కాపు, రెడ్డికులములను జూడుడు! గీతాచార్యులు
కులధర్మములు చెప్పుచు, వైశ్యులకు కృషి, గోరక్షణ,
వాణిజ్యము, స్వీయవృత్తు లని చెప్పెను. కాని,యిక్కా
లపు సంఘములో వణిగ్జనులు మాత్రమే వైశ్యు లనబడు
చున్నారు. ఈ తారతమ్యమునకు కారణ మేమి? గీతలు
తప్పా? లేక మన బుద్ధిమాంద్యమా? ఇక ముందు
నుండి కృషి, గోసంరక్షణ చేయు కుటుంబముల వా
రెవరైనను మా వద్దకు వచ్చునెడల వారి అక్షరజ్ఞానము
వగైరా గుణకర్మలు పరీక్ష జేసి వారికి గాయత్రి యుప

దేశము చేయుటకు మాకెట్టి అభ్యంతరమును లేదు. ఇక శూద్రులలో నిప్పటి అంబాడీలు, యెరుకలు, యానాదులు వగైరా జాతులలో కొలది మంది మాత్రము మిగులుదురు. ప్రస్తుతము మాకు వారిని శూద్రత్వములో నుంచక తప్పదు. ఇందు మా పరీక్షకు లోబడి, మా శిక్షణ నంగీకరించు వా రెవ్వరైనను సరే - క్రైస్తవులైనా సరే మహమ్మదీయులైనా - మా కణుమాత్రం అభ్యంతరము లేదు. ద్విజార్హులైనవో యజ్ఞోపవీతము వేసి మాకు తోచినంత కాలము గురు శుశ్రూష చేయించుకుంటూ, అటుపిమ్మట గురు దక్షిణ గైకొని వారి వారి యుచిత ధర్మములకు వారిని ప్రేరేపించెదము. ఈ విధముగా కొంతకాలము జరిగిన పిమ్మట సంఘ మెట్లు పునరుజ్జీవనము జెందునో చూచెదము గాక! ఇదీ, మా సాంఘిక ప్రణాళిక". (గోష్ఠి 7-150)

ఈ రీతిగ సంఘనిర్మాణము జరిగినచో భారతావని అచిరకాలముననే తిరిగి ప్రపంచనాయకత్వము వహించి తీరును. ఈ లోగా ఆంధ్రరత్నము సెలవిచ్చి నటుల మన మీ పేకను బాగుగ తిరుగవేసి కలుపవలెను. అనగా యిప్పు డందఱు బ్రాహ్మణులు కావలయు.

"సర్వం ఖల్విదం బ్రహ్మ"

శ్రీమద్రమారమణ గోవిందో హరిః

గోష్ఠి, బెజవాడ }
క్షీరాబ్ధి ద్వాదశి } గుమ్మిడిదల వేంకట సుబ్బారావు,
అధ్యక్షుడు.

---

# సంఘ నిర్మాణశాస్త్రము

(మనుధర్మశాస్త్రము ననుసరించి)

## విషయసూచిక

### ప్రథమాధ్యాయము : మనుధర్మశాస్త్రమున కాధారము



### ద్వితీయాధ్యాయము : సృష్టిక్రమము—జీవితసమస్యలు

---

# సంఘనిర్మాణ శాస్త్రము

(మనుధర్మశాస్త్రము ననుసరించి)

## ప్రథమాధ్యాయము

## మనుధర్మ శాస్త్రమున కాధారము



స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా మథర్వాయ
జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ (ముండకోపనిషత్తు 1-1-1)
ధ్యానికం సర్వమేవైతత్ యదేత దభిశబ్దితమ్ ।
న హ్యనధ్యాత్మవిత్ కశ్చిత్క్రియాఫల ముపాశ్నుతే॥
(మను. 6-82)

### 'అహం'—భావము

ఋగ్వేదములో ఐతరేయ ఆరణ్యకములో ధాతువులు కేవల ప్రాణధారులై యునికి గలిగియున్నవనియు ఓషధులకు సంవేదన మున్నదనియు, మృగములకు తెలివి యున్నను తమ యునికిని అనుభవములను, తెలియుటను ఎరుగవనియు, మనుష్యుడు ఉనికి, అనుభవము, తెలివిగలిగి తానవి కలిగియున్నాడను ననియును చెప్పబడి యున్నది. ఈ రెండింటి 'అహం' భావమువల్ల కలిగినది.

ఈ ప్రపంచ పరిణామములో ఈ 'అహం' భావము మొట్టమొదట మనుష్యునియందు పుట్టినది. అందుచేతనే మనుష్యునకు పరమాత్మను, సంసారక్రమమును తెలిసికొనుట సాధ్యమగుచున్నది. ఈ 'యహం'భావ ముండుటచేతనే మనుష్యుడు మానవుడని, మను పుత్రుడని, మనస్సుగలవాడని చెప్పబడుచున్నాడు. తక్కిన యే భూతములును మనుష్యునివలె భూతభవిష్యద్వర్తమానములకు తమతో సంబంధము కలిపి ఆలోచన చేయజాలవు. ఆత్మానాత్మ విచక్షణ చేయజాలవు. ఇతర భూతములలో ఆత్మవిస్ఫూరణము అసంపూర్ణము. ప్రాణులలో మొదట సత్, తరువాత ఆనందము, తరువాత చిత్ వికసించును. మనుష్యునియందు సచ్చిదానందములు మూడును తక్కిన భూతములయందుకంటె నెక్కువ వికాసము నొందియుండుటచేత మనుష్యు డీ సంసార చక్రమునందు మధ్యమ స్థానమునందున్నాడు. మనుష్యజన్మము నెత్తకపూర్వము జీవునకు మోక్షమున కర్హతలేదు. మనుష్య జన్మము వచ్చిన తరువాతనే జీవుడు ప్రవృత్తిమార్గమును విడిచి నివృత్తిమార్గమున బ్రవేశించి మోక్షార్హు డగుచున్నాడు. మనుష్యునియందు అంతఃకరణము, చిత్తిఅణువు, లేక మనస్సు అను ఉపకరణము చక్కగా వికసించి నిత్యానిత్యములను కలుపుచున్నది. ఒకవైపున అనంతములగు భూతభవిష్యత్తులను ఒకవైపున నిత్యప్రస్తుతమును కలుపుటకును మనస్సు వంతెనయగుచున్నది. ఈ మనస్సు—

'ఆభూతసంప్లవం స్థాన మమృతత్వంహి భాష్యతే'

అని వాయుపురాణములో వర్ణింపబడిన అమృతత్వము నకు మార్గమగుచున్నది.

## అధ్యాత్మ విద్య

పరిణామములో జీవునకు మనుష్య జన్మముననే మోక్షార్హత కలుగుటచేత మనుష్యుడు సృష్టియందగ్రగణ్యుడనియును తక్కినభూతము లన్నియును మనుష్యునకు సుఖము సమకూర్చుటకే సృజింపబడినవనియును సామాన్యులు చెప్పు మాటలయందు కొంత సత్యము కన్పించుచున్నది. మోక్షార్హత మానవునకే యుండుటచేత సమస్త ప్రాణులును సహజముగ మానవత్వమును బడయుటకే ప్రయత్నించుచున్నవి. దేవతలు సైతము మానవజన్మమునకై పరితపింతురు. వారి కింకొక విధముగ తరణోపాయము లేదు. 'సర్వస్య చాహం హృది సన్నివిష్టః' సకల భూతముల హృదయములయందు నివసించియున్న ఆ పరమాత్మను గురించి తెలియజేయు విద్య అధ్యాత్మ విద్య యనబడును. 'అధ్యాత్మవిద్యా విద్యానాం' విద్యలలో అధ్యాత్మవిద్యను నేను, అని శ్రీకృష్ణుడు చెప్పినది విద్యను గురించియే. తక్కిన విద్యలు, కళలు, శాస్త్రములు, అన్నియును ఆత్మను తెలిసికొనుటకుద్దేశింపబడినవే అయినను వానిలో నొక్కొక్కటి యొక్కొక్క విషయమును మాత్రము బోధించును గాని యేదియును తక్కినవానిని తెలియజేయజాలదు. ఒక్క అధ్యాత్మ విద్యయే సకల విద్యలను బోధించగలదు. ఆధునిక ప్రకృతి శాస్త్రజ్ఞులు కూడ తమ తమ

అభిమాన శాస్త్రములకు అధ్యాత్మ విద్యయే మూలమని అంగీకరించు చున్నారు. భౌతిక శాస్త్రమునందలి శక్తి వాదము, రసాయన శాస్త్రములోని అణువాదము, శారీరక శాస్త్రములోని ప్రాణశక్తి వ్యాపారవాదము, సకల భూతములయందు వృద్ధి కావలెనను ప్రవృత్తి, వికారములను పొందవలయు నను ప్రవృత్తి, వృద్ధి కావలసిన ప్రాణుల నెంచుకొను ప్రవృత్తి సహజముగ నున్న వను పరిణామవాదుల వాదము, గణితశాస్త్రము నందలి దురూహ్యములైన బిందువు, రేఖ, ఇవన్నియు అధ్యాత్మ విద్యకు అనువాదము చేయని యెడల నర్థము కావు. అందుచేత ఈ విద్య రాజవిద్య యనబడు చున్నది. అది విద్యలకెల్ల రాజు, తక్కిన విద్యలు ప్రజలు. రాజువలెనే అధ్యాత్మవిద్య తక్కిన విద్యలను ప్రేమతో ధర్మమార్గమును తప్పక రక్షించి పోషించును. ఇదియే గీత అ 9-శ్లో. 2 లో 'పవిత్రం, ఉత్తమం, ప్రత్యక్షావగమం, ధర్మ్యం, సుసుఖం కర్తుం మవ్యయం' అని వర్ణింపబడినది.

ఇది విద్యలకెల్ల రాజగుటచేత సమస్తమైన భూపాలురును, ఇహపర సుఖముల గోరినను, రాజ్యపాలనము చక్కగా జేసి జనులయొక్కయు, దేవతలయొక్కయు, ప్రేమ విశ్వాసములను బడయుగోరినను, ఈ విద్యను దీక్షతో అభ్యసించి తెలిసికొన వలయును. అందుచేతనే మనువు.

[సైనాపత్యంచ రాజ్యం చ దండనేతృత్వ మేవ చ
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్రవి దర్హతి.
(12-100.)

[సైన్యాధిపత్యము చేయుటకును, రాజ్యపాలనము చేయుటకును, న్యాయాధిపత్యము చేయుటకును సామ్రాజ్యము ల నేలుటకును వేదశాస్త్రవిదుడే అర్హుడు]. అని చెప్పెను.

## శిష్టాచారము

మనువు కల్పాంతర జ్ఞానము కలవాడును, పూర్వాపర సందర్భములను, కార్యకారణసంబంధములను పరిపూర్ణముగ ఎరింగిన దూరదర్శియు నగుటచేత, ఒక క్రొత్త కల్పములో అనేక కోట్ల జీవులును అణురూపమున సంసారమున బ్రవేశించినది మొదలు నరజన్మమున సంసారమునుండి తరించునంతవరకు వానికి పురోవృద్ధి మార్గమును జూప సమర్థు డగుచున్నాడు. అటువంటి మహాదధికారము గలవాడగుటచేతనే మనువు తనప్రజ కెల్లకాలమునందును అనుష్ఠేయము లగు ధర్మసూత్రములను రచించెను. ఈ రచనయందు మనువునకు సహచరులును శిష్టులును నగు ఋషుల సాహాయ్యముకలదు.

'శిష్టైర్గతేశ్చ నిష్ఠాన్తా చ్ఛిష్టశబ్దం ప్రచక్షతే।
మన్వన్తరేషు యే శిష్టా ఇహ తిష్ఠన్తి ధార్మికాః॥
మనుః సప్తర్షయ శ్చైవ లోకసంతానకారిణః।
తిష్ఠన్తీహ చ ధర్మార్థం తాఞ్ఛిష్టాః సంప్రచక్షతే॥
మన్వన్తరస్యాతీతస్య స్మృత్వా తాః మను రబ్రవీత్।
తస్మాత్ స్మార్తః స్మృతో ధర్మః శిష్టాచారస్స ఉచ్యతే॥
శిష్టైరాచర్యతే యస్మాత్ పునశ్చైవం యుగక్షయే।
పూర్వైఃపూర్వైర్మతత్వాచ్చ శిష్టాచార స్స శాశ్వతః॥'
(మత్స్యపురాణము)

[శిష్ధాతువునుంచి శిష్టశబ్దము వచ్చినది. శిష్ అనగా (ఇతరులకంటె గొప్పవాడని) వెనుక నుండుట అని యర్థము. వెనుకటి మన్వంతరాంతమున శిష్టులై ధర్మ పాలనార్థ మీ మన్వంతరమునం దీ లోకమునం దుండు వారు మనువు, సప్తర్షులు మనువు వెనుకటి మన్వంతరముయొక్క జ్ఞప్తివల్ల ఈ మన్వంతరమునకు తగిన ధర్మములను శాసించెను. కనుక ఆధర్మములకు స్మృతి యను పేరువచ్చెను. శిష్టులచే ఆచరింపబడునది యగుటచేతను, యుగాంతములలో తిరిగి పునఃప్రతిష్ఠ చేయబడునది యగుటచేతను, పూర్వులచేత నవీనులకు, పూర్వులకు వారి పూర్వులచేతను, అవిధముగా పరంపరగా బోధింపబడుచు వచ్చినదగుటచేతను శిష్టాచార మనబడుచున్నది. ]

## రా బో వు మ న్వం త ర ము

ముందువచ్చు మన్వంతరమునకు మనువు సూర్య సావర్ణి. ఆయన స్వారోచిష మన్వంతరములో సురతుడను క్షత్రియుడుగా బుట్టి,పృథ్వీపతిగా నుండి తపస్సు చేసి. తనతో తపస్సు చేయుచుండిన సమాధి యను వైశ్యునితో గూడ మేధసుడను మునియొద్ద శిష్యుడుగా నుండెననియును, తాను మనువైనపుడు చేయవలసినపనికి ఆ జన్మమునందే పునాది వేసెననియును మార్కండేయ పురాణములో నున్నది. అంత దూరదృష్టి లేనివా డెవ్వడును పరిపాలకుడుగ నుండుట కర్హుడు కాడు. మనువు వంటి మహానీయుడు కాకున్నను, ఆత్మవిద్యయందలి సామాన్య విషయములను, అనగా ప్రపంచము ఎక్కడ

నుంచి ఎట్లు పుట్టినది, దాని గమ్యస్థాన మేమి, జీవు డనగా నెవడు, మనుష్యతత్వ మేమి, తనకును ఇతర జీవు లకును సంబంధమేమి, ఇటువంటి విషయముల నైనను తెలిసి ఆత్మనిగ్రహము కలవాడు కానియెడల నెవ్వ డైనను తన కుటుంబస్థులను గాని, రాజ్యప్రజలను గాని లోబరచుకొని పరిపాలించగలడా ? పరిపాలించుట అనగా దండించుట కాదు. జనుల పరిణామమునందు వారికి తోడ్పడి, వారి పురోవృద్ధికి త్రోవ చూపవలెను. కనుక, పరిణామ మనగా నేమో, త్రోవయేదో, తెలి యనివా డెట్లు పరిపాలించగలడు ? అని తెలియనివారి పరిపాలన గురించియే ముండకోపనిషత్తులో—

"అవిద్యాయా మన్తరే వర్తమానాః
స్వయం ధీరాః పండితమ్మన్యమానా
జంజన్యమానాః పరియన్తి మూఢాః
అన్ధేనైవ నీయమానా యథాంధాః."

అని చెప్పబడినది.

ప్రస్తుతము మానవజాతి యవస్థ ఇట్లే యున్నది. రాజు మొదలు బానిసవరకు రాజకీయ వ్యాపారము లతో సంబంధము గలవా రందరును, శాస్త్రపరిశోధకు లును, మతగురువులును, కులీనులును, కర్షకుడును, ధన వంతుడును, దరిద్రుడును, సకల విధములైన రాజకీయ కక్షలకు చెందినవారును, ఎవ్వరును జీవిత రహస్యముల నెరుగరు. ఇంద్రియార్థములకొరకు పనిచేయుచు ఆదర్శ ముల నంగీకరించక వాని ననుసరించుటకు సాధ్యము కాదని నిరసించుచు స్వార్థపరులై, అప్పటి కేది లాభ

కరమని తోచిన దాని నవలంబించుచు ప్రవర్తించు చున్నారు. అట్టివారు తమ తోడి జీవులకు సౌఖ్యము నెట్లు చేకూర్చగలరు ?

మన్వాదు లట్టి స్వార్థదృష్టి గలవారు కారు. వారు సకల లోకములయొక్క భూత భవిష్యద్వర్తమానముల నెరింగినవా రగుటచేత నేపని చేసినను దానివల్ల అప్పుడే గాక, సకల కాలమునకును ఎల్లరకును సుఖ మొనగూడునట్లు చేయుదురు. జీవితోద్దేశములకు విరుద్ధమైన పనిని వారు చేయనే చేయరు. వారు శాసించిన ధర్మశాస్త్రము ప్రకృతినియమముల ననుసరించియుండును. అందుచేత ఆ ధర్మశాస్త్రమును బోధపరచుకొని దాని విలువను గ్రహించుటకు ముందు దానికాధారమైన ప్రకృతి నియమముల నెరుంగవలెను. లేనియెడల ఆ ప్రకృతినియమముల ననుష్ఠించుటకు విధింపబడిన యీ ధర్మశాస్త్రమువల్ల ప్రయోజన ముండెడు.

## పాశ్చాత్యుల చిత్తవృత్తి

ఇక్కాలపు పాశ్చాత్య విద్యా ధురంధరులకు ప్రాచ్యపూర్వకాలపువిద్యలు బోధపడవు. హిందువులు తమ నిత్యకృత్యము లన్నిటిలోను, 'మత' మును తగిలించుట యెందుకో వారికి బోధపడదు. వ్యాకరణము లోను, గణితశాస్త్రములోను కూడ స్వర్గము మోక్షము ఎందుకు చెప్పబడునో వారికి గోచరముకాదు. వారి జీవితాదర్శములు మనుధర్మశాస్త్రము ననుసరించువారి జీవితాదర్శములకు భిన్నములు. వారు హైందవజీవిత

మును పైపైనే చూచుటచే దాని తత్త్వమును గ్రహింప జాలరు. పసిబిడ్డకు యువకుని ఆశయములు, రసికత్వము సుఖదుఃఖములు బోధపడవు. గృహస్థుని నడుమువంచి ఉద్ధ్రితము నడంచు బాధ్యతలు కష్టసుఖములు యువకునకు బోధపడవు. వృద్ధునకు వయస్సువల్ల కలిగిన శాంతము, నెమ్మది, సంసారమునకు ఎడముగా నుండుట, వయస్సులోనుండి సంసారసుఖము ననుభవించుచున్న గృహస్థునకు బోధపడవు. వయస్సు మీరినను తమ చిన్ననాటి ఆశయములు జ్ఞాపకమునం దుండును గనుక వృద్ధులు చిన్నవారి ఆశయములను బోధపర్చుకో గలరు. ఇద్దరు మనుష్యులలో వయస్సుచేత కలిగిన భేద మెంత యుండునో, రెండు జాతులలో అవి యున్న పరిణామావస్థను బట్టి అంత భేద ముండును. అందుచేత నొక ప్రాచీన జాతి, ప్రస్తుతమున ఎంత బలహీనముగనున్నను, ఒక బలవంతమైన నవీనజాతిని అర్థముచేసుకోగలదు, గాని, ఆ నవీనజాతి ఆ ప్రాచీన జాతిని అర్థముచేసుకో జాలదు. అందుచేత పాశ్చాత్యులు హైందవ ఆచార సాంప్రదాయములను అర్థముచేసుకోజాలరనిన ఆశ్చర్యపడ నక్కరలేదు. వైరాగ్యసిద్ధిబొందిన వానిని పొందనివాడు అర్థముచేసుకోజాలడు. ప్రాక్పశ్చిమముల చిత్తవృత్తియందు గల భేదమున కిదియే కారణము.

మనుస్మృతిలో రాగులకు, విరాగులకు, బాలురకు వృద్ధులకు, ప్రాచీనులకు, నవీనులకు, అందరకును తగిన ధర్మము లున్నవి. ఇక్కాలపు పద్ధతులలో అట్లన్నిరకముల వారికిని తగిన నియమములు విధింపబడియుండవు. అందుచేత అవి సర్వత్ర సంతుష్టి కలిగించక, తరుచు

సవరణలుచేసి మార్చవలసి వచ్చుచుండును. పెద్దవారు ఎక్కువ తెలిసినవారు గనుక తక్కువ తెలిసిన చిన్న వారి సంరక్షణ కేర్పాట్లు చేసియుంచవలెను. ఇది ప్రకృతి నియమము. ఈనియమమున కే కారణము చేతనైనను భంగము కలిగినయెడల ప్రమాదము వాటిల్లక తప్పదు. ప్రస్తుత సాంఘిక నియమము లన్నియు మనుస్మృతికి భిన్నముగా నుండుటచేతనే ఆ స్మృతి యిప్పు డావశ్యకముగ అవలంబించవలసి యున్నదని స్పష్టపడుచున్నది. నేటిపద్ధతులు ప్రవృత్తిమార్గమున గొట్టుకొనుచు, నివృత్తి మార్గ మననేమో వినియుండని, వినదలచుకొనని వారిచే నిర్మింపబడినవి. నివృత్తిమార్గము నెరుగని వారు—

'ప్రవృత్తించ నివృత్తించ జనా న విదు రాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥'
(గీతా–16.7)

అనినట్లు ప్రవృత్తినివృత్తిమార్గములభేదముల నెఱుంగక శౌచమును, ఆచారమును, సత్యమును తెలియజాలరు. ఇక వా రితరులకొరకు పద్ధతుల నెట్లు నిర్మించగలరు?

ప్రాక్పశ్చిమములకు గలభేద మిది. మరేభేదములేదు. ఉభయులకు రక్తమాంసములు, దేహములు ఒక్కవిధమైనవే. అందరును ఒక్కమనువు సంతతివారే. ప్రాచీనులు ఒకప్పుడు ఆధునికులే. ఆధునికులు ఒకప్పుడు ప్రాచీను లగుదురు. ప్రాచీనులు తమ అనుభవజనితజ్ఞానమును ఆధునికుల పురోవృద్ధికి తగినట్లు వ్యాఖ్యానముచేసి

చెప్పుట ఆధునిక జాతుల అభివృద్ధికి సహజముగ కావలసియున్నది.

## పురాణజీవులు

అయితే, ఒక్క సంగతి మరువకూడదు. ఇప్పుడు ప్రాచీన జాతు లనబడు జాతుల జనులు నిజముగ ప్రాచీనులుకారు. వా రించుమించుగ నందరును ఆధునికులే, బాలజీవులే. వారు ప్రాచీన ఆచారములను, ప్రాచీన నాగరికతారూపములను పట్టుకొని వ్రేలాడుచున్న దేశములలోఁ బుట్టుటచేతను, ఇంకను ఆ దేశములలో అక్కడక్కడ ప్రాక్పశ్చిమములు కలిసి భవిష్యత్తున పరిపాకము నొందువరకు పూర్వసంప్రదాయములు రూపుమాయకుండ గాపాడుటకు కొందరు పురాణజీవులు పుట్టుచుండుటచేతను, ఆ జాతులను ప్రాచీనజాతులనుచున్నాము. ఈ పురాణజీవులు నూతన జాతులకు ప్రాచీనజ్ఞానమును బోధించి, ఆత్మవిద్యయెడల వారి బుద్ధిని మరలించుటకు వారిలోగూడ పుట్టుచున్నారు. మనుష్యుని బీజరూపకములగు కొన్నిశక్తులను సూచించు కండలు మాంసకృత్తులు శరీరములోనున్నట్లు, ఒకజాతిలో గూడ కొన్ని విశిష్ట విషయములను గురించిన జ్ఞానమును ఆదర్శములను సూచించు మనుష్యులు, కుటుంబములు ఉండును. భగవంతుడు ప్రాక్పశ్చిమములను కలిపివానికి రాజకీయముగను, ఆర్థికముగను, వ్యావహారికముగను పరస్పరసంబంధము కలిగించుటకు కారణ మిదియే.

# పురాణేతిహాసములు

మనుధర్మశాస్త్రములో మనకు తెలిసినది ఒకయుగమునకు అనుకూలించిన విధులు. మధ్యమధ్య ఆ యా కాలములకు తగినట్లు అప్పటిమనువులు, ఉపమనువులు చేసిన మార్పులతో కూడిన భాగము. మనుధర్మశాస్త్రమును అందులో జరిగినమార్పులను మనము బోధపరచుకొనుటకు మనకు తెలిసిన మనుస్మృతిలోని మాటలను, వాక్యములను చదివిన జాలదు. మనుధర్మశాస్త్రమనుసరించి ప్రవర్తించిన జనుల జీవితచరిత్రమును తెలియజేయు పురాణేతిహాసములను గూడ చదువవలెను.

"యః కశ్చి త్కస్యచి ద్ధర్మో మనునా పరికీర్తితః,
స సర్వోఽభిహితో వేదే సర్వజ్ఞానమయో హి సః."
(మనువు 2-7)

"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్,
బిభే త్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రతరిష్యతి."

(మనువు ఎవరిరెవరి కొరకు ఏయేధర్మములను విధించెనో ఆ యా ధర్మములు వేదమునందు చెప్పబడియున్నవి. మనువు సర్వజ్ఞుడు. వేదమునకు ఇతిహాసపురాణముల సాహాయ్యమున వ్యాఖ్యానము చేయవలయును. వేదము అల్పజ్ఞులను అల్పశ్రుతులను చూచి వీరు మోసముచేయుదు రని భయపడును.)

పురాణేతిహాసములు స్మృతులను వానియందు కలిగిన మార్పులను, వేదమునందలి మూలసూత్రముల గూఢార్థములను విపులముచేసి వ్యాఖ్యానము చేయును.

గణితశాస్త్రమునందలి మూలసూత్రములను ఒక్కొక్క పండితుడు ఒక్కొక్కవిధమగు ఉదాహరణలతో వ్యాఖ్యానము చేసి బోధించుచు ఒక్కొక్కగ్రంథము వ్రాయును. అట్లే, ఒక్కొక్క ముని ఒక్కొక్క పురాణమునుగాని, ఒక్కొక్క ఇతిహాసమునుగాని ఒక్కొక్క వ్యాఖ్యానమును గాని వ్రాసెను.

హిందువులు వేదమును పురాణములను తమ పూర్వుల వలె చదివి బోధపరుచుకో జాలకపోయినను, వానిలో నున్న అంతరార్థమును గ్రహించలేక మాటల బాహ్యార్థమును (అందులో స్వార్థపరులు బుద్ధిపూర్వకముగా చెప్పిన తప్పుఅర్థమును) మాత్రము చూచి మోసపోవు చున్నను, పై దేశములనుండి వచ్చిన నాగరికతాబలము చేతను, దేశములో బుట్టిన అంతఃకలహములచేతను, వేద పురాణములను చదువుటకంటె చదువకున్న నే యెక్కువ లాభకర మని తోచినను, వారికి వేదపురాణములయందు సహజముగా నున్న నమ్మకము, గౌరవముమాత్రము నేటి కిని చావలేదు. ఆ వేదపురాణములు మనుష్యజాతి నంతను ఉద్ధరించుటకై వానిని భద్రపఱచియుంచుటకే ఆ నమ్మకము గౌరవము కాపాడబడుచున్నవి. ఇంత కాలమువి కాపాడబడినందులకు లాభ మిప్పుడు కనిపించు చున్నది. ఇంతవరకును పురాతన గ్రంథములను నిరాక రించిన భౌతికశాస్త్రపండితులు ఇప్పుడు ఆధిభౌతికము వైపు తమ దృష్టిని మరల్చి, ఆ వేదపురాణాదుల యందలి సూక్తులకే వ్యాఖ్యానముల జేయుచు ఆ రహస్యములనే ఉపపాదించుచున్నారు.

# 14

## జీవిత రహస్యములు

ఇట్టి మనుస్మృతికి ఆధారములైన జీవిత రహస్యము లను సంగ్రహముగా చెప్పుచున్నాము,

1. మొట్టమొదట చెప్పవలసినవి ప్రవృత్తినివృత్తి మార్గములు. ఇవి తక్కిన వాని కన్నిటికి ఆధారములు. ఇవి యనేక విధములుగా చెప్పబడుచున్నవి గాని అన్నిటి లోని భావము ఒక్కటే; భగవద్గీతలు మొదలైన స్మృతులలోను, పురాణములలోను ప్రవృత్తి నివృత్తులని సాకామ్య నిష్కామ్యము లని సక్తి అసక్తి అని వర్ణింప బడినవి; న్యాయవైశేషిక దర్శనములలో సర్గము అపవర్గము అని, దుఃఖము నిశ్రేయసము అనియును; యోగ సాంఖ్యశాస్త్రములలో ఈహ ఉపరమము అని, వ్యుత్థానము నిరోధము అనియును, మీమాంసములో కర్మము నైష్కర్మ్యము అనియును చెప్పబడినవి. ఈ ఒక్క సత్యము నే వేదాంతులు బంధమోక్షము లనియును, జైనులు సంచార ప్రతిసంచారము లనియును బౌద్ధులు తృష్ణ, నిర్వాణముఅనియును వేరువేరు భావములలో వర్ణింతురు. ఆ సత్యమును తెలిసికొనవలె నని ప్రయత్నించిన వాని కది యేరూపముగ కనిపించినదో ఆ రూపముగ వర్ణించి నాడు. ఈభావములన్నిటిలోను సామాన్యమైయున్న దొక్కటియే సంగతి. అది యీసంసారచక్రముయొక్క కాలనియమబద్ధమైన పరిభ్రమణము. ఈ సంగతి నాధారముగ చేసికొనియే మన్వాదులు ఈ భూలోక జీవితము నకేగాక భువరాది సూక్ష్మలోకజీవితమునకుగూడ ఉపయోగము లగు విధుల నేర్పరచినారు. ముందుమ వెను

కను (లేక క్రిందకు మీదకు) కాలము తప్పక తిరుగు చుండుటయే యీపరిభ్రమణము. దీనికి కారణ మేమని లోతుగా పరిశీలించి చూచినయెడల ఆత్మానాత్మలు కారణ మని తెలియుచున్నది.

## ఆత్మానాత్మలు

ఇవే పురుషప్రకృతు లని చెప్పబడుచున్నవి. ఈ ద్వంద్వ మన్నిమతములలోను ఏదోయొక పేరున అంగీక రింపబడియున్నది. ఈ రెండింటిని పేర్కొని వాని పరస్పరసంబంధమును నిర్వచించినంతనే విశ్వమునంతను వర్ణించుట యగును. ఈ సంబంధమే మీద చెప్పిన పరిభ్రమణము. ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మ మగు అణువు మొదలు స్థూలాతిస్థూలమగు నొక సూర్యమండలము పర్యంతముగల రూపములను ఉపాధులుగా గైకొనుట ప్రవృత్తి. ఈ యుపాధివిసర్జనము నివృత్తి. ఈ ఉపాధి ఆర్జన విసర్జనములకు అంతములేదు; ఎల్లప్పుడును, ఎల్ల యెడలను, సమస్తమైన దేశ, కాల, స్పందప్రమాణముల లోను, ఎటువంటి సంకీర్ణ అసంకీర్ణ పరిస్థితులలోనైనను, ఈవిధానము నడుచుచుండును. ఎంతఅల్పప్రాణియైనను, ఎంతగొప్పప్రాణియైనను ప్రకృతిలో పుట్టిపెరుగుటయు రూపము క్షీణించి మరణించుటయును, అను నీ రెండు గతులకు లోనైయున్నవి. ఈ రెండును ఒకచక్రము. దీనిలో మొదటిసగము ప్రవృత్తి, రెండవసగము నివృత్తి. ఇట్టిసంపూర్ణచక్రము ప్రతిజీవికి ఒకొక్కకోటియున్నను, అంతకంటె నొకదానికంటె నొకటిగ పెద్ద చక్రములును తుదకు విశ్వచక్రమును ఉన్నవి.

ప్రవృత్తియనగా జీవుడు ప్రకృతియందు బంధింపబడుట, నివృత్తియనగా జీవుడు ప్రకృతిబంధములనుంచి విముక్త డగుట. ఈ రెండును జీవునిపరముగా చెప్పబడినవి. ఆధునిక భౌతికశాస్త్రజ్ఞులు పరిణామమును ఉపాధిపరముగా పరిశోధించుచున్నారు. జీవుడు ఉపాధులలో ఎంత ఎక్కువగా బంధితుడగునో అంత ఎక్కువ రీతుల అనుభవము కావలసినవా డగును. అందుచేత ఆ యనుభవము నిచ్చుటకు తగినట్లు ఉపాధిమార్పుచెంది ఎక్కువ సంకర్ణమగును.ఉపాధిపరముగాచూచినయెడల ఈసంకీర్ణత అభివృద్ధిగా కనిపించును. కాని జీవునిపరముగాజూచిన బంధము ఎక్కువగాఢమగుటను, అది ప్రకృతిలోనికి పతనమని చెప్పవచ్చును. కాని ఈపతనమువల్లనే జీవుడు సకల అనుభవములను బడసి అంతశ్శక్తులు వికసించుచు రాగా ప్రవృత్తిమార్గమునువీడి నివృత్తిమార్గమున బ్రవేశించుట కవకాశము కలుగును గనుక, ఒకవిధముగ జూచిన నిది యభివృద్ధి యనియు చెప్పవచ్చును.

"జీవుడు పొందవలసిన ఎనుబదినాలుగులక్షల రూపములలో ఇరువదిలక్షల స్థావరములు (లోహములు వృక్షములు) ను, తొమ్మిదిలక్షలు జలచరములును, తొమ్మిది లక్షలు తాబేలు మొదలైన భూజలచరములును, పది లక్షలు పక్షులును, ముప్పది లక్షలు పశులువు (చతుష్పాత్తులు) ను, నాలుగు లక్షలు వానరములును, ఇవన్నియు గడచిన పిదప, రెండులక్షలు మానవులును అయియున్నవి. మనుష్యజన్మము నెత్తిన జీవుడు పుణ్యాకర్మచే క్రమముగ ద్విజత్వమును (బ్రాహ్మణుడు, ప్రథమ

తారకోపదేశము నొందినవాడు కూడ ద్విజు డనబడు దురు) ను బడసి, తుదకు జన్మములను పరిత్యజించి బ్రహ్మ సాక్షాత్కారము బడయును అని బృహద్విష్ణు పురాణములో చెప్పబడినది.

## మనుష్యుడు—జీవితోద్దేశము

ప్రవృత్తి నివృత్తులు చేరిన యొక విశ్వచక్రమున మనుష్యుడు మధ్యస్థానమునందున్నాడు. అందుచేత వెనుకకును ముందుకును చూచుటకును, తన యభ్యుదయమునకు తానే కర్తయై 'తాను సంసారమునందు ఎందుకు ఎట్లు ప్రవర్తించవలెను' అనుప్రశ్నను వేసికొనుటకును, సమాధానము చెప్పుటకును కూడ అధికారము కలవాడగుచున్నాడు. అటువంటి స్థితియందున్న మనుష్యుడు తనయొక్క జీవితోద్దేశముగ దేనిని ఉంచుకోవలెను? ఆ యుద్దేశము పూర్తిగా నెరవేరుట కెట్లు ప్రవర్తించవలెను?

ప్రవృత్తి నివృత్తి మార్గములను రెండింటిని కలిపి చూచినయెడల ఈ సంసారమునకు ఆత్మసాక్షాత్కారము, లేక, ఈశ్వర సాక్షాత్కారము ఒక్కటే ఉద్దేశ్యము, ఒక్కటే లక్ష్యము అని కనిపించును. కాని రెండింటిని వేరు వేరుగా చూచినయెడల వేరు వేరు ఉద్దేశములు కలవిగా కనిపించును.

ప్రవృత్తిమార్గముయొక్క లక్ష్యము ధర్మము, అర్థము, కామము, అని మూడు విధములు.

'ధర్మార్థా వుచ్యతే శ్రేయః కామార్థా ధర్మఏవ చ
అర్థఏవేహ వా శ్రేయ స్త్రివర్గ ఇతితు స్థితః'
(మను 2-24)

(కొందరు ధర్మము, అర్థము శ్రేష్ఠములనియు, కొందరు కామము. అర్థము శ్రేష్ఠములనియు, కొందరు ధర్మమే శ్రేష్ఠమనియు, కొందరు అర్థమే శ్రేష్ఠమనియు చెప్పుదురు. కాని ఈ మూడును కలిసినయెడల శ్రేష్ఠమని నిశ్చయింపబడినది).

అని మనువు చెప్పెను. కామము అనగా ఇంద్రియసుఖానుభవ మనియును, తత్సుఖాపేక్ష యనియు కూడ అర్థము. అట్టి కామము ప్రవృత్తిమార్గమునకు ముఖ్యలక్షణ మనవచ్చును. ఏలయన కామమువల్లనే జీవుడు ఉపాధులతో తాదాత్మ్యము నొంది, ప్రకృతిబద్ధుడగుచున్నాడు. అయితే ధర్మార్థములకు ఈమార్గముతో సంబంధములేనియెడల మనువు వానినికూడ పేర్కొని, కామమును వాని రెండింటితోను చేర్చి చెప్పుట కేమి కారణము? ఇంతేగాక, మనువు ఇంద్రియభోగములను నిరసించి, ధర్మమునకెక్కువ అధిక్యమునిచ్చుచున్నాడు. ఎందుచేత? పూర్వకాలమునం దెట్టులుండినను యిప్పుడు మానవజాతియొక్క యభ్యుదయావస్థనుబట్టి, మనుష్యునకు యింద్రియసుఖానుభవమును గూర్చి పూర్తిగా తెలియును. బ్రహ్మచే ఆజ్ఞాపించబడినవాడై దక్షప్రజాపతి ప్రజాభివృద్ధి కొరకు తపస్సుచేసి హర్యశ్వుల పదివేల మందిని సృజించి వారిని ప్రజాభివృద్ధి చేయుడని నియమించెను. కాని, నారదుడు వారికి ఆత్మవిద్య బోధించి ప్రకృతిబంధములనుంచి తప్పించుటచే వారు దక్షుని కుపయోగింపకపోయిరి. అంత దక్షుడు తిరిగి తపస్సు చేసి శబలాశ్వులను అయిదువేలమందిని సృజించెను. కాని, వారినిగూడ నారదుడు ప్రవృత్తిమార్గమునుండి

తప్పించెను. అంత దత్తుడు నారదుని యవివేకమునకు మందలించుచు ఇట్లనియెను.

"నానుభూయ నజానాతి జంతు ర్విషయతీవ్రతామ్
నిర్విద్యేత త్వయం తస్యా స్న తయా భిన్నధీః పరైః"
విష్ణుభాగవతము 6-54.

[విషయములయొక్క తీవ్రతను జీవుడు అనుభవించక తెలియజాలడు. కనుక విషయానుభవమునుండి ఎవ్వరి బుద్ధిని మరలించక వారి స్వానుభవముచేతనే నిష్కామమును బడయనిమ్ము ]

## ఇంద్రియసుఖము - వాని నిగ్రహము

దీనివల్ల మనుష్యునకు ప్రవృత్తి మార్గారంభమున ఇంద్రియసుఖములను పోషించి, వృద్ధిచేసి, ప్రోత్సాహము చేయవలసియుండెను, నేడా యవస్థ దాటినాము. అందుచేత ఇంద్రియసుఖావశ్యకతను గుతించి పైనుంచి ప్రోత్సాహ మక్కర లేకపోవుటయేగాక, ఇంద్రియనిగ్రహ మనవరతము ఆవశ్యక మగుచున్నది. అందుచేత, మనువు, కామము జీవితోద్దేశముగ చెప్పిన యెడల, కామము మితిమీరి ఆ యుద్దేశము నెరవేర దని, దానికి ధర్మము అర్థము అను కళ్లెములను తగిలించెను.

మనుస్మృతి వర్తించవలసిన కాలమున మనుష్యులకు ఇంద్రియ సుఖానుభూతివ్యవస్థితమైనసంఘము ద్వారానే గాని కలుగదు. మనుష్యుని ఇంద్రియసుఖానుభవమునకును జంతువుల సుఖానుభవమునకును భేదమున్నది. జంతువునకు స్థూలేంద్రియముతో విషయ సంపర్కమై

నంతనే సంతుష్టి కలుగును కాని మనుష్యునకు స్థూలాలో పాధియేగాక, సంస్కృతములైన బహు విధములగు మానసిక ప్రవృత్తులును, భావములు (రాగాదులు)ను కలవు. దీనికితోడు మనుష్యుడు నివృత్తిమార్గమున నివృ త్తికి సమీపించుచు, జీవాత్మయందు విశ్వాత్మ ప్రకా శించుట ప్రారంభమగుచున్నందున, తత్సంబంధమైన ప్రభావముకూడ కలదు. అందుచేత మనుష్యునియందు కామము ఒక అనివార్యమగు వాంఛగా కనిపించు చున్నది. ఆ వాంఛ సానుభూతిని ప్రేమను వికసింప జేయు కుటుంబము, జాతి, జనాంగము మొదలగు సంఘు జీవిత రూపమును, చిత్రకళలయందు ప్రవర్ధమాన మగు అభిమాన రూపమును పొందును. ప్రతి వ్యక్తికి తగినంత తీరుబడి నిచ్చి, తన శక్తికొలది కళల నభివృద్ధి చేసుకొనుటకు తగిన అవకాశము నిచ్చునట్లు వృత్తులను విభాగించు. ఏర్పాటుగల సంఘములోనేగాని కళ లభి వృద్ధికావు. ప్రతివ్యక్తికిని అటువంటి తీరుబడియును, సంఘమునకును వ్యక్తులకునుకూడ తగినంత ధనమును. లేనియెడల, గానము,కవిత్వము,చిత్రలేఖనము, శిల్పము, తోటలు, ఉద్యానములు వేయుట, ఇంపుగా అలంక రించుకొనుట, చక్కని వాహనములు, సొగసైన పెం పుడు జంతువుల నుంచుకొనుట-ఇటువంటి సంస్కృత ములైనఇంద్రియభోగములు, అభివృద్ధికావు. అందుచేతనే అర్థము (అనగా ఐహికసంపదలు) ప్రవృత్తి మార్గము నందొక లక్ష్యముగా చెప్పబడినది.

## ధర్మము - అర్థము

అయితే మనుష్యునికి స్వభావతః గల స్వార్థమును ధర్మముచేత అరికట్టించక పోయినయెడల హక్కులను

బాహ్యతలు శాసించనియెడల, ధన సంపాదనము తద్వి భాగము ఒక పద్ధతి ననుసరించి నియమింపబడనియెడల వ్యక్తిస్వాతంత్ర్యము మొత్తముమీద సంఘముయొక్క అవసరములకు లోబడి యుండనియెడల, వ్యక్తిగాని సంఘముగాని అర్థము సంపాదించి నిలువచేసుకొనుట యును, ఒక సంఘమును స్థాపించి కట్టుబాటులో నుంచుటయును కూడ సాధ్యముకాదు. కేవల విషయలంపటత్వముతోగూడిన స్వార్థము చిరకాలముక్రిందటనే తగ్గిపోయినది గాని ఈ ఇచ్చి పుచ్చుకొనుట అనే న్యాయము జనులకు ఇంకను పూర్తిగా అలవడలేదు. అందుచేత మనువు తన ధర్మశాస్త్రములో స్థూలశరీర మారోగ్యముగనుండి పరమార్థ సాధన కుపయుక్తముగ నుండుటకు తగిన ఆరోగ్యవిధులు, పారిశుద్ధ్యవిధులు మాత్రము విధించి ఇంద్రియభోగములను గురించి యేమియు నెత్తలేదు. అర్థమున కెక్కువ ప్రాముఖ్యము ఈయబడి వృత్తులవిభజనమునుగురించియును, సంఘములో ఎవరికి కావలసినపుడు వారికి అందుబాటులో నుండునట్లు కొందరు ధనసంగ్రహము చేయుటను గురించి యును విపులముగా విధించబడినది. మరియును మనువు అర్థకామములతో చేర్చి ధర్మమును అడుగడుగునకు బోధించుచు, ఏ ధర్మము నుల్లంఘించినను దానికి శిక్షను విధించెను "ధర్మార్థకామములు జన్మము నెత్తినందుకు ఫలములు. ధర్మహీనునియందు కామార్థములు వంధ్యాసుతుని వంటివి. ధర్మమువల్ల అర్థకామములు సంభవించును. ధర్మమువల్ల ఇహపరసుఖములు లభించును." అని మత్స్యపురాణము చెప్పుచున్నది. ఈ సంగతినే వ్యాసుడు చెప్పినను కౌరవులు వినకపోవుటచేత 'మహా

భారతయుద్ధమునకు కారణమైనది. ఏ నాగరికతలోనైనను, ధర్మము ముఖ్యమైనయెడల, విద్యలు, కళలు ఎంత అభివృద్ధిచెందినను ఎంత భుజబలమున్నను నిష్ప్రయోజనము. రాజ్యాంగమునందెంత స్వల్పవ్యవహారమును చూచినను దానికి నీతి,శీలము ఆధారమైయుండును.

ధర్మమున్నప్పుడే అర్థము స్థిరముగ నుండును. అర్థమున్నప్పుడే ఉత్తమతరగతి సుఖ (కామ)మున కవకాశము కలుగును. అట్టిసుఖము లేనియెడల అర్థము మోయజాలని భార మగును అర్థములేని యెడల ధర్మనిష్ఠ నిరుపయోగము, కనుక ఈ మూడును ప్రవృత్తిమార్గమున లక్ష్యములుగా నేర్పడినవి. అందుచేతనే—

"పరిత్యజే దర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ ।
ధర్మం చాప్యసుఖోదర్కం లోకవిద్విష్ట మేవచ॥"
(మను 4-176)

(ధర్మవర్జితమైన అర్థకామములను పరిత్యజింపుము, ధర్మము లోకమున కిష్టములేనప్పుడు, అసౌఖ్యము నిచ్చునపుడు ధర్మమును కూడ విడిచిపెట్టుము).

అని మనువు శాసించుచున్నాడు.

ప్రవృత్తిమార్గమున పురుషార్థములను యుక్తరీతిని బడసినవాడై పురుషుడు నివృత్తిమార్గమున బ్రవేశించుచున్నాడు. నివృత్తిమార్గమునకు మోక్షము లక్ష్యము.

"ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్,
అనపాకృత్య తాన్యేవ మోక్ష మిచ్ఛన్ వ్రజత్యధః"*
(మను 6-35)

* అనపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యధః పాఠాం॥

[దేవ పితృ ఋషి ఋణములను తీర్చినవాడై పురుషుడు మోక్షమునందు మనస్సుంచవలెను. ఋణములు తీర్చకయే మోక్షమును అపేక్షించిన యెడల నరకమున బడును.]

అని చెప్పుటచేత, సంసారబంధములను బలవంతముగా త్రెంపుకొని పోయిన వానికి మోక్షప్రాప్తి కలుగదు.

చక్రమునకు రెండు భాగమూ యున్నప్పుడే అది చక్రమగును. అట్లేప్రవృత్తిమార్గమును గడువని వాడు నివృత్తిమార్గమున ప్రవేశింపజాలడు. నివృత్తిమార్గము అను లక్ష్యము లేని యెడల ప్రవృత్తిమార్గమునకు ప్రయోజనములేదు.

మీద చెప్పిన మూడు ఋణములును ప్రవృత్తిమార్గముయొక్క మూడు లక్ష్యములతో కూడియుండును. ఇవన్నియును చేరి ఈషణత్రయమువల్ల కలుగుచున్నవి. దేవతలు మనుష్యుని సుఖ దుఃఖానుభవములకు కారణభూతములగు పృథివ్యప్తేజో వాయ్వాకాశములనొసంగును. పితృదేవతలు దేహబీజముల నొసంగుదురు. ఋషులు జ్ఞానమునొసంగుదురు. దేవతలు మొదలైనవారిచే మనుష్యుడా విధముగ ఆయా ఉపకారములు పొందుటచేత వారి వారికి ఋణగ్రస్తుడగుచున్నాడు.

ఈ యుపకారములను పొంది ఋణముల జేయుటకు గల కోరికగూడ విత్తేషణ, పుత్రేషణ, లోకేషణ, ◆ అని

---

◆ దారేషణ, ధనేషణ, పుత్రేషణ, అని సామాన్యముగ చెప్పుదురు.

మూడు విధములు. ఈ మూడును వరుసగా అర్థకామ ధర్మములతో సంబంధించినవి.

ఈ మూడువిధములైన ఋణములు తీర్చుటకు చెప్పిన ఉపాయములు ధర్మములో చేరును. యజ్ఞములచేత దేవ ఋణమును, పరోపకారముచేతను, సత్సంతానమును కనుటచేతను పితృఋణమును, జ్ఞానదానముచేత ఋషి ఋణమును తీరును. ఇట్లే ఋణములు తీర్చిననేగాని పురుషుడు నివృత్తిమార్గమున బ్రవేశింప నర్హుడుకాడు.

## ప్రవృత్తి - నివృత్తి

ప్రవృత్తి మార్గమున కామము ముఖ్య లక్ష్యమనియును, ధర్మార్థములు విశేషకారణములచే దానికితోడు చేయబడినవనియు చూచినాము. అట్లే నివృత్తి మార్గమునకు మోక్ష మొక్కటియే లక్ష్యముగా జెప్పినను దానికికూడ యోగసిద్ధి, భక్తి అను రెండు అంగములున్నవి. కామాదులవలెనె యీ మూడు నొకదాని కొకటి సన్నిహిత సంబంధము కలవి.

నివృత్తి మార్గమునందు ధర్మము ముముక్షుత్వము, ఉత్తరోత్తరాభివృద్ధి నొందు నిష్కామత్వము. (వైరాగ్యము) వైరాగ్యము జ్ఞానమున, శాంతియందు నివృత్తి నొందును. వైరాగ్యమున రెండు భూమికలు. మొదటిది జ్ఞానప్రసాదమాత్రము, రెండవది పరిపాకమైన వైరాగ్యము, జ్ఞానపరిపూర్ణత, ఈ మార్గమునం దర్థముసిద్ధులు.

'తే సమాధా వుపసర్గాః వ్యుత్థానే సిద్ధయః॥

యో॥ సూ॥ 3-37

(సిద్ధులు సమాధికి విఘ్నరూపములు, సమాధిని విడిచిన కాలమున ఫలరూపములు అయియున్నవి.

'అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థితిః॥' (యో॥ సూ॥ 2-37) (దొంగతనము చేయకుండుట స్థిరమైన వానికి సకల రత్నములు దొరుకును.)

'బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః'(యో॥సూ॥ 2-38). (ఇంద్రియ నిగ్రహ మభ్యాసమైన వానికి వీర్యము (బ్రహ్మతేజస్సు) లభించును.)

అని చెప్పబడినది. నివృత్తిమార్గమునం దున్నవానికి వైరాగ్యము కావలసియుండగా రత్నములు, సిద్ధులు, రాజపదవులు ఎందుకు అను సందేహము కలుగవచ్చును. కాని, ఇవన్నియు వానికి స్వోపయోగార్థము లభించవు. స్వార్థశూన్యుఁడై, పరోపకారము స్వభావమైనవానికే అవి లభించును. "ప్రభూ! నన్నీ వరములచే మోహ పెట్టకుము, నేను పుట్టినప్పటినుంచి యీ మోహములో చిక్కుద నేమో యని భయపడియే మోక్షముకొఱకై నీ శరణుఁజొచ్చినాను గాని, వరములకొరకు కాదు."అని చెప్పిన ప్రహ్లాదునకు విష్ణుమూర్తి "నీ వలె నాకు హృదయము నర్పించినవారికి వేరేమియు నక్కఱలేదు నిజమే కాని, ఈ మన్వంతరాంతమువరకు నీవు రాక్షసులకు రాజువై పాలింపుచుండుము..." అని చెప్పి పరమ నిష్కామియైన ప్రహ్లాదునకు రాజపదవి నొప్పగించెను. ఎవరు స్వార్థము వీడి నిష్పక్షపాతముగ ప్రవర్తించగలరో వారు అధికారమునకు అర్హులు. ఎవరు తమను తాము నిరంకుశముగ పరిపాలించుకొనగలరో వారే యితరు లను పాలించగలరు. అటువంటివారే ఆధికారిక పురు

షులు. ప్రవృత్తిమార్గమున లౌకిక అధికార పదవులకు, ఆ పదవులతో సంబంధించిన పనులను చేయుటయం దభిరుచికలిగి, ఆ పదవులను పొంది, ఆ యధికారము లను వినియోగించవలెనని ప్రయత్నించినవారు అర్హు లుగా నెంచబడుచున్నారు. కాని, నివృత్తి మార్గమున అధికారము లభించినయెడల దానిని దుర్వినియోగము చేయవలెనని బుద్ధిపుట్టునేమో, అహంకారము బలపడు నేమో యని దాని నక్కరలేదనువారు తమ పనిచేయు టలో తమ బాధ్యత నెరిగి మిక్కిలి జాగ్రతగా చేయు వారు అర్హులగుచున్నారు. వారు అధికారమును స్వప్ర యోజనమునకు దుర్వినియోగము చేయక లోకహి తార్థము వినియోగింతురు.

ప్రతిజీవియును ఉభయలోకములలోను ఎంతోకొంత అధికారము చేయవలసియుండును. ప్రతి గృహ యజ మానియును అధికారపదవియందుండి యేదో కొంత అధికారము నితరులమీద వినియోగించును. పై లోక ములలోగూడ సిద్ధులు కలిగినవా రట్టి అధికారములను కొంతవరకు వినియోగింతురు. బాధ్యతతోకూడిన అధి కార పదవులయందుండి ఆపదవీధర్మములను నెరవేర్చిన తరువాత జీవునకు శాంతి చేకూరును. కనుక ఈ మార్గ మునందర్థము అట్టి అధికారము పదవులు.

## భక్తి

ఈ మార్గమున కామము భక్తి. ఇది ఇంద్రియలోల త్వమునకు, ఇష్టానిష్టములకు భిన్నమైనది. సూక్ష్మలోక సిద్ధులను, అధికారములను వినియోగించుట పరమాత్మ కార్యోన్ముఖతను సూచించును. అట్టి భక్తి పరమాత్మ

యొక్క నిరంతరోపలబ్ధి చిత్తము పొందగల ఉత్తమా దర్శమూర్తియందు దృఢభక్తి గలవానికి కొంతకాల మునకు సకల భూతములయందును తుదకు పరాత్పరుని యందును భక్తి కుదురును.

ఇట్లు ప్రవృత్తి మార్గమున ధర్మమువల్ల అర్థమును, అర్థమువల్ల కామమును లభించును. నివృత్తి మార్గమున భక్తివల్ల శక్తియు దానివల్ల ముక్తియు కలుగును.

శుద్ధభక్తివల్ల పరమేశ్వరానుగ్రహము కలుగునని శ్రుతిస్మృతులును, యోగసూత్రములునుకూడ తెలుపు చున్నవి.

జీవునకు అడుగడుగునకును స్వార్థము, అధికార దుర్వినియోగము, దానివల్ల పతనము కలుగుట కవకా శములు వచ్చుచుండును. అందుచేత ముముక్షువునకు పరి శుద్ధమైన ఆత్మ కామ్యవస్తువుగ నుండవలెనని, శక్తులు భక్తికి లోబడి యుండవలెనని, భక్తిజ్ఞాన వైరాగ్యము లతో గూడియుండవలె నని ఎప్పటి కప్పుడు జ్ఞాపకము చేయబడుచుండును. జీవుడు ఎంత ఉత్తమ స్థితియం దున్నను పతనమునొందుట కవకాశమున్నది. కనుక వానిదృష్టి యెల్లప్పుడును ఇంద్రియముల కగోచరుడు, నిరాకారుడు, అజుడు,నిత్యుడు, అగు పరమాత్మమీద నే యుంచవలెనని బోధింపబడును.

"సర్వ మాత్మని సంపశ్యే త్సత్యాఽసత్యసమాహితః,
సర్వంహ్యాత్మని సంపశ్యన్ నాఽధర్మే కురు తే మనః."
(మను 12-118.)

[సత్ అసత్ వివేచనముచేయుచున్నను (సదసద్వస్తు రూపము లగు) సర్వ పదార్థజాలమును ఆత్మయందే చూడవలెను. సర్వమును ఆత్మయందు చూచువాడు అధర్మమునందు మనస్సు నుంచడు.]

ఈ ప్రవృత్తి నివృత్తి మార్గములతో గూడినది.

"ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి."
(గీతా॥ 3-16)

అని చెప్పిన అనువృత్తి. దీని ననుసరించక ఇంద్రియ లోలుడై చరించువాడు పాపాత్ముడు, వ్యర్థజీవి.

ఇటువంటి సంసార చక్రమును, దాని రెండుభాగ ములయొక్క లక్ష్యములును మనుధర్మ శాస్త్రమున కాధారములు.



# సృష్టిక్రమము, జీవితసమస్యలు

## ద్వితీయాధ్యాయము

### ప్రథమభాగము

మన్వంతరా ణ్యసంఖ్యాని సర్గః సంహార ఏవ చ।
క్రీడా నివైత త్కురుతే పరమేష్ఠీ పునః పునః ।
తస్య కర్మ వివేకార్థం శేషాణా మనుపూర్వశః।
స్వాయంభువో మనుర్ధీమా నిదం శాస్త్ర మకల్పయత్॥
అస్మి న్ధర్మోఽఖిలే నోక్తో గుణదోషౌ చ కర్మణామ్।
చతుర్ణా మపి వర్ణానా మాచార శ్చైవ శాశ్వతః॥
దేశధర్మా న్జాతిధర్మా న్కులధర్మాంశ్చ శాశ్వతాన్!
పాషండగుణధర్మాంశ్చ శాస్త్రేఽస్మిన్నుక్తవా న్మనుః॥
(మను 1-80,102,107,118)

[బ్రహ్మ లెక్కలేనన్ని మన్వంతరములను ఆటలోవలె తిరిగి తిరిగి సృష్టించుచు సంహరించుచు ఉన్నాడు. వానిలో సకల జనులును వివేకముతో ప్రవర్తించుటకుగాను ధీమంతుడైన స్వాయంభువమనువు (స్వయంభువుని పుత్రుడు) ఈ శాస్త్రమును రచించెను. దీనిలో కర్మల గుణదోషములును, సకలధర్మములును, చెప్పబడినవి. చతుర్వర్ణముల నిత్యధర్మములును, దేశధర్మమును, జాతిధర్మమును, కులధర్మమును, తుదకు పాషండుల ధర్మము కూడ, చెప్పబడినవి.]

ఇదివరకు ప్రకటించిన వ్యాసములో మనుధర్మశాస్త్రమునకు ఆధారములు చూపబడినవి. సంసార

చక్రము, దాని యందలి ప్రవృత్తియను రెండుభాగ ములును, ఆరెండు భాగములకు అనుకూలములైన పురు షార్థములు, వీనితో సంబంధించిన ఋణత్రయము, వాని విముక్తిమార్గములు, ఈషణత్రయము, వీనికాధారము లైన సచ్చిదానందము లను ప్రజ్ఞాలక్షణములు, సత్త్వ రజస్తమములను ప్రకృతి గుణములు, వీనికన్నిటికి మూలము జగత్కారణము అయిన ఆత్మ, అనాత్మ, తత్సంబంధము-ఇవి ఆ శాస్త్రమున కాధారములుగా వివరింపబడినవి. ఇప్పుడు, మానవజాతి పరిణామములో ప్రస్తుతము జరుగు చున్న మహామన్వంతరమును గురించి కొన్ని వివరములు తెలుపబడును.

శాస్త్రములు, నియమములు మానవుల పరిణామా వస్థకును వారి జీవితమునందలి పరిస్థితులకును సంబం ధించి యుండును. సామాన్యవిధులు సామాన్యస్థితుల కును, విశేషవిధులు విశేషస్థితులకును వర్తించును. మార్పు లేక నిత్యముగానుండు నియమములు నిత్యములైన సంగ తులకు వర్తించును. సంగతులు కాలానుగుణ్యముగ మార్పు చెందునవి యైనయెడల వానికి సంబంధించు నియమములుకూడ మారుచుండవలెను.

"అన్యే కృతయుగే ధర్మా స్త్రేతాయాం ద్వాపరేఽపరే
అన్యే కలియుగే నృణాం యుగహ్రాసానురూపతః.
(మను 1-85)

[కృతయుగ ధర్మము వేరుగాను, త్రేతాయుగ ధర్మ ము వేరుగాను, ద్వాపరయుగధర్మము వేరుగాను, కలి యుగ ధర్మము వేరుగాను, యుగములకాలకు తగినట్లు మనుష్యులకై యేర్పడు చున్నవి.]

శైశవాది వార్ధక్యపర్యంతము మనుష్యుడు ఒక్కొక్కదశలో ఒక్కొక్క ధర్మమునవలంబించకతప్పదు. వ్యక్తికి శైశవాద్యవస్థ లెటువంటివో మానవ జాతి కంతకు కృతాదియుగము లట్టి యవస్థలను సూచించును. విష్ణుభాగవతములో

"యావా నయంవై పురుషో యావత్యా సంస్థయామితః
తావా నసావపి మహాపురుషో లోక సంస్థయా.
(12-11-9)

[పురుషున కేవిధముగా మితమైన సంస్థ యేర్పడినదో ఆ విధముగా మహాపురుషునకు లోకసంస్థ యేర్పడినది.] అని చెప్పబడినది.

బ్రహ్మాండము, పిండాండము, ఒక్క మాదిరిగా నిర్మాణము చేయబడినవి. అన్ని విషయములలోను, అన్ని యవస్థలలోను ఈ సారూప్యమున్నది. ప్రస్తుత వ్యాసమునకు మహాపురుషు డనగా మానవజాతి యని యనుకొందము.

ధర్మవిధులు మిక్కిలి వివరముగాను. విపులము గాను చెప్పినపుడు అవి యొకానొక కాలముకొరకు గాని, దేశముకొరకు గాని చెప్పబడియుండును. ఈ ప్రాచీన సూత్రము నిప్పుడు ఎవ్వరును అంగీకరించక పోవుట చేత ఇప్పటి న్యాయశాస్త్రములు నిర్జీవము లగుటయు, అంతరార్థమును చూడక మాటల బాహ్యార్థమునకు ప్రాముఖ్యత నిచ్చుటయు, ఐక్యతకు కారణమగు ప్రేమకు బదులు విభేదములకు కారణమగు స్వమతాభిమానము, మొదలైనవన్నియు సంభవించినవి. జీవవికాసమునకు హేతువగు నిరామయమును, ప్రకృతిసిద్ధమును అగు

క్రమపరిణామమునకు బదులు రోగమునకు, మరణము నకు హేతువగు అసహజమైన నిర్విశేషత సంభవించినది.

మనుసంహితలో ఈ సూత్రము మొదట ప్రతిపాదన చేయబడి తరువాత సృష్టిక్రమము, ఆత్మ ప్రకృతిలో ప్రవేశించినది మొదలు భూలోకమున ప్రవేశించిన వరకు పొందిన ఆవిష్కరణక్రమము, ఓషధులు, పశువులు, మనుష్యులు, దేవతలు, ఋషులు మొదలగు వర్గముల పుట్టుక, యుగములు, వీనిని గురించి సంగ్రహముగా చెప్పబడినవి. వీని వివరములను పురాణములనుంచి గ్రహించవలసియున్నది.

మనకిప్పుడు ముఖ్యముగా కావలసినది మానవజాతి యొక్క మనస్సు, శరీరము ఎట్లు అభివృద్ధియైనవో ఆ క్రమము. అనేక యుగములలో భూలోకము నందలి యొక్కొక్క ద్వీపములో, ఒక్కొక్క కల్పములో, ఒక్కొక్క మన్వంతరములో, ఒక్కొక్క జాతిలో, ఒక్కొక్క ఉపజాతిలో, వంశములో ఏ విధముగా మనుష్యుడు జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను, అంతర్బహిశ్శక్తులను క్రమక్రమముగ వికసింపజేసికొని నేటి ఇలావృతవర్షమున, భరతఖండమున ఆర్యావర్తము (పంచజనులు లేక అయిదవజాతి అనబడు ఆర్యుల కాలము) నందున్న యవస్థకు వచ్చినవిధము వర్ణింపబడినది.

[ప్రతి మన్వంతరమున ఇద్దరు మనువు లుందురు. మన్వంతరారంభమున ధర్మప్రతిష్ఠచేయు మూలమనువు ఒకడు. మన్వంతరాంతమున పరిణామానుభవమునంతను ప్రోగుచేయు బీజమను వొకడు. ఈ యిద్దరి అధికార కాలముల మధ్యకాలము మన్వంతర మనబడినది. ఇది

మహామన్వంతరము. వీనిలో ఒక్కొక్కదానిలో ఏడు ద్వీపములు. ( భూమండలమువంటి మండలములు ) ఒక్కొక్క ద్వీపములో ఏడు మూలజాతుల మనుష్యులు, ఒక్కొక్క మూలజాతికి ఒక్కొక్క జాతి మనువుఉందురు. అని Secret Doctrine గుప్తవిద్యలో నున్నది.] ఈ మహామన్వంతరములో మూలమనువు పేరు వైవస్వతమనువు. ఈయన స్వంత పేరు శ్రాద్ధదేవుడు. ఇప్పటి ఆర్యజాతి మనువు పేరుకూడ వైవస్వతమనువే. ప్రస్తుతము మనము నాలుగవ మహామన్వంతర మధ్యకాలమును కొంచెము మించియున్నాము. ఇది 'ద్వితీయ పరార్థమున శ్వేతవరాహకల్పమున వైవస్వత మన్వంతరమునం దిరువదియెనిమిదవ మహాయుగములోని కలియుగముయొక్క ప్రథమపాదము' అని జ్యోతిష గ్రంథములు చెప్పుచున్నవి శ్రీ మద్భగవద్గీతలు 8 వ అ॥ 6 శ్లో॥లో 'చత్వారో మనవః' అను మాటకు నాలుగవ మనువు అని యర్థము చెప్పెదరు. దీనినిబట్టికూడ మనము నాలుగవ మహామన్వంతరములో నున్నామని కనబడును.

## మానవ పరిణామము.

వెనుకటి పరిణామక్రమము నిట్లు సంగ్రహముగా చూపి ప్రస్తుత యుగములో మానవ పరిణామమును గురించి కొంచెము విచారింతము. దీనినిగురించి బ్లావాట్స్కీగారు 'గుప్తసర్మము' (Secret Doctrine) అను గ్రంథములోను, బెసెంటుగారు 'మనుష్యుని వంశానుక్రమణిక' (Pedigree of Man) లోను వ్రాసియున్నారు. మన పురాణములలో కథలరూపమున నక్క

డక్కడ వివరింప బడియున్నది. వీని అన్నిటి సారాంశము ఏమనగా మనుష్యుడు మొదట లింగభేదములులేక పొగవంటి శరీరముతో నుండెను. క్రమముగా శరీరము గట్టిపడి ఒక్క శరీరములోనే లింగభేద మేర్పడెను. క్రమముగా శరీర మింకను స్థూలమై స్త్రీశరీరము వేరు, పురుషశరీరము వేరు ఆయెను. తిరిగి ఒక్కశరీరము లో స్త్రీ పురుషభేదముండి, శరీర మంతకంటె పలచనై, తుదకు లింగభేదములేని పొగవంటి శరీరము కలుగును. దీనిని గురించి మనువు, "ద్విధాకృత్వాఽఽత్మనో దేహ మర్ధేన పురుషోఽభవత్, అర్ధేన నారీతస్యాంస విరాజ మసృజత్ ప్రభుః" [బ్రహ్మ తన శరీరమును రెండు భాగములుగా చేసెను. సగము పురుషు డాయెను, సగము స్త్రీ ఆయెను.]అనివ్రాసెను.(ఇదే అర్ధనారీశ్వర స్వరూపము.)

మన మహామన్వంతరములో భూమండలమున మొదటి మానవజాతిని గురించి మార్కండేయ పురాణములో నిట్లు వివరింపబడినది.

"న మూలఫలపుష్పాణి, నార్తవా వత్సరాణి చ
సర్వకాలసుఖః కాలో నాత్యర్థే ఘర్మశీతతా
తతశ్చ తేషాం పూర్వాహ్నే మధ్యాహ్నేచ వితృప్తతా
పున స్తదేచ్ఛతాం తృప్తి రనాయాసేన సాఽభవత్
తృప్తిః స్వాభావికీ ప్రాప్తా విషయేషు మహామతే
ధ్యానేన మనసా తాసాం ప్రజానాం జాయతే సకృత్॥
శబ్దాది ర్విషయః శుద్ధః ప్రత్యేకం పంచలక్షణః
అసంసార్యై శ్శరీరై శ్చ ప్రజా స్తా స్థిరయౌవనాః॥
తాసాం వినాతు సంకల్పం జాయన్తే మిథునాః ప్రజాః
సమం జన్మచ రూపం చ మ్రియంతే చైవ తాః సమమ్॥

అనిచ్ఛాద్వేష సంయుక్తా వర్తంతే తు పరస్పరమ్
తుల్యరూపాయుషః సర్వా అసమోత్తమతాం వినా
చత్వారిషు సహస్రాణి వర్షాణి మానుషాణి వై
ఆయుఃప్రమాణం జీవన్తి నచ క్లేశాద్విపత్తయః."

[ఆ ప్రాచీన కాలమున కందమూలములు, ఫలములు, పుష్పములు, ఋతువులు, వత్సరములు లేవు. సర్వ కాలములు సమశీతోష్ణములు గలిగి సుఖకరముగా నుండెను. మనుష్యులు స్వాభావికముగ సంప్రాప్తము లయిన విషయములను గ్రహించుటచే అనాయాసముగా తృప్తి చెందుచుండిరి. వారికి పంచలక్షణయుతమైన శబ్ద మొక్కటే ఇంద్రియానుభవము. మనుష్యులు స్థిర యౌవనులై, వయోభేదములచే శరీరములలో మార్పులు కలుగుట నెరుగరు. పితరులకు జననేచ్ఛ లేకున్నను తలచినంత మాత్రమున స్త్రీ పురుష రూపభేదములు లేని యౌవన శరీరముతో పితరుల శరీరములలో నుంచి చెమటవలె పైకి వచ్చుటయే జననము. పిల్లలు, పెద్దలు అధములు, ఉత్తములు అను తారతమ్యములు లేక, ఇచ్ఛాద్వేషములు లేక, పరస్పరము ప్రవర్తించుచుండిరి. అందరును క్లేశమువలన గలుగు విపత్తులు లేక నాలుగు వేలేండ్లు పూర్ణాయుర్దాయము గలిగి యుండిరి.

తరువాత, అర్ధనారీస్వరూపముగల (అనగా ఒక్క శరీరములోనే స్త్రీపురుష భేదములుగల) జాతి బయలు దేరినది. పురాణములలో పురూరవుడును వాలి సుగ్రీవులను అట్టి అర్ధనారీ స్వరూపులైన పురుషులనుండి పుట్టినట్లు ఉదహరింపబడినది. ఆ పురుషు లా జాతివారు. అప్పటికి ఋతుధర్మములును భూఖండ జలఖండములును

కూడ మారినవి. దీనిని గురించి మార్కండేయ పురాణ
ములో నిట్లుచెప్పబడి యున్నది.“అంతటను గాకున్నను
అక్కడక్కడ భూఖండములు కనిపించినవి. సరస్సులు
కాలువలు,పర్వతములు,సముద్రమునుంచి వేరై కనిపించి
నవి. జీవులు సరస్సులు మొదలైనవానిలోను ,భూఖండ
ముల మీదను పర్వతములమీదను నివసించుచుండెను;
ఇండ్లు ఇంకను లేవు; కాలము సమశీతోష్ణముగా
నుండెను. కాలానుక్రమముగ జనులకు రసోల్లస మను
చిత్రమైన సిద్ధి కలిగినది. దీనివల్ల వారు నీటియొక్క
సూక్ష్మమైన గంధమును ఆహారముగా ఆరగించి తృప్తి
నొందుచుండిరి. ద్వేషము,మత్సరము మొదలగు కామ
క్రోధములు లేక సర్వదా మనస్సున సంతోషము గల
వారై యుండిరి; కాని తుదకు వారికి మరణము తెలియ
వచ్చెను. ప్రతిమనుష్యుడును, జాతి అంతయును కూడ,
మరణము సమీపించినపుడు రసోల్లస సిద్ధిని గోల్పోవు
చుండిరి. ఈ కల్పాంతమున ప్రప్రథమమున జనులలో
లింగభేదము గల మిధునములు పుట్ట నారంభించెను.
వారు మరణకాలమున గ్రుడ్లవంటి ఆకారముగల సంతా
నమును కనుచుండిరి. ఆ యండములు క్రమముగా స్త్రీ
గాని పురుషుడుగాని అగుచుండెను”

## పరిణామములో తృతీయావస్థ

ఇక, మూడవ అవస్థ ఇట్లు వర్ణింపబడినది.

“మనుష్యులకు రసోల్లస సిద్ధి నశించిన తరువాత
వర్షములు కురియుట ఆరంభించెను. ఆ వర్ష
ములో నీరుగాక పాలవంటి ద్రవము పడుచుండెను.

ఆ వర్షమునుంచి కల్పవృక్షములు పుట్టి, అవి నివాసములుగా నుపయోగ మగుచుండెను. వానినుంచి త్రేతాయుగ ప్రారంభమున అప్పటిజనులు తమకు కావలసిన స్వల్పభోగముల నన్నిటిని బడయుచుండిరి. జనులలో స్త్రీ పురుష వాంఛయు, స్త్రీలయందు మాసమాసమునకు రజోదర్శన మగుటయు, కాలనియమమును బట్టి గర్భోత్పత్తి యగుటయు ఆరంభించెను. ఈ కాలము కలుగుటచేత కల్పవృక్షములు నశించి, యితర విధములైన వృక్షములు బయలు దేరెను. ఒక్కొక్క చెట్టుకు నాలుగేసి తిన్ననైన కొమ్మలుండెను. వానినుండి ఆ జనులకు కావలసినతిండి బట్ట దొరకుచుండెను. ఆ చెట్లయొక్క కుండవంటి కాయలలో తేనెవంటి ద్రవము (తుమ్మెద లక్కర లేకుండ) చేరుచుండెను. అది చూచుటకు ఇంపుగాను, తినుటకు రుచిగాను, పుష్టికరముగాను ఉండెను. అదే ఆ జనులకు ఆహారము. పిదప జనులలో మత్సరమును అహంకార మమకారములును పెరుగజొచ్చెను. ఆ పాపము చేత వారికి నివాసము, తిండి, బట్ట ఇచ్చుచుండిన వృక్షములు నశించి, ఆకలి దప్పులు, శీతోష్ణములు బాధింపజొచ్చెను. దుష్టులు, పిశాచములు, రక్కసులు, సర్పములు, క్రూరమృగములు, పక్షులు, సరీసృపములు, మత్స్యములు బయలు దేరెను. ఇవి కొన్ని అండజములు, కొన్ని అవారకములు. * ఇవన్నియు జనులయొక్క పాపకర్మలవల్లను పాపసంకల్పముల వల్లను పుట్టినవి. వీనినుండియు, శీతోష్ణముల నుంచియు కాపాడుకొనుటకు జనులు గృహా

---

* అనగా శరీరమును కప్పు తిత్తి లేకుండ పుట్టునవి.

ములను, పల్లెలను, పట్టణములను, నగరములను నిర్మించ నారంభించిరి. (మొదటిలో వారిగృహములు పూర్వము కల్పవృక్షముల లోని పర్ణశాలలవలె కట్టుచుండిరి.) జనులు ఆహారముకొరకు పాటుపడఁజొచ్చిరి కాని, విశేషశ్రమ అక్కరలేకుండెను. కోరి ప్రార్థించినంతనే వర్షము కురియుచుండెను. *వాననీరు పల్లపు ప్రదేశములలో చేరి, సరస్సులు అయి, పల్లపు జాయలలో ప్రవహించి నదు లాయెను. అంత క్రొత్తరకము వృక్షజాతులు పుట్టి ఋతువులనుబట్టి కాయలుకాచుచుండెను పదునాలుగు రకముల అడవి ధాన్యములు పండుచుండెను. అవి గ్రామముల చెంతను అడవులలోను కూడ వ్యవసాయ మక్కరలేక పెరిగి ఫలించుచుండెను. రాగద్వేషములు, మత్సరములు, పరస్పరము హాని చేసికొనుట ఇంకను పెరిగి, బలవంతులు బలహీనులను తొలగించి ఆ చెట్లను ధాన్యములను వశపరచుకొన నారంభించిరి. క్రొత్తవిధమైన గర్భోత్పత్తి ఆరంభము కాగానే మానసికములును, శారీరకములునైన లక్షణములయం దసమానతయు (భేదములు) నుండఁజొచ్చెను. దానితో కష్టపడకుండ ఆహారము లభించు ఆధారములు కూడ నశించెను. అంత జనులు విభ్రాంతచిత్తులై బ్రహ్మను శరణుజొచ్చిరి. బ్రహ్మ తనను శరణుజొచ్చిన క్షుధార్తులైన ప్రజలకొరకు భూమాతను గోరూపముగా బుట్టించి (అనగా, పాలపశువులు పుట్టినవనుట) వాని పాలను

---

* ఈ మూడవజాతికి చెందిన ఆఫ్రికానివాసులలో ఇప్పటికిని వానకొఱకు ప్రార్థనలుచేయు ఆచార మున్నది

పితుకుట జనులకు చూపెను. తిరిగి పలురకముల ధాన్యములు, ఫలవృక్షములు పుట్టెను. కాని. అవి మునుపటి వలె, మనుష్యులు పాటుపడి వ్యవసాయము చేయకుండ ఫలించుటలేదు. అందుచేత బ్రహ్మ వారి చేతులను పూర్తిచేసి, చేతులతో బనిచేయుట,సస్యములు,తోటలు పెంచుట నేర్పెను. అంతటినుంచి మనుష్యులు తమ చేతులతో పాటుపడి జీవించుచుండుటచేత ఈయుగము హస్తసిద్ధియుగ మనబడెను. అంతకుపూర్వపు యుగములు వార్క్ష (వృక్షసంబంధమైన) సిద్ధియుగము రసోల్లాసాసిద్ధియుగము, ఇచ్ఛాసిద్ధియుగము అనబడుచుండెను. బ్రహ్మ జనులకు వర్తక వ్యాపారము, కర్షక వృత్తి, పరిశ్రమలు నేర్పి, వారివారి స్వభావములను బట్టి సామర్థ్యములను బట్టి, వేరు వేరు వర్ణములుగా విభజించి క్రమముగా భేదములు కలిగించి వాని కనుగుణ్యములగు పద్ధతులను ఆచారములను సృష్టించెను. మఱియును మనుష్యులలో క్రొత్తగా బయలుదేరిన పుట్టుట, పెరుగుట, కృశించుట, మరణించుట అను అవస్థలను అనుసరించి ఆశ్రమధర్మముల నేర్పఱచెను."

మార్కండేయ పురాణములో బ్రహ్మ చేసినట్లు చెప్పినవన్నియు విష్ణుభాగవతములో విష్ణుని అవతారమైన పృథుచక్రవర్తి చేసినట్లు చెప్పబడినది పృథువు రాజాంకితమునొందిన మొదటిభూపతియనియును,అతడే మొదట ఆవుకు పాలు పితికినట్లు, భూమిని దున్నిచదును చేసినట్లు, భూమినుండి ధాన్యములను, లోహములను, రత్నములను తీసినట్లు, ఇండ్లు నగరములను కట్టినట్లు చెప్పబడినది.

# ఆగామి సత్యయుగము

మనుష్యజాతియొక్క పూర్వచరిత్ర యీ విధముగా పురాణములలో చెప్పబడినది. ఇక భవిష్యత్తునుగురించి కలియుగాంతమున తిరిగి సత్యయుగమునాటి స్థితి వచ్చునని మాత్రము చెప్పబడినది. పురాణములలో ఇంకొక విషయముకూడ చెప్పబడినది. అదియేమన యుగములు ప్రపంచమునందంతటను ఒక్కమాదిరిగా నుండవు. ఒకచోట నొకజాతికి ఒకయుగము జరుగుచుండగా, మరియొకచోట అక్కడజాతికి మరియొకయుగము జరుగుచుండును. వయోభేదములు గల మనుష్యులు ఒక్కతరమువారుగాని మూడు నాలుగు తరములవారుగాని ఒక్కయింట కలిసియున్నట్లే వివిధ యుగధర్మములచే పాలింపబడు జనులు ఒక్కమారు ప్రపంచమున నుందురు. అందుచేత, సత్యయుగము తిరిగివచ్చును. అని చెప్పినపుడు ఆమాటకు మొత్తముమీద మానవజాతి అంతయు ఇప్పటి గాఢమైన అహంభావము మీదను, లింగభేదముల మీదను విరక్తిచెంది వానివల్ల కలిగే రాగద్వేషములను, కామోద్రేకములను భరించజాలక అంతులేని వివాదములు అభిప్రాయభేదములు పొట్టకూటి కొరకు, అధికారముకొరకు, గౌరవముకొరకు, భోగములకొరకు పడు పలుబాములు చూచి విసువు పుట్టి ఇంతకంటె నున్నతస్థితినిపొంది, క్రమముగా అర్ధనారీరూపమును, తరువాత లింగభేదములేని రూపమునుపొంది, ఐహిక సుఖముల నిచ్చు నింద్రియభోగములను విడిచి, పరమార్థసుఖమును బడసి తుదకు బ్రహ్మయొక్క పగలు ముగియునప్పటికి ముక్తులగుదురుఅని అర్థముచెప్పవలెను.

మానవజాతియందు ఇటువంటి మార్పులు కలుగు సన్ని వేశములో మనుధర్మశాస్త్రము రచింపబడినది. అందలి సూత్రములను గురించి విచారించకముందు, వాని కాధారములైన (మీద సంగ్రహముగ ఉదహరించిన) చారిత్రిక విషయములను గురించి కొన్ని సంగతులు చెప్ప వలసి యున్నది.

## సాదృశ్య ధర్మము

మొట్టమొదట యీ మార్పులు గలుగుట అసంభవము కాదని చెప్పవలెను. ఒక అణువుయొక్క నిర్మాణము ఒక సూర్యమండలముయొక్క నిర్మాణమును పోలియుండును. ఇది సాదృశ్యధర్మము. ఇది అందరును అన్ని విషయములలోను అంగీకరించినదే. భౌతికశాస్త్ర పండితులు కూడ అంగీకరించుచున్నారు. బిడ్డ గర్భములో పడినది మొదలు వెనుక తానే యే వర్గులలో పుట్టి వృద్ధియైన మనుష్యుడాయెనో మనుష్యుడై యేయే రూపములను పొందెనో,ఆయా వర్గుల రూపముల నన్నిటిని ఆయా జాతుల రూపముల నన్నిటిని, పొందునన్న సంగతికూడ అందరును అంగీకరించినదే. ఇదియును ఒక విధముగ సాదృశ్యధర్మము మీద ఆధారపడిన దనియే చెప్పవచ్చును. ఈ ధర్మమును బట్టి ఒక మనుష్యుని యందు కనబడు మార్పులు వెనుక మనుష్యజాతియందు కనబడిన వని యొప్పుకొనక తప్పదు. శైశవమున లింగ భేదములేని యవస్థయును, బాల్యమున స్త్రీపురుషఉభయ లక్షణములు కలుగు అవస్థయును, యౌవనమున ప్రత్యేక జాతి లక్షణమును, కౌమారమున ఆభేదము క్రమముగా తగ్గి వార్ధకదశలో పూర్తిగా పోవుటయును చూడ,

మనుష్యజాతియును అట్టి అవస్థల నన్నిటిని దాటవలసి యున్నట్లు స్పష్టమగుచున్నది. ఈ కాలమున మనుష్యుని యందు ఈ అవస్థాభేదము లన్నియు శరీరరూపమునందు కనబడవుగాని మానసిక వ్యాపారములలో గానవచ్చును. అయినను సాదృశ్యము చూపుటకే యుదాహరణము చూపబడినది.

## లింగభేదము

రెండవ సంగతి. లింగభేదమును గురించి యింతవరకు చెప్పవలసిన ఆవశ్యకతయేమి? పురాణములలో నుంచి ఉదాహరించి మీద వ్రాసిన వాక్యములవల్ల లింగ భేదమువల్లనే తక్కిన భేదములు, మానసిక శారీరక సంస్కారములు, సాంఘిక నిర్మాణములు అన్నియు సంభవించిన వని తెలియుచున్నది. పురుషుని యందు "అహం" భావము బలపడుట, తరువాత దాని నతిక్రమించుట, ఈ పరిణామముయొక్క యుద్దేశము. అయితే అహంభావమునకు వృద్ధిక్షయములు లింగభేదము ననుసరించి జరిగినట్లు కనిపించుచున్నది. ఈ భేదముల ననుసరించియే తక్కిన కామము లన్నియును, అనంతములైన సంసారపు చిక్కులును సంభవించుచున్నవి. కనుక, ఈ భేదమును గురించి అంతగా చెప్పవలసి వచ్చినది.

## మానసిక ప్రవృత్తి

మూడవది, మీద నుదహరించిన వాక్యములలో మనుష్యుని మనస్సులో కలిగిన మార్పులను బట్టి స్థూలలోక పరిస్థితులలో మార్పులు కలిగినట్లు కనిపించుచున్నది. ఇప్పటి బుద్ధిమంతుల కిది విపరీతముగ తోచును.

వారు మనుష్యుని చుట్టును ఉండు స్థూలపరిస్థితులను బట్టి మనస్సు మారునని యందురు. మనుష్యులయందు దురాశ, వైరబుద్ధి ఎక్కువ యగుటచేత వర్షములు కురియక, పంటలు పండక, కాటకములు వచ్చునని చెప్పినయెడల వారికి ఆశ్చర్యముగా నుండును. కాటకముచేత తిండి లేకపోవుటచేతనే, ఇతరుల సొత్తు నపహరించ వలె నను బుద్ధిపుట్టి, దొంగతనము లుబ్ధత్వము మొదలైన దుర్గుణములు బయలుదేరునని వారందురు. నిజమునకీ రెండును ఒకదాని కొకటి కారణము. మొత్తముమీద మూల కారణ మేది యనిన చెప్పుట కష్టము. విష్ణుపురాణములో మనుష్యుని పూర్వచరిత్ర వర్ణనమునందీ యభిప్రాయమే కనపడుచున్నది. విష్ణువు మనుష్యుని హృదయము కఠినముగా చేసి, తోడనే వాని చుట్టును అహంభావ ఫలితములు పూర్తిగా అనుభవమై, దానివల్ల ప్రేమ ఉదయించి, నిండు హృదయముతో ఆ సర్వ కారుణ్యమూర్తి యాజ్ఞకు లోబడునట్లు మనుష్యుని మార్చగల ప్రకృతి పరిస్థితులను కల్పించెను, అని చెప్పబడినది. దీనిని బట్టి చూడ మానసిక ప్రవృత్తియు స్థూలలోక పరిస్థితులును ఒకదానినుండి యొకటి సంభవించునని కనిపించును. ఒకానొక యుగమును తీసికొని పరీక్షించి చూచిన యెడల ఆ యుగము దేనితో నారంభించినదో చెప్పవచ్చును. ప్రాచీన తత్త్వ శాస్త్రజ్ఞు లీ సంగతి నెరుగుదురుగాని, లౌకిక వ్యాపారముల కొరకు, చైతన్యముతో ప్రపంచచరిత్రము నారంభించి, ఈశ్వరుని చైతన్యమునుండి యొక బ్రహ్మాండముయొక్క గాని, ఒక మండలముయొక్క గాని, వ్యక్తియొక్క గాని పరి

ణామమంతయు వికసించిన దని వివరించి చెప్పిరి.
ఒకడు ఒకయిల్లు కట్టునపుడు ముందుగా మనస్సులో ఆ యిల్లెట్లుండ వలెనో సంకల్పించుకొని ఆ సంకల్పమును బట్టి ఇల్లుకట్టును. అవిధముగనే ఈలోక నిర్మాణముకూడ జరుగుచున్నది. ఈ లోకమునందలి స్థూలసృష్టి సూక్ష్మశక్తులవల్ల కలిగినదని యంగీకరించిన యెడల సత్పురుషులున్నచోట దేవతలు తృప్తులై పాడి పంటలు వృద్ధిగా నుండుననియును నమ్మవచ్చును. తల్లియందు మాతృప్రేమయు, నోరులేని శిశువు నెడల కరుణయు, ఉద్రేకించి నపుడు పాలు సమృద్ధిగా నుండును. అటువంటి మాతృప్రేమ శిశువు తల్లిచెంతకు ఆమె సహాయముకొరకు వచ్చి నప్పుడు ఎక్కువగా కలుగును గాని, పిల్లలు పెద్ద వారైన తరువాత వారామె నాదరించక పోరాడినపుడు కలుగదు. అట్లేమనుష్యులు వృద్ధియై పాపకర్మలైనపుడు భూమాత గొడ్డుపోవును. మనుష్యుల కామములు చెడి పోయినపుడు భువర్లోకమునందు దుష్టభావములు దుష్ట సంకల్పములు రూపములు పొంది, అవి సర్వత్ర చలనములు కలిగించును. ఆచలనములవల్ల కలుగు మార్పులచేత కాటకములును రోగములును బయలుదేరును. యోగవాసిష్ఠములో జీవసూచీరూపమున మనుష్యులలో ప్రవేశించి ఆహారమును సంపాదింపగోరి తపస్సుచేసిన కర్కటియను రక్కసికి బ్రహ్మ ప్రత్యక్షమై 'విషూచి యను పేరుతో సూచీరూపమున దుర్మార్గులలో ప్రవేశించి బ్రతుకు'మని వరమిచ్చెనని చెప్పబడి యున్నది. 'దీనివల్ల దుర్మార్గ మున్నచోటనే గాని విషూచి ప్రవే

శించదని తెలియుచున్నది. ఆర్థికవిషయమున గూడ తుదకు నీతి శీలము గలచోట సమృద్ధియు సుఖమును కలుగు ననియును, పోటీలు, ఇతరుల నణగద్రొక్కు-టకు ప్రయత్నములు, ఉన్నచోట బాధలు కలుగు ననియు మనకు ప్రత్యక్షముగ తెలిసినసంగతి.

## రసోల్లససిద్ధి

నాల్గవసంగతి : పై నుదహరించిన వాక్యములలో సూచింపబడిన సూక్ష్మశక్తులను గురించి మరికొన్ని వివరములు. మన చుట్టును జరుగుచున్న సంగతులను పరిశీలించి చూచినయెడల అందులకు నిదర్శనములు కనిపించును. ఓషధులు (తరుగుల్మలతాదులు)ను తక్కువ తరగతుల జంతువులును రసోల్లససిద్ధిచే జీవించుచున్నవి. అవి అప్రయత్నముగ పంచభూతములనుంచి ఆహారమును గ్రహించుచున్నవి. చాలాభాగము జంతువులును మనుష్యుడును ఇప్పటికిని వార్త సిద్ధిచే జీవించుచున్నారు.

ఇప్పు డీ ప్రపంచమునందున్న జనులలో మిక్కిలి గొప్పభాగము తమ తిండికి, ఒట్టకు, పాత్రలకు గృహనిర్మాణమునకు కావలసిన పరికరము లన్నిటిని వివిధములైన చెట్లనుండి సంపాదించుకొనుచున్నారు. మనుష్యుల కిప్పటికిని ముఖ్యమైన జీవనాధారము గాలి. ఇదియొకవిధమైన రసోల్లసము. ఓషధులలోను జంతువులలోను ఇప్పటికిని అన్నివిధములైన సంతానవృద్ధి విధానములు కనిపించుచున్నవి. మనుష్య శరీరములు పూర్వకాలములలోకంటె ఇప్పుడు చాలాభిన్నముగానున్నవి.

కాని పూర్వపు శరీరములలో ఏ జీవులు పుట్టిరో ఆ జీవులే యిప్పటి శరీరములలో పుట్టుచున్నారు. ఇందుకు నిదర్శనము జయవిజయులు — ఒక జన్మములో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగను, ఒక జన్మమున రావణ కుంభకర్ణులుగను, ఇంకొక జన్మమున శిశుపాల దంతవక్త్రులుగను పుట్టిరి. మూడు జన్మలలో శరీరములు మూడురకములుగా వర్ణింపబడినవి.

అయిదవసంగతి: వెనుకటి మహా మన్వంతరములలో మనుష్యవర్గ క్రిందివర్గములలోనుంచి క్రమముగా వికసించినను, ఈ మహామన్వంతరములో మాత్రము మనుష్యుల నుంచియే తదితరవర్గులన్నియు పుట్టినవని దివ్యజ్ఞానసమాజ గ్రంథములలో వ్రాయబడియున్నది. ఇది పురాణముల లోని వాక్యములవల్ల రూఢిపడుచున్నది.

బ్రహ్మచే ఆజ్ఞాపించబడి రుద్రస్థాణువు తనను పోలిన ప్రజలను సృజించెననియు ఇవే(Monads తురీయాత్మలు అని దివ్యజ్ఞాన సమాజగ్రంథములలో పేర్కొనబడినవి.) వారు తిరిగి సృజించుటకు అంగీకరించలేదనియును ఒక గాథయున్నది. విష్ణుని మోహినీ యవతారమును చూచి శివుడు మోహించినట్లును, అందువల్ల శివునకు రేతఃస్ఖలన మైనట్లును, ఆరేతస్సునుండి ఖనిజములు పుట్టినట్లును ఒక గాథయున్నది. ఇవన్నియు చూడ (Elemental Kingdoms) (సౌరాత్మాది వర్గులు) భగవంతునిలో, వృక్షములో బీజములు వృద్ధిఅయినట్లు వృద్ధియై పైకి వచ్చునని తెలియుచున్నది. ఇటువంటి గాథలన్నియు మన వైవస్వత మహామన్వంతరమునకు పూర్వపు మన్వంతరములకు చెందినవని వ్రాయబడి యున్నది. ఈమన్వం

తరములో వైవస్వత మనువు సంతతిలో మనుష్య రూపమున బుట్టిన దక్ష ప్రజాపతి కుమార్తె లైన దితిమొదలైన వారందరు కశ్యప ప్రజాపతిని పెండ్లాడి నట్లును జంతువర్గ వారిసంతతి యనియును వ్రాయబడి యున్నది.

సబబును బట్టి చూచినను ఇది యథార్థమని చెప్ప వచ్చును. మనుస్మృతిలో "యంతుకర్మణి యస్మిన్ సన్యయుఙ్త ప్రథమం ప్రభుః, సతదేవ స్వయం భేజే సృజ్యమానః పునఃపునః హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృతే యద్యస్య సోఽదధాత్ సర్గే తత్తస్య స్వయమావిశేత్. (1-28,29) [ప్రభువు ఏ ప్రాణిని ఏ వృత్తియందు పూర్వము నియమించెనో, మరల జనించునపుడు ఆ ప్రాణులు అట్టి కర్మములనే చేయుచున్నవి. హత్య, హత్యలేమి, దయ క్రౌర్యము, ధర్మము అధర్మము, సత్యము అసత్యము, ఏ గుణమైనను ఒక్కొక్కటి ఒక్కొక్క జాతి ప్రాణులకు వృత్తిగా నేర్పడినది]. అని చెప్పుటచేత జాతిభేదము స్థిరమని కనిపించుచున్నది. ఆధునిక భౌతిక శాస్త్రమువల్లను ప్రాచీన శాస్త్రములవల్లనుగూడ ఆత్మ వృక్షపాషాణాది వర్గలలో నుంచి క్రమముగా వికసించి తుదకు మనుష్య వర్గులో ప్రవేశించు ననియును అప్పుడే మోక్షము సాధ్యమనియును కనుపించుచున్నది. ఈ పరిణామ క్రమము ప్రత్యేకముగ ప్రస్తుత మహామన్వంతరములో తలక్రిందై, మనుష్యులు ముందుపుట్టి, మనుష్యులనుంచి జంతువులు మొదలైనవి పుట్టినవాయను ప్రశ్న కలుగును. ఈప్రశ్న చాతుర్వర్ణ్య విభాగమును గురించి విమ

శ్నించినపుడు వచ్చును గనుక దీనిని గురించి మరి కొంచెము విచారింతము.

## పరిణామవాదము

ఈ భిన్నాభిప్రాయము లన్నిటికిని సమాధాన మొకటి కనిపించుచున్నది. పరిణామవాదులు మూల పదార్థము అను జీవ అణువునందు ఈ పరిణామములో జరుగు మార్పుల కన్నిటికిని బీజమున్నదనియును. ఆ బీజము క్రమక్రమముగా వికసించుటచేత యీ మార్పు లొకదాని తరువాత నొకటి కలుగుననియును చెప్పు చున్నారు. ఇదే పూర్వులు 'అణో రణీయాన్ మహతో మహీయాన్,' 'సర్వం సర్వత్ర సర్వదా,' 'సర్వం సర్వాత్మకం విద్ధి' ఇత్యాది వాక్యములలో చెప్పి యుండిరి. ప్రతి అణువులోను అనంత విశ్వమంతయు (బీజరూపమున) నున్నది. కాని బ్రహ్మ దేశకాల నియ మము లేర్పర్చి, ఏజీవఅణువు ఏరూపమును ఎప్పుడుపొంద వలెనో, ఆ రూప మెంతకాలము నిలిచి యుండవలెనో విధించెను. ఏ ప్రాణియొక్క ముఖవర్చస్సు ఎట్లు మారినను ఏ ప్రాణి యే యంగవిన్యాసము చేసినను, ఏ ప్రాణి ఏ విధముగా నిలిచినను అవన్నియు బ్రహ్మ చైతన్యములో నున్నవే. ఒక్క ప్రాణియొక్క వివిధ అంగవిన్యాసములను ముఖవికారములను ఒకొక్క దాని కొకొక్క ఛాయాపటము తీసినయెడల ఆ యొక్క ప్రాణియు ఆ ఛాయాపటములలో అనేక ప్రాణులుగా కనిపించుచుండును. ఆ విధముగనే ఒకొక్క ప్రాణియు బ్రహ్మచైతన్యమునం దొకొక్క భావవికారరూప మని మన మనుకొన

వచ్చును. అందుచేతనే పురాణములలో బ్రహ్మ కొకప్పుడు కోపము వచ్చినందున ఆతని జుట్టు రాలిపోయి సర్పములైనవని, ఇంకొకప్పుడు దుఃఖముచే బ్రహ్మకు కన్నీరు కారగా ఆ కన్నీరు రోగముల రూపము నొందెననియును చెప్పబడి యున్నది. బ్రహ్మ సంతోషముచే మందహాసము చేయగా దేవతలు, అప్సరసలు పుట్టిరని, బ్రహ్మయందు ఉద్వేగము, కార్యోన్ముఖత కలిగినపుడు మనుష్యజాతి పుట్టెననియు చెప్పబడినది.

మెదడులో బాధకరములైన వృత్తులు పుట్టినయెడల శరీరములో విషపదార్థములు రోగాంకురములు పుట్టుననియును, భావోద్రేకము వల్ల పుట్టిన సంకల్పములు రూపములు పొందుననియును, భావములు మిక్కిలి తీవ్రముగా నున్నయెడల ఆ సంకల్పరూపములు స్థూలములై కంటికి కనిపించుననియును, భౌతికశాస్త్రజ్ఞులు ఒప్పుకొనుచున్నారు. అట్టిచో బ్రహ్మచైతన్యములోని మార్పులు రూపములు పొందు ననుటలో ఆశ్చర్యము లేదు. మరియును, నీచోత్తమభేదము లేకుండ సకల భూతముల చైతన్యమునకును డోలికాగతినియమ మున్నది. ఏకత్వము, ప్రేమనుంచి అనేకత్వము, విరోధమునకును, అక్కడనుంచి తిరిగి ఏకత్వమునకును నియమానుసారముగ ఊగుచుండును. సృష్టియంతలోను ఈ రెండుగతులు నున్నవి. మనకు కావలసిన సమాధాన మిక్కడనే యున్నది. మన యుగములు, మన్వంతరములు, మొదలగు కాలమానములను ఏకత్వస్థితి నుండిగాని అనేకత్వస్థితి నుండిగాని లెక్కపెట్టుకోవచ్చును. దినప్రమాణ

మును కొందరు సూర్యోదయమునుంచియు కొందరు మధ్యాహ్నమునుండియు, మరికొందరు నడిరాత్రినుంచియు లెక్క చూచుటలేదా? ఒకచోట మధ్యాహ్నమైనప్పు డింకొకచోట ఉదయమో సాయంత్రమో నడిరాత్రియో అయి యుండలేదా? అట్లే అనేకచోట్ల అనేక విధములుగ కాలమానముకూడ లెక్కచూడబడు చున్నది.

బ్రహ్మయొక్క దినములో ఒక్కపగలు ఒక సంపూర్ణమైన కల్పముగా భావించిన యెడల అందులో మొదటిభాగము ప్రవృత్తియును, రెండవ భాగము నివృత్తియునై యుండును. అట్లుగాక ఒక పగలు ఒక రాత్రి కలిపి ఒక కల్పముగా భావించిన యెడల ప్రళయకాల మధ్యమునుంచి సృష్టికాల మధ్యమువరకు ప్రవృత్తియును, సృష్టికాల మధ్యమునుంచి ప్రళయకాల మధ్యమువరకు నివృత్తియు నగును. ఈ విధముగ కాలమానమునం దన్నివిధములైన యుగాదులను యోచించవచ్చును.

వెనుకటి మహామన్వంతరములలో జీవులు వికసించుటలో మాంద్యము, అసూయ,పోరాటము గలుగచేయు దుష్టస్వభావము నంతను లోపల అణగద్రొక్కి బీజరూపముగ నుంచుకొని, యీమన్వంతరములో మనుష్యజన్మ కలిగిన తరువాత——వ్యక్తిజీవితములో దేహమునకు రోగము క్షయము సంభవించినట్లే——స్వార్థము . ప్రవేశించి అణగియున్న దుష్ట స్వభావమంతయు పైకి వచ్చి దానివల్ల జంతురూపములు పుట్టి, పరిణామమున వెనుకబడియున్న జీవులకు తగిన ఉపాధులై యుండ

వచ్చును. అట్టిజీవులకు మనుష్యులు పరిణామములో సహాయులై తమ పాపమును క్షయము చేసికొని మనుష్యజాతి యంతయును మోక్ష మార్గమున పురో వృద్ధినొందును. ఈ విధముగా జీవులు ఉపాధులు తరతరములుగా అంతములేని జీవిత ప్రవాహమున ప్రవహించుచుండును. జీవితచక్ర మీ రీతిని నిరంతరము తిరుగుచుండ, ఆ చక్రముయొక్క ఆకులమీదను కమ్మ్రీ మీదను ఈ జీవులుండి క్రిందకు మీదకు తిరుగుచుం దురు. మనువు,

"అసంఖ్యామూ ర్తయ స్తస్య నిష్పతంతి శరీరతః।
ఉచ్చావచాని భూతాని సతతం చేష్టయంతి యాః"
12-15.

[ఈశ్వరుని శరీరమునుంచి అసంఖ్యాకములైన రూపములు పుట్టుచున్నవి. ఇవి ఉత్తములు నీచములు అగు జీవులకు ఉపాధు లగుచు ఆ జీవులచే నడుపబడు చున్నవి] అని చెప్పెను.

ఇది మనుష్యజాతియొక్క చరిత్రము. ఇక ఈమానవ జాతికై యేర్పడిన ధర్మశాస్త్రమును గురించి విచారింతము.

# సృష్టిక్రమము జీవిత సమస్యలు

## ద్వితీయాధ్యాయము

ఇంతవరకు సంగ్రహముగా చెప్పిన మనుష్యజాతి చరిత్రమువల్ల మనుష్యునకు మొదటి రెండవస్థలలోను నేటి స్మృతులలో నున్న నియమములవంటి నియమములు పద్ధతులు అక్కరలేకయుండెనని తెలియుచున్నది. ఆ కాలపు మనుష్యుని జీవితమున ప్రవృత్తి నివృత్తిభాగములు రెండును, ఏ నియమములు అక్కరలేకుండ సహజముగను, సులభముగను గడచిపోవుచుండెను. సమత్వము, సోదరత్వము, స్వేచ్ఛ అను లక్షణములు స్థూలాతిస్థూలరూపమున వారికి సహజములై యుండెను.

మూడవ మానవజాతి కాలములో ప్రజావృద్ధి విధానము మారగానే జనులలో ద్వేషము బయలుదేరెను. మొదట ఒకని శరీరము విరిగి రెండుముక్కలై రెండును ఇద్దరు మనుష్యుల శరీరము లగుచుండిన కాలమునను, పిదప ఒకని శరీరములోనుండి చెమటవలె పైకి మరియొకనికి శరీరము వచ్చుచుండిన కాలమునను, ఆ యిద్దరిలోను శారీరక సోదరత్వము, సమత్వభావము ఉండెను. దానికి బదులు తల్లివేరు, తండ్రివేరు అయి, వారినుండి మరియొకశరీర ముత్పన్నమగుట ఆరంభించిన తరువాత సోదరత్వమునకు బదులు, పితృభక్తి, మాతృభక్తి, పుత్రవాత్సల్యము అను భేదములు కలుగజొచ్చెను; సమత్వ

మునకు బదులు పెద్దవారు, శిశువులు, వీరివారు సంరక్షించుట, వారిమీద వీరు ఆధారపడియుండుట అను భేదములు కలుగజొచ్చెను; రాగద్వేషములు బయలుదేరగనే, అందరకును కావలసిన సామగ్రి నొక్కడే జాగ్రత్త చేసికొనుట మొదలగు స్వార్థసహితమగు బుద్ధులు పుట్టజొచ్చెను. దానితో మనమిప్పుడు సాధుజంతువులలో చూచు సహజసాంఘిక జీవనమువంటి జీవనమునకు భంగము కలిగెను. శారీరక సమత్వమునకు బదులు శరీరపోషణకును మానసికాభివృద్ధికిని అందరకు సమానహక్కు కలదను భావము కలిగినది. సోదరత్వము శారీరక సోదరత్వముగాక ఆత్మసోదరత్వమైనది. స్వేచ్ఛయును శారీరకస్వేచ్ఛనుంచి ఆధ్యాత్మిక స్వేచ్ఛగా మారినది, ఈ మార్పులతో పద్ధతులు, ఆచారములు, వృత్తి భేదములు అగత్యములైనవి. ప్రజలను పరిపాలించుటకు రాజులు నియమింపబడిరి. దీనిని గురించి యోగవాసిష్ఠమునం దిట్లు చెప్పబడినది.

వసిష్ఠుడు రామున కిట్లనియె: ''పరబ్రహ్మములో మనసృష్టికి కర్తయైన బ్రహ్మ, సముద్రతరంగములమధ్య లేచు నొక తరంగమువలె, ఒకస్పందరూపమున, స్వయముగ బుట్టెను. ఆ బ్రహ్మసృష్టిలో సత్యయుగము, అనగా, శైశవమునందున్న మానవజాతి పెద్దలు చెప్పినట్లు నడుచుకొనుచుండిన యుగము, ముగియగనే 'అహం' భావము పుట్టి అమాయకత్వమును అణచివైచి, బాలునకు యౌవన మంకురించినప్పుడు హృదయములో సంకులము పుట్టినట్లు, మనుష్యుల మనస్సులలో సంకులము పుట్టెను. అంత బ్రహ్మ తనసృష్టియొక్క భూతభవిష్య

ద్వర్తమానములను జాగ్రత్తగా పరిశీలించి చూచి, నన్ను పుట్టించి, నాకు సకలమైన జ్ఞానమును ప్రసాదించి, అజ్ఞానులగు మానవులకు జ్ఞానము నొసంగు మని నన్ను భూలోకమునకు బంపెను. నావలెనే నారదాది మహా మునులను గూడ పంపెను. మాయందరకును శ్రీ శ్రీ శ్రీ సనత్కుమారులు * నాయకులు. ఆ మునులు ఆయా ప్రాంతములలో సమ్మూఢచేతస్కులైన జనులను పాలించుటకై రాజులను నియమించి, పద్ధతులను, శాస్త్రములను నేర్పరచి, దేవతలకు మనుష్యులకు పరస్పర

---

* శ్రీ శ్రీ శ్రీ సనత్కుమారులు స్కందుడను పేరున ఛాందోగ్యోపనిషత్తులో తారకమంత్రోపదేష్ట యని చెప్పబడెను. తరింపజేయునది గనుక తారకము. స్కందుడు శివునకు పార్వతి,అగ్ని, గంగ,ఆర్గురుకృత్తి కలవల్ల కలిగిన పుత్రుడనియు, శ్రీకృష్ణుని కుమారుడగు సాంబుడు స్కందుని యవతారమనియును చెప్పబడినది. బ్లావాట్స్కీగారి (Secret Doctrine) గుప్తవిద్యలో సనత్కుమారులవారు, ఒకకోటి యెనుబది లక్షల సంవత్సరముల క్రిందట, కృతయుగము గడచి, త్రేతాయుగము సగము గడచినపుడు, మూడవ మానవ జాతికాలమున శుక్రమండలమునుంచి భూమండలమున ప్రాణుల నుద్ధరించుటకు విచ్చేసిన శివస్వరూపులైన నలుగురు కుమారులలో నాయకుడనియును, ఆయన శరీర మనేకమంది ఋషిపుంగవుల క్రియాశక్తిచే నిర్మింపబడిన వజ్రశరీరమనియును, ఆయన పరమోపదేష్టయనియును వ్రాయబడెను.

సహాయార్థము ఏర్పాట్లు చేసిరి. ఈపద్ధతులను, శాస్త్రములను మునులు ప్రజలలో ధర్మార్థకామముల సిద్ధికొరకు తమ స్మృతినుంచి (జ్ఞాపకము తెచ్చుకొని) నిర్మించిరి. కాలక్రమమున జనులకు ప్రతిదినము భోజనముచేయుటయం దభిలాష కలిగి, ఆహారము కొరకు నేలను దున్ని వ్యవసాయముచేయుటకు ఆవశ్యకత గలిగి నప్పుడు జనులలో వైరములు, క్రోధాది భావోద్రేకములు బయలుదేరి, రాజులు తమ రాజ్యములలో ప్రజలను దండించకయును, రాజ్యముల వెలుపల శత్రువులతో పోరాడకయును ప్రజలను పాలించుట అసాధ్యమాయెను. దానిచేత రాజులును ప్రజలును కూడ మిక్కిలి మనఃక్లేశము పొందినవారైరి. అప్పుడు మేము ప్రజలకు ధైర్యముగొల్పి భగవత్సంకల్పము కొనసాగించుటకై రాజులకు జ్ఞానబోధ చేసితిమి. ఈ యధ్యాత్మ విద్య మొదట రాజులకు బోధింపబడినందున రాజవిద్యయని రాజగుహ్యమని చెప్పబడుచున్నది. రాజుల నుంచి యీ విద్య ప్రజలకు వచ్చినది. రాజులైనను, ప్రజలైనను ఈవిద్యను తెలిసినప్పుడే చిత్తశాంతి కలిగి తమ తమ ధర్మములను యుక్తముగా నెరవేర్చగలరు.”

## మనుస్మృత్యవతరణము

స్వాయంభువ మనువు చెంతకు కొందరు ఋషులు వచ్చి కొన్ని సందేహములను తీర్చుమని కోర, మనువు కొంతవరకు చెప్పి, తుదకు, ‘ఏతద్వోయం భృగుః శాస్త్రం శ్రావయిష్య త్యశేషతః ఏతద్ధి మత్తోఽధిజగే సర్వమేషోఽఖిలం మునిః [ఈశాస్త్రమును నావల్లసమగ్రముగ భృగువు విని తెలిసికొనెను. అతడు దీనినంతను

మీకు జెప్పెను] అని చెప్పెను. ఆ భృగుమహర్షియే మనుస్మృతిని చెప్పెను. భృగువు శుక్రుని తండ్రి. శుక్రమండలమున నేడవ మహామన్వంతరము నడుచుచుండగా అచ్చటినుంచి కొందరు సిద్ధపురుషులు భూమండలమును పాలించుటకు, మూడవ మానవజాతి కాలమున వచ్చిరని బ్లవాట్స్కీగారు వ్రాసిరి. పురాణములలో వర్ణింపబడిన సూర్యవంశమునకు చంద్రవంశమునకు చెందిన రాజులును, గ్రహములతో సంబంధించిన ఋషుల సంతతివారైన వివిధరకముల పితృదేవతలును, చాలామంది మన భూమండలమున నివసించుచున్నారు. దీనిని బట్టి చూడ, ఇతర గ్రహములలోనుంచి మనుష్యులు, సిద్ధి పొందినవారును పొందనివారును గూడ, ఈ భూమండలమున నివసించుటకును, నివసించుచున్నవారిని పాలించుటకును వచ్చినట్లు కనిపించుచున్నది.

వారిలో శుక్రమండలమునుండి వచ్చిన పురుషులు (సనత్కుమారాదులు) భూమండల పరిపాలనమును పూనుకొనిరి. భృగువుచే శాసితములైన ధర్మములు కొన్ని మనుస్మృతిలో వ్రాయబడినవి. అవి హస్తసిద్ధియుగమున, స్త్రీపురుష భేదములు కలిగిన కాలమునందుండిన మనుష్యుల కొరకేర్పరచబడినవి. ఆ కాలమున మనువుచెప్పిన వర్ణాశ్రమధర్మములు అన్ని సంప్రదాయములకును, అన్ని జాతులకును, అన్ని నాగరికతలకును, పునాదియును ఆదర్శ ధర్మములై యుండెను. వర్ణాశ్రమధర్మములను, స్వల్పభేదములతో జను లందరును అవలంబించుచుండిరి,

# నేటి ప్రపంచ సమస్యలు

మనుస్మృతి అంత ఆదర్శగ్రంథ మెట్లయినదో తెలిసికొనుటకును. మన వ్యవహారములలో ఏదైన చిక్కువచ్చి దానిని విప్పుకొనుటకు ఇప్పటి పద్ధతులు పనికిరావని తోచినప్పుడా గ్రంథమును చూచినయెడల మన కొక ఉపాయము తోచునని తెలిసికొనుటకును, ఇప్పటిజనుల మనస్సులను కలత పెట్టుచున్న సమస్య లేవో చూడవలెను. ఈ సమస్యలలో స్వల్ప సమస్యలకు లెక్క లేదు గాని ముఖ్యమైన వెన్నో యుండవు. ఈ గొప్ప సమస్యల పేర్లు అప్పటప్పట మారినవి గాని, సమస్యలు ఎప్పటికిని మారక ఒక్కతీరుననే యున్నవి.

ఈ రోజులలో అనేక లక్షల పత్రికలు పుస్తకములు ప్రచురింపబడి, విశేషమైన శక్తియు కాలమును వెచ్చింపబడు చున్నవి ఎంతో గడబిడ జరుగుచున్నది. కాని, ఎందరు విమర్శించినను ఒక్క విషయమునే విమర్శించెదరు. కలియుగ లక్షణమైన వైరమును పోషించుటకును, ఒకరి నొకరు నిందించుకొనుట, వీరు వారికి సమాధానము చెప్పుకొనుట, ఆత్మస్తుతి, పరనింద, ఆత్మసుఖము, పరహింస, ఇ వన్నియు పెచ్చు పెరిగి, ఏ సమస్యయు విడుటకు వీలు కలుగకుండ చేయుటకును, మాత్రమే ఇన్ని లక్షల పత్రికలును పుస్తకములును పనికి వచ్చుచున్నవి. ఈ లక్షణములు బాలిశులతోను అజ్ఞానులతోను వదలక, అనుభవజ్ఞానము, వివేకము చూపవలసిన వృద్ధులను రాజ్యాంగవేత్తలను కూడ పట్టుకొని, శాసననిర్మాణ సభలలోనికి, అంతర్జాతీయ సభలలోనికి కూడ ప్రాకిపోయినవి. నిరర్థకమైన ఈ గడ

బిడలో ఒక్క చిన్న విశేషము కనిపించుచున్నది. దీనివల్ల జనులు రక్తపాతము లేకుండ శీఘ్రముగా అనుభవము సంపాదించి, అహంభావమును పరపీడనాసక్తిని పోగొట్టుకొనగల రన్న ఆశ కనిపించుచున్నది. దీనివల్ల చేయిచేయి కలిపి పోట్లాడకుండ నిగ్రహించుటయును, మనస్సు, భావములు తీవ్రముగ పనిజేయుటయును సంభవించును. గనుక, మనుష్యుల సూక్ష్మ శరీరములు త్వరలో వికసించి బలపడును.

కలియుగములో ఒక ప్రక్క వ్యర్థజీవనము చేతను మిక్కుటమగు పాపకర్మలచేతను, ఇంకొక ప్రక్క వీనివల్ల ఆవశ్యకమైన ఆత్మత్యాగముచేతను పుణ్యకర్మల చేతను కూడ ప్రాణశక్తి క్షీణించి పోవు ననియును, ఆ విధముగ కలియుగ పరిమితియైన 4,32,000 సంవత్సరములకు చాలా ముందుగానే మనుష్యునకు ఆ యుగములో కలుగవలసిన అనుభవము లన్నియు గలుగవచ్చు ననియును ప్రాచీన గ్రంథములలో వ్రాయబడి యున్నది. ఇప్పటి మనుష్యుల మానసిక ప్రవృత్తులయొక్కయు, భావ ప్రవృత్తుల యొక్కయు శీఘ్రగతిని, నరములలో పటుత్వము తగ్గిపోవుటను చూచినయెడల అది యథార్థ మని కనిపించుచున్నది.

నేటి ప్రపంచ సమస్యలను ఈ క్రిందివిధముగ విభజించ వచ్చును:—

1. పెట్టుబడిదార్లకు కూలివాళ్ళకు వివాద, ధనవంతులకు ధనహీనులకు వివాద; ఇది పెద్దసమస్య. పేదరికము నెట్లు పోగొట్టుట? ప్రతిమనుష్యునకు జీవనాధారమున కగత్యములైన వస్తువులను చేకూర్చుట యెట్లు ?

వృత్తులు, వ్యాపారములు, పరిశ్రమలు మొదలైనవి జనులలో సర్దుబాటగుట ఎట్లు? సమ్మెలు, దొమ్మీలు. విప్లవములు, తిరుగుబాట్లు మొదలగు అక్రమ చర్యలవల్ల సాంఘిక జీవనమున కాటంకము కలుగకుండ చేయుట ఎట్లు? ప్రజలకు బ్రతుకు తెరువు చూపుటెట్లు? అను ఆర్థిక సమస్య ప్రపంచము నందంతటను రాజ్యాంగ వేత్తల నందరను, ప్రభుత్వముల నన్నిటిని కలతపెట్టు చున్నది.

2. స్త్రీ పురుషుల ధర్మములను నిర్ణయించి గృహస్థ జీవనము సుఖతరము చేయుట; జనసంఖ్యను కట్టుబాటులో నుంచుట. అనగా, ఏ దేశములోను పండేపంటల కంటె తినే మనుష్యులు ఎక్కువగా నుండకుండ కట్టుబాటు చేయుట. ఇది మొదటి ఆర్థిక సమస్యతో చాలావరకు సంబంధించియున్నది.

3. రోగములు రాకుండ చేయుట, జనులకు కొంత వరకైనను ఆరోగ్యము శరీర వ్యాయామము సమకూర్చుట, పారిశుధ్య నియమముల నేర్పఱ్చుట, అంటురోగములను నివారించుట, కశ్మలమును, అనారోగ్యము కలుగనట్లు పారవేయుట, లేక నాశనము చేయుట, జనుల నివాసములు ఇరుకుగా నుండకుండుట, మత్తు పదార్థముల వాడుక చేయుట తగ్గించుట; ఇవి అధికారులకెక్కువ ఇబ్బందుల కలిగించుచున్నవి.

4. విద్య. విద్య అందరకు చెప్పవలెనా లేక కావలెనని వచ్చినవారికేనా? విద్య ఉచితముగా చెప్పవలెనా, నిర్బంధము చేయవలెనా? ఏ విషయములు చెప్పవలెను, ఎట్లు చెప్పవలెను? వృత్తులు, చేతిపనులు,

ప్రకృతి శాస్త్రము ఎంతవరకు చెప్పవలెను? ప్రతిరోజున వరుసగా అయిదారు విషయములు బోధించవలెనా, లేక, ఒక్కొక్క విషయము తీసికొని అది బాగుగ నేర్చుకొనువరకు దానినే బోధించవలెనా? మతము, నీతి బోధించవచ్చునా, లేక, బిడ్డలను విచ్చలవిడిగా పెరుగ నీయవలెనా ?

5. రాజ్యాధికార మెవరి చేతులలో నుండవలెను? చట్టములను నిర్మించుటకు అమలు చేయుటకు ఎవరి కధికార ముండవలెను? ఏ విధమైన ప్రభుత్వ ముత్తమ మైనది? ప్రభుత్వ మందలి కార్య నిర్వాహకశాఖ, పరిపాలనశాఖ, న్యాయశాఖ మొదలైన శాఖలకు బరస్పర సంబంధ మెట్లుండవలెను. ఆదాయము హెచ్చుటకు వ్యయము తగ్గుటకు పన్నులను విధించు టెట్లు? అన్ని దేశముల బలము సమానముగా నుండి తమ దేశమునకు పలుకుబడి యెక్కువగా నుండుటకు మంత్రాంగ మేది? ఇటువంటి మంత్రాంగములచే గలుగు సైనిక వ్యయ భారమును తగ్గించు టెట్లు?

6. ఏ వ్యవహారములు ప్రభుత్వమువారు స్వయముగ పూనుకొనవలెను? ఏవి ప్రజలకు విడిచిపెట్టవలెను? భూమియందు హక్కు లెవరికి ఎంతవరకు ఉండవలెను? ధనము ఎవరిచేతులలో ఎంతవరకు ప్రోగు కావచ్చును? ప్రజల ఆహారపదార్థములను ప్రభుత్వమువారు వైద్య శాస్త్రము ననుసరించి నియమించవలెనా, లేక ప్రజలు ఎవరి యిష్టానిష్టములను బట్టి వా రేర్పరచుకొనవలసినదేనా? వివాహ సంబంధములు నిశ్చయించుట, వృత్తుల నెన్నుకొనుట, స్థితిగతుల నన్నిటిని యోచించి నిర్ణయించు

టకు తగిన బుద్ధిమంతుల పనియా, లేక, వ్యక్తుల తాత్కాలిక వ్యామోహమునకు విడిచిపెట్ట తగినదా? మొత్తముమీద జాతీయ సంస్థ అనుభవజ్ఞులు బుద్ధి మంతులు నైన పెద్దల చేతులలో నుండవలెనా, లేక, స్వార్థము, పరపీడనము ఇంత యెక్కువగా నుండి జనుల నైతికస్వభావ మింత దుస్థితిలోనున్న యీ సమయమున జనసామాన్యమునకు విడిచిపెట్టతగునా? ఈ సమస్యలు మొదటి యైదింటిలో చేరినవే యైనను, ఇప్పుడివి ప్రత్యేకముగా ప్రభుత్వములు జోక్యము కలిగించుకోవలసిన వగుచున్నవి.

మనువు చెప్పిన తీరున పరిశ్రమ, విశ్రాంతి, సుఖము, దుఃఖము సమానముగా నుండుకాలము వచ్చి యీ కష్టము లన్నియు తొలగిపోవుటకు మార్గము ఈ క్రొత్త క్రొత్త సమస్యలలోను, ఆ సమస్యలను విడదీయుటకు చేయు ప్రయత్నములలోను ఉన్నది. ధనము అందరి యొద్దను సమముగా నుండునట్లు చేయుటకు క్రొత్త రకము పన్నులు వేయుటకు చేయు ప్రయత్నములు, పూర్వపు మాదిరి వర్ణవిభాగము తీసివైచి వివిధవృత్తుల యందు నేర్పరితనమును బట్టి క్రొత్తవిభాగము చేయుటకు ప్రయత్నములు, ఇటువంటి ప్రయత్నములన్నియును ఆ స్థితికి కొనిపోవును. కాని, ఈ ప్రయత్నములలో నొక ప్రమాద మున్నది. సంఘస్థితిలో నొక మార్పును అకస్మికముగ చేసినపుడు దానివల్ల అనుకొనని కష్టములు ప్రాప్తించవచ్చును. న్యాయముగనో అన్యాయముగనో విశేష ద్రవ్యము నార్జించినవారు పదిమంది ఉన్నా రను కొందము, వారి నాశ్రయించుకొని వారివల్ల బ్రతుకు

కుటుంబములు ఒక వంద బయలు చేరును. ఈ వంద కుటుంబములు చేయు పని ఉపయోగకరమైనది కాక పోవచ్చును. కొందరు ఏ పనిచేయక ఉచితముగా పోషింపబడుచుండవచ్చును. అట్టి స్థితిలో ఒక్కమారు ఆ పదిమంది సంపన్నుల ద్రవ్యమును ప్రభుత్వము వారు స్వాధీనము చేసికొన్న యెడల వారి నాశ్రయించుకొని బ్రతుకుచున్న నూరు కుటుంబములు దిక్కులేక మాడి పోవునుగదా! వారెంత నిర్వ్యాపకులైనను, వారును ప్రజలలో చేరినవారు, పోషింపబడవలసినవారునైయున్నారు. అట్టివారి కట్టి కష్టము తెచ్చుట ప్రమాదకరము కాదా? ఒక పెద్దమేడ చూచుటకు ఇంపుగా లేదని అక్కడ ఒక స్తంభమును, ఇక్కడ ఒకగోడను ముందు వెనుకలు చూడకుండ పడగొట్ట నారంభించిన యెడల మేడ అంతయును కూలిపోవును; చేతనైన యెడల మేడనంతను తీసి వైచి క్రొత్తది కట్టుకో వలెను. లేదా, ఏ భాగమును తీసివేయదలచిన నచ్చట పై కట్టడము పడిపోకుండ ముందు ఆధారములు పెట్టి, పిదప స్తంభమునో, గోడనో తీసివైచి క్రొత్తగా కట్టవలెను. ఆ విధముగ సంఘనిర్మాణములో కూడ మార్పులు కలిగించుట క్రమక్రమముగా ముందువెనుక చూచిచేయవలెను గాని, ఒక్కసారి ఆకస్మికముగ చేయరాదు.

## సంఘనిర్మాణ ధర్మములు

అందుకు మొట్టమొదట ప్రభువులు ప్రజలు కూడ సంఘనిర్మాణ ధర్మములను గురించి బోధపడి నంత వరకు, చక్కగా తెలిసికొనవలెను. తరువాత, ప్రతి వానికిని తాను ఇతరుల కొరకు పాటుపడుచున్నాననే

భావము గలుగవలెను. ప్రతివాడును ఇతరులను తనతో గూడ ముందుకు తీసికొని పోవలె నని ప్రయత్నించ వలెను, గాని, ఇతరులకంటె తాను ముందు పోవలె నను భావము పోవలెను. జనులలో సామాన్యముగ నీతి యెక్కువ కావలెను. అనగా, మానవజాతి అంతటి యొక్క ఆత్మ వికసించవలెను. అప్పుడు పరిశ్రమ, విశ్రాంతి సమానముగా నుండుటయును; ప్రతివ్యక్తియు నూతన శక్తిని సద్వినియోగము చేసి, ఎంత యెక్కువ పని చేయగలడో అంత పనిని చేసి, తన జీవనమున కెంత తక్కువ అవసరమో అంత ప్రతిఫలమును మాత్రము తీసికొనుటయును; అందరును సుఖులై వినోదము విశ్రాంతి ఇచ్చు వస్తువులు స్థలములు అందరును సమా నముగ అనుభవించుటయును; సంభవించును. దివ్యజ్ఞాన సమాజము వారు ఆరవ మానవజాతి యని చెప్పెడు జాతి మనుష్యుల కీ భాగ్యము సామాన్య మయి యుండును. పురాణములలో 'ఉత్తర కురువంశ' మను జాతి వర్ణింప బడినది. వారిలో రాజు లుండరు. పద్ధతు లుండవు. అంద రును సద్వర్తనులై యుందురు. వారు ఈ భూమండ లమునందు ఈ మహా మన్వంతరములో, కడపటి జాతి యైన యేడవజాతి మనుష్యులు.

ఆ జాతి కాలము వచ్చువరకును పాలకులును ప్రజ లునుకూడ 'ఇప్పటి కీ గండము గడిచినచాలు' నన్నట్లు వెనుకముందులు చూడక, ఎప్పటికేది మంచిదని తోచిన దానిని చేయుచుందురు. ఇప్పుడు శాసననిర్మాణ సభ లలో జరుగుచున్న దిదియే. ఒక సభ్యున కేదో యొక లోపము కనుపించును. అతడు దానిని పట్టుకొని దానిని

పోగొట్టుటతోనే ప్రపంచ మంతయు నున్నట్లు విధివిరా మములేక పనిచేసి, ఒక శాసనము వ్రాసి మరికొందరిచే విసిగించి వారిచే దానికి ఒప్పించి సభలో ప్రవేశ పెట్టును. ఆ సభలో దానిమంచిచెడ్డలను, ఇతరవిషయము లకును దానికిని గల సంబంధములను యోచించుటకు వ్యవధిలేక, కొంతసేపు ఒకరినొకరు నిందించుకొని, ఎగ తాళి చేసికొని, తుదకేదోయొకరూపమున దాని నంగీక రింతురు. అప్పటి కిది కొన్ని లోపములను పోగొట్టు నను కొన్నను దానివెనుక క్రొత్తచిక్కులు బయలుదేరును.

## ప్రపంచ సమస్యా పరిష్కారము

ఈ సమస్యలకు మనుస్మృతిలోనే విశేమయిన సమా ధానములు చెప్పబడినవి? మనువు ఈ అయిదవ (ఆర్య) జాతికి తగినట్లు వర్ణాశ్రమ ధర్మములను నియమించెను. నాలుగు ఆశ్రమములు, నాలుగు వర్ణములు, రెండు మార్గములు, వీనితో సంబంధించిన పురుషార్థములు ఆరు; ఈ పదునారింటి మీదను మనుస్మృతి ఆధారపడియు న్నది. ఈ పదునారును మీద చెప్పిన సమస్యలకును, వానితో బయలుదేరు ఉపసమస్యలకును అన్నిటికిని సమాధానము నిచ్చును. అదియెట్లో చూచెదము.

మొదట ఈ సమస్యలను బాహ్యదృష్టితో గాక అంతరంగదృష్టితో చూచినయెడల అనగా పైకి కన బడు రూపముతోను దానిచుట్టునుండు ఐహిక పరిస్థి తులతోను సంబంధించినట్లు చూడక ఆ రూపములలో వ్యవహరించు చైతన్యముతో సంబంధించినట్లు చూచిన యెడల వానిని మరియొకవిధముగా విభజించవచ్చును.

1. మనుష్యుని మనస్సుయొక్కయు, స్థూల దేహము యొక్కయు నిర్మాణమునుబట్టి పుట్టుకతోనే నేను వేరు, ఇతరులు వేరు అను తీవ్రమైన భేదభావము ఆరంభించును. ఈ యవస్థ జీవితములో మొదటి నాల్గవ భాగ మంతమగు వరకు ఉండును. 'జీవతః పితరౌ యస్య మాతు రంకగతో యథా; షష్టిహాయనవర్షోఽపి స ద్విహాయనవ చ్చరేత్.' (మహాభారతము, శాంతిపర్వము) [తలిదండ్రులు బ్రతికియున్నవాడు అరువదేండ్ల వాడైనను తల్లియొడిలో ఆటలాడు రెండేండ్ల బిడ్డవలె (బాధ్యతలు లేక) ఆట లాడుకొనుచుండును] అని చెప్పినట్లు ఆ అవస్థలో వాని సంరక్షణము నంతను ఇతరులు చేయవలెను.

2. తరువాత ఆ నిర్మాణమునుబట్టియే వ్యక్తి కుటుంబమగును. 'ఏతావా నేవ పురుషః యజ్జాయాత్మా ప్రజేతిహ' (మను 9-45) [భార్య, పుత్రుడు, పురుషుడు ఈ ముగ్గురు కలిసియే పురుషు డగుచున్నాడు] అని చెప్పబడినందున పురుషుడు అన్నప్పుడు కుటుంబమంతయును అని అర్థము చేసుకొనవలెను. కనుక, ఈయవస్థలో మనుష్యుడు వ్యక్తులలో తా నొక భిన్నవ్యక్తిని కాననియు, కుటుంబము ననియును, అంతేగాక కుటుంబమంతయు ఇతర జనులతోను, ఇతర కుటుంబములతోను సంబంధము లేకుండ బ్రతుక జాలదనియును, తన కుటుంబము ఒక సంఘములోను, ఒక కులములోను, ఒక జాతిలోను భాగ మనియును గ్రహించును. ఈ కాలము జీవితములో నొక నాల్గవపాలుగా నుండును.

3. మరికొంత వికాసము నొంది పురుషుడు తన

జాతి, తన దేశము ఇతర జాతులతోను, ఇతర దేశముల తోను పరస్పర సంబంధము కలిగియున్నవని, తా నొక విశాల మానవజాతిలో చేరినవాడ నని తెలిసికొనును. ప్రపంచములో నున్న మనుష్యు లందరు, కొందరు ప్రత్యక్షముగాను, కొందరు ఇతరులద్వారాను ఒకరి కొకరు తెలిసియున్నా రనియును, అంతేగాక ఇద్దరు మనుష్యుల పితృపితామహాది పూర్వులను కొన్ని తర ములు వెనుకకు లెక్క చూచినయెడల ఒక్క పురు షుని సంతతివా రగుట సాధ్య మనియును తెలియును. ఈ యవస్థలో పురుషుని 'అహం' తనతోను, తన కుటుంబముతో సరిపడియుండక, తెలిసియో, తెలియ కయో పైకి విస్తరించి తనవా రను మమతపోయి, ఇత రులు కూడ తన వారిలో చేరుదురు. "అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్, ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్" [వీడు నా వాడు, వాడు పరుడు అని అల్పబుద్ధులు తలచెదరు. ఉదారచరితులకు లోకమంతయు తమ కుటుంబమే.] ఈ యవస్థకాలము జీవితములో నాల్గవభాగ మనవచ్చును.

4. తుదకు పురుషుడు తా నీ మానవ జాతిలో నిమిడి యుండక విశ్వాత్మ నని భావించును. "ఏవం యః సర్వభూతేషు పశ్యత్యాత్మాన మాత్మనా స సర్వతా మేత్య నరో బ్రహ్మాభ్యేతి పరం పదమ్"॥ [ఎవడు సకల మును తన యందును, సకలమునందు తనను చూచునో, వాడు సర్వత్వమును పొంది పరమపదమైన బ్రహ్మను పొందును.] (మను 12-125) ఇది జీవితములో నాల్గవ భాగము.

## ఆశ్రమ విభాగము

మనువుచే నియమింపబడిన యీ చతురాశ్రమ విభాగము సర్వత్ర స్వాభావికముగ వర్తించును.

మొదటిది బ్రహ్మచర్యాశ్రమము. ఈ ఆశ్రమమున పురుషుడు తక్కిన ఆశ్రమములకు సంసిద్ధుడు కావలెను. అందుచేత, ఈ ఆశ్రమముతో సంబంధించిన ముఖ్య సమస్య విద్య. ఈ ఆశ్రమము పురుషుడు సకలవిద్యలను నేర్చుకొను కాలము. అనగా విద్యార్థిగా నుండవలసిన కాలము. కనుక ఈ కాలమున పురుషుని జీవితము ఉపాధ్యాయుడుగా నుండతగినవారి (ముఖ్యముగ బ్రాహ్మణుల) చేతులలో నుండవలసినది.

రెండవది గృహస్థాశ్రమము. ఇల్లు, కుటుంబము సంతానము, ఆరోగ్యము, పారిశుధ్యము మొదలైన వీ యాశ్రమసమస్యలు. ఆర్థిక సమస్యలుకూడ వీనిలోనే చేరును. ఈ సమస్యలు వైశ్యుని చేతిలో నుండును.

మూడవది వానప్రస్థాశ్రమము. ఈ యాశ్రమముతో సంబంధించిన సమస్యలు పరిపాలనము, ప్రభుత్వవిధానము అని చెప్పవచ్చును. ఇవి ముఖ్యముగ క్షత్రియుని చేతులలో నుండును.

నాలుగవది సన్న్యాసాశ్రమము. మతము, ధార్మిక చింత, ఆధ్యాత్మిక అభివృద్ధి, పరలోకానుభవములు, తుదకు పరలోకసిద్ధులను గూడ విడిచి కేవల ఆత్మానుసంధానము బడయుట ఇందలి సమస్యలు. మన్వాది మహర్షులు విధించిన సన్న్యాసాశ్రమధర్మములలో ఇప్పటి పీఠాధిపతుల ఆచారములు అంశాంశములు. ఈయాశ్రమ

సమస్యలు యజ్ఞదీక్షనుపొందుట కర్తలైన ద్విజులందరి చేతులలో ఉన్నవి. కాయకష్టము పడు శూద్రుడు తక్కినవారి సమస్యలలో దేహసంబంధమైన సమస్యలతో సంబంధించినవాడు. మనువు ప్రత్యేకముగా బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము,సన్యాసము అనిచెప్పబడిన ఆశ్రమములును, గృహస్థాశ్రమము వల్లనే కలుగుచున్నవి (మను 6–87) అనియును, ద్విజులైన బ్రాహ్మణక్షత్రియ వైశ్యులును, ద్విజులు కాని శూద్రులును తప్ప అయిదవవర్ణము లేదు (మను 10–4) అనియును, చెప్పుటచేత ప్రపంచమునందంతట నున్న మనుష్యులు తమ తమ బాహ్యాభ్యంతర ప్రకృతులను బట్టి ఈ విభాగములో చేరక తప్పదని కనిపించుచున్నది. మనువు ఆశ్రమములు నాలుగు గృహస్థాశ్రమము వల్ల కలుగుచున్నవని చెప్పెనుగాని, వర్ణములుకూడ గృహస్థాశ్రమమునుండి కలుగుచున్నవని చెప్పవచ్చును. శరీరవ్యాపారములకన్నిటికిని హృదయము జనకస్థానమైనట్లు వృత్తులన్నియును గృహస్థాశ్రమమును నిలువబెట్టుట కేర్పడి, గృహస్థులనుండి బయలుదేరవలసినవియై యున్నవి. ఆ వృత్తులనుబట్టి వర్ణవిభాగము చేయబడినది. 'యస్మాత్త్రయో ప్యాశ్రమిణో జ్ఞానే నాన్నేన చాన్వహమ్ । గృహస్థేనైవ ధార్యంతే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ'॥ [గృహస్థు తక్కిన మూడాశ్రమముల వారిని (ఇక్కడ వర్ణభేదము చెప్పలేదు) అన్నము పెట్టి పోషించుటచేతను, కాపాడుటచేతను, జ్ఞానము నిచ్చి బాగుచేయుటచేతను, వాని ఆశ్రమము ఉత్కృష్టము అని చెప్పబడుచున్నది.] (మను 3–78).

ఈ వర్ణకర్మములలోను, ఆశ్రమకర్మములలోను కల భేదములు కఠినమైనవి కావు. ఒక వర్ణమునుంచి యొక వర్ణమునకును, ఒక ఆశ్రమమునుంచి ఒక ఆశ్రమమునకును సులభముగా మారవచ్చును. పూర్వము గృహస్థాశ్రమ మయినపిదప అడవికి నివాసమునకు పోయి వాన ప్రస్థాశ్రమము గడుపుచుండిరి. కాని ఇప్పు డడవికి పోక ఇంటనే యుండి బంధములను విడిచి లోకసేవ చేయుచున్నారు. వారు చేయుపని, వీరు చేయుపని ఒకటి కాకపోయినను, అవలంబించిన ధర్మ మొక్కటే.

## వర్ణతత్త్వము.

ఒక్కొక్క వర్ణములో పుట్టుటవల్ల కలుగు అనుభవములు ఒక్కొక్క ఆశ్రమమున కలుగు అనుభవములను పోలియుండును. జీవుడు ఇదివరకు అన్ని వర్ణములలో పుట్టుటవల్ల సంపాదించిన అనుభవములచేత, ఈ జన్మలోని ఆశ్రమముల అనుభవములను త్వరలో సంపాదించి పురుషార్థసిద్ధిని త్వరలో బడయవచ్చును. మరియును పరిణామములో మనుష్యశరీరమునం దొక్కొక్క అవయవము బయలుదేరినప్పుడు ఒక్కొక్క వర్ణము బయలు దేరినది. మొదట మనుష్యుని శరీరమునం దవయవ భేదము లేనప్పుడు వర్ణవిభేదముకూడ లేదు. శరీరములో అవయవములు మొలిచి భేదము కనిపించి వాని వ్యాపారభేదములతో పాటు మనస్సులో కూడ భేదములు కలిగినప్పుడు మనుష్యసమూహములలో గూడ విభేదము లేర్పడి, వారు వారు చేయు వ్యాపారములు భిన్నము లైనవి, అట్లు పరిణామక్రమమున మనుష్య

దేహములో శిరస్సు పుట్టినప్పుడు బ్రాహ్మణులు జ్ఞాన సంపాదకులు, జ్ఞానదాతలు అయి పుట్టిరి. బాహువులు పుట్టినప్పుడు వానితోపాటు క్షత్రియులు భుజబలముతో పరిపాలన చేయుటకు పుట్టిరి. తుండెము పుట్టినపుడు దానితోబాటు వైశ్యులు సంఘమున కాధారమైన వ్యవసాయము, వర్తకము చేయువారై పుట్టిరి. పాదములు పుట్టినప్పుడు వానితో పాటు శూద్రులు శరీరము నంతను నిలువబెట్టువారై పుట్టిరి. శూద్రులు లేని యెడల తక్కిన వర్ణములకు దినచర్య జరుగదు. సన్యాసి యొక్క (అద్దములో ప్రతిబింబమువంటి) తలకిందు ప్రతిబింబము శూద్రుడు. సన్యాసి ఆత్మజ్ఞానము కలవాడై, విశ్వాత్మతో నేకీభూతుడై, సర్వభూతహితుడై, సర్వభూతములను సర్వావస్థలయందును సేవించు చున్నాడు. శూద్రుడు ఇంకను ఆత్మజ్ఞానము కలుగనివాడగుటచేత, తానెందుకు సేవ చేయుచున్నాడో తెలియకయే బాహ్యసేవ చేయుచున్నాడు.

ఆశ్రమములలో నొక్కొక్కటియు పురుషుని తరువాత ఆశ్రమమునకు సంసిద్ధము చేయును. మొదటి రెండును ధర్మార్థ కామములకును, తక్కిన రెండును మోక్షమునకును సాధనములు. ఒకవిధముగా జూచిన యెడల త్యాగ, దాన, అధ్యయన రూపమున ధర్మము ద్విజులకు, అందులో ముఖ్యముగ బ్రాహ్మణునకును, బ్రహ్మచారికిని చెందినది; అర్థ కామములు, గృహస్థ వానప్రస్థులకును, వైశ్యక్షత్రియులకును చెందినవి; మోక్షము ఆత్మజ్ఞానము గలవాడగుటచే నిజముగా ద్విజుడనదగిన సన్యాసికి చెందినది; అని చెప్పవచ్చును.

ద్విజుడు కాని శూద్రునకు తక్కిన వారందరిని సేవించు ధర్మమును, గృహస్థునియొక్క అర్థకామములను చెందును. ఇంకొకవిధముగ జూచిన బ్రహ్మచర్యమున కామమును, గార్హస్థ్యమున అర్థమును, వానప్రస్థమున కర్మమును, సన్యాసమున మోక్షమును సిద్ధించునని చెప్పవచ్చును.

ఈ విధముగ మనువు వర్ణాశ్రమ ధర్మముల నేర్పరచి తన సంతతివారగు మానవుల నేగాక, సకల ప్రాణు లను ఒక ఆత్మ సోదరత్వమున బంధించి, సమష్టిమానవ కుటుంబమును నిర్మించి, దానిలో కావలసినంతనే పర స్పర సహాయము చేసికొనుటకు సిద్ధముగా నుండుట కును, నిరంతర దానశీలతకును, జిజ్ఞాసకును, మార్గముల నేర్పరచి, క్రౌర్యము, అసత్యము, మమకారము, ఇతర విషములైన ఇంద్రియ లోలత్వము, పాపబుద్ధిపోవుటకు త్రోవల జూపి ఆచరణ యోగ్యమైన (సోషలిజమ్ = Socialism) సర్వసామ్యత్వ సిద్ధాంతమును ప్రతిష్ఠిం చెను.

"అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియ నిగ్రహమ్!
ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యేఽబ్రవీ న్మనుః॥"
(మను 10-63)

[అహింస, అసత్యము, చౌర్యము చేయకుండుట, శౌచము, ఇంద్రియ నిగ్రహము, ఈ యైదును నాలుగు వర్ణములవారికిని ముఖ్యమైన ధర్మము అని సంగ్రహ ముగా మనువు చెప్పుచున్నాడు.]

"ధృతిఃక్షమాదమోఽస్తేయంశౌచమింద్రియనిగ్రహః।
ధీర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్॥
చతుర్భి రపి చై వైతై ర్నిత్య మాశ్రమిభి ర్ద్విజైః।
దశలక్షణకో ధర్మః సేవితవ్యః ప్రయత్నతః॥"
(మను-10-92-91)

[ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము, శాస్త్రజ్ఞానము, ఆత్మజ్ఞానము, సత్యము, కోపములేమి, ఈ పది లక్షణములు గల ధర్మము నాలుగు వర్ణముల వారిచేతను ప్రయత్నపూర్వకముగ ఆచరింపదగినది.]

## ధర్మలక్షణము

ఇక్కడ ధర్మ మనగా నేమో కొంచెము విచారింతము. ప్రవృత్తి మార్గములో సిద్ధి కావలసిన ధర్మార్థ కామములలో నిది యొకటి. అంతేకాక, దేహి తన ఐహిక ఆముష్మిక జీవిత మంతటిలోను నెరవేర్చవలసిన దంతయును ధర్మమనబడును. ధర్మమునకు వేదము ఆధారము; వేదమనగా జ్ఞానము. మనువు,

"వేదోఽఖిలో ధర్మ మూలం స్మృతిశీలేచ తద్విదామ్
ఆచార శ్చైవ సాధూనా మాత్మన స్తుష్టి రేవ చ॥
వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః
ఏత చ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్యలక్షణమ్"
(మను-2-6-12)

[అఖిలవేదమును, ఆ వేదము నెఱింగిన ఋషుల స్మృతియును ,అనుష్ఠానమును, సాధుపురుషుల ఆచార

మును, ఆత్మసంతుష్టియును ధర్మమునకు ఆధారములు. వేదము, స్మృతి, సదాచారము, మనస్సంతుష్టి ఈ నాలుగును ధర్మమునకు ప్రమాణము లని చెప్పబడు చున్నవి] అని చెప్పెను.

బ్రహ్మ వేదకర్త యని చెప్పుటకు కారణము ఏమన, బ్రహ్మ సృష్టిచేయుటకు ముందు బ్రహ్మాండము నంతను మనస్సులో సంకల్పించుకొనెను. ఆ సంకల్పమే యీ సృష్టి: కనుక బ్రహ్మ మనస్సులో ఈ సృష్టియొక్క భూతభవిష్యద్వర్తమానములు అన్నియును ఎల్లప్పుడును ఉండును. ఈ త్రికాలవేదిత్వము, లేక సర్వజ్ఞత్వము వేదమునం దుండుటచేత వేదము బ్రహ్మమునుండి పుట్టినదని చెప్పుదురు. ఈ సర్వజ్ఞత్వము ఈ బ్రహ్మాండములోని దేహములయందు ఖండఖండములుగ క్రమవికాసము నొందును. మొదట ఇంద్రియానుభవముగను, తరువాత స్మృతి, దానివల్ల కలుగు అపేక్ష, ఊహ గాను, పిదప ఈ స్మృతినిబట్టి ప్రవర్తనము గాను, ఈ విధముగా వికసించును. ఈ వికాస మంతయు అంతరాత్మ పరిశీలనక్రింద జరుగును.

ధర్మమున కాధారము లని మనువుచెప్పిన (1) వేదము (2) స్మృతి (3) సదాచారము (4) మనస్సంతుష్టి అను నాలుగింటికి సమానముగ ఇప్పటి న్యాయ శాస్త్రమునకు కూడ నాలుగు ఆధారములు చెప్పబడినవి. అవి వరుసగా (1) చట్టములోని విధివాక్యము (2) ప్రాచీనాచారము (3) ఉన్నత న్యాయ స్థానముల తీర్పులు (4) న్యాయబుద్ధి (Equity) శుద్ధాంతఃకరణము (Good Conscience.)

# శ్రుతి స్మృతులు

వేదము శ్రుతియనియు, ఆ వేదమునుంచి యెత్తి వ్రాసిన ధర్మశాస్త్రము స్మృతి యనియు చెప్పుదురు. 'శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రంతు వై స్మృతిః' (మను 2-10) మానవజాతి చరిత్రమున మొదటబుట్టినది ఆకాశ తత్త్వమును, దానితో సంబంధించిన శబ్దమును. ఈశబ్దము ద్వారా ప్రప్రథమమున జ్ఞానము, సంకల్పము. రూపము నొందెను. కనుక జ్ఞానము శ్రుతి (వినబడినది) అనబడును. శబ్దబ్రహ్మము అనియు ననబడును. 'శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్హి మానవః। ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్॥' (మను 2-10) శ్రుతిస్మృతులలో చెప్పిన ధర్మము ననుష్ఠించిన మానవుడు ఈ లోకమున కీర్తియును, పరలోకమున పరమ సుఖమును బడయును అనియును, "యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః, ససాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిన్దకః॥" (మను 2-11) ఎవ్వడు ధర్మశాస్త్రమునకు కారణమైన ఈ రెండిటిని అవమానించుచున్నాడో, వాడు సాధు సంఘములనుంచి బహిష్కరింపబడును. వేదమును నిందించువాడు గనుక నాస్తికు డనబడుచున్నాడు, అనియును చెప్పుచున్నారు. శ్రుతి స్మృతులను అవమానించుట అనగా తర్కశాస్త్రముచే ఆక్షేపించుట. (మను 2-10) శ్రుతి సర్వజ్ఞత్వమును, స్మృతి సర్వజ్ఞుల జ్ఞాపకమును అయి యున్నందున అవి తర్కమునకు అతీతములు. కనుక, వానిని తర్కముచే పడిగట్ట తలచినవాడు, మతిలేనివాడు. వేదబాహ్యుడు అనుటలో విశేషము ఏమియు లేదు, వాడు

సంఘక్షేమమును కాపాడుటకు పనికిరాదు గనుక వానిని సాధుసంఘములు బహిష్కరించును. అయితే మనువు వేదశాస్త్రములను గుడ్డిగా నమ్మమని చెప్ప లేదు. తర్కముచేత ఆక్షేపించకూడదు అని చెప్పెను గాని వానియందలి ధర్మవిధులను తెలిసికొనుటకు సహేతుకముగ విమర్శింపరాదని చెప్ప లేదు. ఏలయన "ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా, యస్తర్కేణానుసంధత్తే సధర్మం వేద నేతరః." (మను 12-106) [ఋషులచేత నెఱుంగబడిన వేదశాస్త్రములను వేద శాస్త్రములకు విరోధములేని మీమాంసా శాస్త్రముచేత విచారించి తెలిసికొనినవాడు ధర్మము నెఱుంగునుగాని ఇతరు డెఱుగజాలడు,] అని మనువే చెప్పుచున్నాడు. ఈ విధముగా విచారించిచూచినచో వర్ణాశ్రమ ధర్మమూలముల నెవ్వరును ఆక్షేపించజాలరు.

## వైదిక, లౌకిక ధర్మములు

పూర్వకాలమున ఇప్పటివలె వైదికము లౌకికము అని ధర్మములలో భేదములు లేవు. విద్యఅంతయునొకటియే. అదియేవిద్య. అదియే శాస్త్రము. అదియే ధర్మము. అదియే, మనుష్యునకు ఆచరణీయము. మన దేశములో పూర్వము సనాతన ధర్మము, వైదికధర్మము, మానవధర్మము అనే గాని మతము అని నేడు పిలువబడున దేదియు లేదు. ఆ ధర్మము నవలంబించుట కందరును అర్హులే. ఏ పురుషుడు స్వాభావికముగ ధర్మమునందే భాగము నవలంబించుటకు అర్హుడో ఆభాగము నవలంబించుచు క్రమముగ నుత్తరోత్తరముగ అభివృద్ధి నొందుచుండెను. ఈ స్వాభావిక వృత్తిభేదముచే నేర్పడిన వర్ణభేదములు

అన్ని దేశములలోను నున్నవి. ఈ ధర్మవిషయమును విశాల దృష్టితో చూచినయెడల అన్ని దేశముల ప్రజలును దానిలో చేరుదురు; పాశ్చాత్య దేశములలో నున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, హిందూదేశములో నున్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులతో సమానముగ గణింపబడుదురు. క్రమముగ మానవ పరిణామములో స్థూలదేహము గట్టిపడినకొలదియు, స్థూలప్రపంచ సంబంధములైన వ్యాపారముల కెక్కువ ప్రాముఖ్యముగలిగి పరమార్థవిషయములు వెనుకబడినవి. దానితో పాటు అహంకారముతోగూడిన పోటీ, దాని వల్ల జీవిత వ్యాపారము లన్నిటిలోను కలిగిన భేదములు పాశ్చాత్యదేశములలో బయలుదేరి తక్కిన దేశముల లోనికి ప్రాకినవి. అందుచేత ఇప్పుడు వైదికధర్మము నుంచి లౌకిక ధర్మము వేరైనది.

వేదమునకు, హృదయము అంగములవలె, ముఖ్యములును రహస్యములునైన భాగములును, రహస్యములు కాని భాగములును కలవు. పూర్వకాలమున ఈరహస్యములు జాగ్రత్తగా కాపాడుబడుచుండెను.

"ఉపనీయ గురుః శిష్యం వేద మధ్యాపయేద్ ద్విజః।
సకల్పం సరహస్యంచ త మాచార్యం ప్రచక్షతే॥
తపోవిశేషై ర్వివిధై ర్వ్రతైశ్చ విధిచోదితైః।
వేదః కృత్స్నోఽధిగన్తవ్యః సరహస్యో ద్విజన్మనా॥"
(మను 2-140-165)

[ఎవ్వడు ఉపనయనముచేసి రహస్యార్థముతోను, ఆచరణ విధానములతోను గూడ వేదమును బోధించు

చున్నాడో వానిని ఆచార్యు డని చెప్పుచున్నారు. విధి చోదితములైన అనేక నియమముల చేతను వ్రతముల చేతను పరిశుద్ధుడైన ద్విజుని చేత వేదమంతయు రహస్యార్థముతో చదువఁబడదగినది.] అని చెప్పుటచేత వేదమునందలి రహస్యార్థమును నేర్చుకొనుటకు అధికారము బడయవలెను. అధికారము బడయనివారి కది తెలిసినయెడల ప్రమాదము కలుగును గనుక, ఆ నియమ మేర్పడినది గాని, ఆ యధికారమును బడయుట కెవ్వరును అర్హులుకారు, అని శాసించలేదు.

## గుప్తవిద్య.

ద్వాపరయుగాంతమున శ్రీకృష్ణ నిర్యాణానంతరమున గుప్తవిద్య దుర్వినియోగము చేయబడుట ప్రారంభమై, తదుపదేశకులు స్వార్థపరులై క్రమముగ ఆ విద్య జనులలో నశించి వామాచారము ప్రబలజొచ్చెను. ఆ సమయమున బుద్ధభగవాను డవతరించి, తిరిగి గుప్త విద్యను కొంతవరకు ప్రతిష్ఠించి, వామాచారమునకు కొంత ఆటంకము గలిగించి జనులలో ఆత్మత్యాగము పరమార్థచింత గలుగజేసెను. ఇట్లు ధర్మగ్లానియు పునః ప్రతిష్ఠయు అప్పుటప్పుట జరుగుచుండును. మన కాలములో గతశతాబ్ద మధ్యమున హిందూదేశము లోని జనులు గుప్తవిద్యను మరచిపోయిరి. పాశ్చాత్య దేశములలో ప్రకృతిపరిశోధనల రూపముననుు, మృతుల నావాహనించి సంభాషించుట రూపమునను అవిద్య తలయెత్త నారంభించెను గాని, సరియైన తత్త్వ సిద్ధాంతముల ఆధారము లేకపోవుటచేత, విస్తరించక పోవుటయేగాక, స్వార్థము, ఇంద్రియలోలత్వము ఎక్కు

వగా నుండుటచేత, ప్రమాదింప జొచ్చెను. ఆ సమయమున దివ్యజ్ఞాన సమాజము మొదలైన ఆధ్యాత్మిక సంస్థలు కొన్ని బయలుదేరి ఆ గుప్తవిద్యను తిరిగి కొంత వరకు ప్రతిష్ఠించు చున్నవి.

పూర్వము నగరములలోను, పల్లెలలోను జనులకు సుఖమొనగూర్చుచుండిన గుప్తవిద్య దైవయత్నముచే అడవులు, గుహాలు పట్టి పోయినది. నేడు భౌతిక శాస్త్రములును, వాని మీద ఆధారపడి యున్న నాగరికత యును ఆ యడవులలోనికి గుహాలలోనికి ఎగబ్రాకినవి. అందుచేత అక్కడి ధర్మచింతయు, సనాతన విద్యయు నశించి, తిరిగి ఐహిక వాంఛలు, భౌతిక శాస్త్రములు విచ్చలవిడిగ చెలరేగి, జనుల మనస్సులకు విశ్రాంతియు, కామములకు అంతమును లేకుండ చేయు జనావాసములలో ప్రవేశించుచున్నవి. ఇట్టి సురాసుర విజయము లొకదాని వెనుక నొకటి సంభవించుట ఈశ్వరుని లీల.

ఇన్ని సంగతులు తెలిసిన తరువాత వర్ణాశ్రమ ధర్మములలో ప్రతి స్వల్ప విషయమును గురించియు విపులముగ నియమము లేర్పడుటకు కారణము నెరుంగవచ్చును. ఇప్పటి విద్యార్థులు మతము అనగా ఆముష్మిక విషయములను గురించిన కొన్ని నమ్మకములు ఆచారములు అనియును, మతమునకు ఐహిక విషయములకు స్వభావతః సంబంధమే లేదనియును భావించి, ధర్మము అనగా మతము అని అర్థము చేసికొని, హిందువులు తినుట, త్రాగుట, నిద్రించుట, స్నానము చేయుట, చదువుకొనుట, ప్రయాణము చేయుట, అమ్మకొనుట, ఏ పనిచేసినను, మతానుసారముగ చేయుదురని ఆశ్చర్యపడుదురు. కాని ఆ పను

లనే తాము ను ఒక మతమును అనుసరించి చేయుచున్నామని గాని చేయుటకు ప్రయత్నించు చున్నామని గాని చెప్పిన నొప్పుకొనరు. హిందువునకు 'మతము' ఎట్టిదో వారికి 'భౌతిక శాస్త్రము' అటువంటిది. కనుక భౌతిక శాస్త్రము ననుసరించువారు కూడ ఒక మతము ననుసరించు వారే. అయితే ఈ మతము అనబడు ధర్మము కేవలము ఆముష్మికముతో సంబంధించినది మాత్రము గాక, అన్ని లోకములలోని అన్ని విషయములతోను సంబంధించినది. వేదము ఇహ పరము లన్నిటిని తెలియ చేయునది. సకలమును బోధించు శాస్త్రము కనుక మను ధర్మశాస్త్రము జీవితమును గురించిన సంపూర్ణమైన శాస్త్రము. ఇహపరజీవితమున పరిపూర్ణమైన సుఖమును, అత్యంతమైన దుఃఖనివృత్తియు కలుగుటకు చేసిన యేర్పాటు. మనుష్యజీవితమున కుపయోగించు సకల శాస్త్రములలోని ముఖ్యాంశములును మనుస్మృతికి ఆధారములు.

## ధర్మానుష్ఠానము

ఈ ధర్మశాస్త్రానుష్ఠానమున హిందూదేశములో నిప్పుడు నమ్మకములు, ఆచారములు మాత్రము నిర్జీవ రూపములుగ మిగిలియున్నవి. ఆనమ్మకములకు ఆచారములకు కారణము నెవ్వరు నెరుంగరుగనుక అవిమూఢనమ్మకములు మూఢాచారములు అయినవి. పాశ్చాత్యదేశములలో ప్రకృతిశాస్త్రము హేతువాదములమీద నిర్మింపబడుచున్నందున ఆ సంబంధమైన నమ్మకములు, ఆచారములు, మూఢములు కావు. కాని ఆ నమ్మకములు, ఆచారములు ఎంత పట్టుదలతో అవలంబించబడుచున్న వో

ఇవియు అంత పట్టుపలతో అవలంబించ బడుచున్నవి. క్రమముగ ఇవన్నియుచేరి శ్రోత్రరూపమున సకలశాస్త్ర సమ్మిళితమైన యొక ధర్మశాస్త్రమగును. అందుకు ప్రాచ్యదేశపు బ్రాహ్మణులు (ప్రాచీనవిద్యల నెరిం గినవారు)ను పాశ్చాత్యదేశపు బ్రాహ్మణులు (ఆధునిక విద్యల నెరింగినవారు)ను సహకారముతో పనిచేయువలసి యున్నది. విద్య బ్రాహ్మణునిచెంతకు వచ్చి 'నేను నీ నిక్షేపమునై యున్నాను, నన్ను కాపాడుము, అసూయ గలవానికి నన్నీయకుము, అట్లుండిన నీకుమిక్కిలిఫలము నిచ్చెదను' అని చెప్పినట్లు మనుస్మృతి చెప్పుచున్నది. (మను 2-114) బ్రాహ్మణుడు విద్యను జాగ్రతగా కాపాడెను గాని తుదకు దాని నెక్కడ దాచెనో తానే మరచిపోయెను. విద్యయొక్క దుస్తులు శుష్క పాండిత్యము మాత్రము వానియొద్ద నున్నవి. ఆ దుస్తు లను ధరించుటకు తినవద్దకు వచ్చు విద్యను ఆనవాలు పట్టలేక, ఆ దుస్తులనే అందరకు సనాతనవిద్య యని చూపించుచున్నారు.

ఒక దేశపురాజు సింహాసనభ్రష్టుడై, పరదేశములో తల దాచుకొనుటకు పోయి, అక్కడ తన కిరీటము మొదలైన రాజలాంఛనములతో వీధులవెంట తిరుగు చుండుగా చూచి పిచ్చివాడో, హాస్యగాడో అనుకొని, పిల్లలు రాళ్ళు రువ్వసాగి రట. ఈ నూతన ప్రపంచ మునం దీ శుష్కపాండిత్యము అను దుస్తులను ప్రద ర్శించుచు పోయెడు బ్రాహ్మణుని గతియు నదియే.

పాండిత్యమునకు తపస్సు తోడైనప్పుడే సనాతన విద్యకు జను లందరిలోను తిరిగి గౌరవము కలుగును.

# విద్యావిధానము

## మూడవ అధ్యాయము

" చాతుర్వర్ణ్యం త్రయో లోకా
శ్చత్వార శ్చాశ్రమాః పృథక్ ।
భూతం భవ ద్భవిష్యంచ
సర్వం వేదా త్ప్రసిధ్యతి॥
బిభర్తి సర్వభూతాని
వేదశాస్త్రం సనాతనం
తస్మా దేతత్పరం మన్యే
యజ్జంతో రస్య సాధనమ్॥ "

(మను 12-97, 99)

[ నాలుగు వర్ణములును, మూడులోకములును, నాలుగు ఆశ్రమములును, భూతభవిష్య ద్వర్తమానములును (అనగా సర్వకాలములయందు సంభవించు సకలసంగతులును) వేదమువలనే దున్నవి. సనాతనమైన వేదము సకలభూతములను భరించుచున్నది. వేదము జీవునకు (సుఖమును పొందుటకు) ఒక్కటే యుత్తమసాధనము. (వేదము అనగా సర్వజ్ఞత్వము అని ఇదివరకు చెప్పబడి యున్నది)]

మనుష్యజాతిపరిణామము సంగ్రహముగా చెప్పబడినది. ఈ యుగములో మనుస్మృతిప్రకారము వర్ణాశ్రమ ధర్మములు పురుషార్థసాధనము లని తెలిసికొంటిమి. వర్ణాశ్రమధర్మములను బట్టి ప్రపంచ సమస్యలు నాలుగు విధములుగా విభజించితిమి. ఆ సమస్యలలో

కొన్నిటిని గురించి మనువు చెప్పినదేమో కొంచెము విచారించెదము.

ఆధునికుల దృష్టి ఐహిక భోగములయం దెక్కువగా నుండుటచేత వారి దృష్టికి ముందు శరీరసుఖము తరువాత విద్యవచ్చును. కనుక, ఇప్పటి ప్రభుత్వములు ఆయుధములను సిద్ధముచేయుటకు, రాజ్యములను విస్తరింపచేయుటకు, పరిశ్రమలు, వర్తకము వృద్ధిచేయుటకును, జనసంఖ్య వృద్ధిచేయుటకు, రాబడిలో విశేష భాగము వ్యయముచేసి విద్యకు తక్కువ భాగము వ్యయముచేయుదురు. ఇప్పుడిప్పుడు విద్య సర్వసంపదలకు మూల మని తెలిసికొనుచున్నారు.

## విద్యయొక్క ప్రాధాన్యము

కాని పూర్వుల అధ్యాత్మదృష్టికి విద్య ప్రథమ గణ్యము. మనుష్యునకు జన్మమున మొదటిభాగము విద్యకొరకు వినియోగించవలసినది యని,అన్ని సంపదలకంటె విద్య ఎక్కువ గొప్ప సంపదయని వారి యేర్పాటు. ఒక దేశమున ఆర్థికసంపద యెక్కువగా నున్నప్పుడే ఆదేశమునందు ప్రభుత్వము సుకరముగనుండి ఇతరదేశములలో పలుకుబడియుండును. సంఘనిర్మాణము చక్కగానున్నప్పుడు ఆర్థికసంపదలు చక్కగా నుండును. అనగా, సంఘనిర్మాణము బలముగాను, ఎంత చిన్నగాలి వీచినను పడిపోకుండ స్థిరముగాను ఉండి, దేశకాలానుకూలముగ మారుటకవకాశములు గలిగి, శరీరమును ఆత్మ ఏప్రకారముగా నడిపించుచున్నదో ఆ ప్రకారముగా సంఘమును నడిపించుట కొక ఉత్తమాశయ ముండిన యెడల, ఆసంఘము సకల సంపదలతో తులతూగు

చుండును. సంఘనిర్మాణమునకు జనులు, కుటుంబము, గృహజీవనము, ఆధారములు. ఇవన్నియు మనుష్యుని శారీరక, మానసిక ప్రవృత్తులను బట్టి యుండును. ఇది సంఘమునకంతకును ఆధారమగుటచేత మనువు శరీర మును మనస్సును సంస్కరించి వికసింపజేసి, పరిపూర్ణము చేయుట మొదటిధర్మముగా చెప్పెను. పురుషుడు జన్మము నెత్తి ఆత్మవిషయములను తెలిసికొనక జీవిత మును వ్యర్థముచేసికొనుటకంటె జన్మించక యుండుటే మేలని మనువుయొక్క అభిప్రాయము అయినట్లు కని పించుచున్నది. పాశ్చాత్యులు ప్రాగ్దేశములలోని జీవితా దర్శ ప్రమాణము మిక్కిలి తక్కువ యని యందురు. నిజమే, ఇప్పుడట్లేయున్నది. పూర్వముకూడ ఐహిక జీవితాదర్శముయొక్క ప్రమాణము తక్కువగానే యుండెనేమో, గాని, ఆధ్యాత్మిక జీవితాదర్శము మాత్రము మిక్కిలి యున్నతముగానే యుండెను. ఈ మధ్య అనేక ప్రతికూల పరిస్థితులవల్ల ఐహికాదర్శ ములు గొప్పవి కాకపోయినను, ఆధ్యాత్మికాదర్శములు తగ్గిపోయినవి. నిరాడంబర జీవితము, ఉన్నత మానసిక సంస్కారము, శాశ్వతము, ప్రయోజన కరమును అయి నవో, లేక, ఆడంబర జీవితము, రిక్తమనస్క శాశ్వత మును ప్రయోజనకరమును అయినవో, కాలము తీర్మా నించవలెను. ఆడంబర జీవితము, రిక్తమనస్సు నిరర్థక మని ఇప్పుడు చాలామంది యొప్పుకొనుచున్నారు. కనుక కొద్దికాలములో అది మారి మనుస్మృతి ననుసరించి నిరాడంబర జీవితము, ఉన్నతమానసిక సంస్కారము మీద ఆధారమైన నాగరికత తిరిగి వచ్చి, దాని ననుస రించి విద్యావిధానముకూడ మారవచ్చును.

## వయఃపరిమితి

సత్వరజస్తమో గుణప్రాధాన్యమును బట్టి ఆయావర్ణములలోని బాలుర విద్యాభ్యాస ప్రారంభమునకు వయస్సులో భేదములు చెప్పబడినవి. అంతకుముందు బిడ్డ ఆటపాటలతో గడిపి మునుపటి మనుష్య జాతుల లక్షణములను అన్నిటిని తిరిగి అనుభవమునకు తెచ్చుకోవలెను. "బ్రాహ్మణునకు గర్భస్థుడైనది మొదలు ఎనిమిదవ సంవత్సరమునందును, క్షత్రియునకు గర్భస్థుడైనది మొదలు పదకొండవ యేటను, వైశ్యునకు పండ్రెండవయేటను ఉపనయనము చేయవలెను. బ్రహ్మతేజస్సు నపేక్షించిన బ్రాహ్మణునకైదవయేటను, బలము నపేక్షించిన క్షత్రియునకాఱవయేటను, ద్రవ్యము నపేక్షించిన వైశ్యునకెనిమిదవ యేటను ఉపనయనము చేయవచ్చును. బ్రాహ్మణునకు పదునాఱవ సంవత్సరమువరకును, క్షత్రియునకిరువది రెండవ సంవత్సరమువఱకును, వైశ్యునకిరువదినాల్గవ సంవత్సరమువఱకును ఉపనయనము చేయకుండుట గౌణము. అంతవరకు సావిత్రీదేవి కనిపెట్టియుండును. ఆలోపున ఉపనయనము చేయనియెడల గాయత్రి (సావిత్రీదేవి)చే విడువబడినవారును, వ్రాత్యులు (బ్రహ్మకర్మ కనర్హులు) అయినవారును, ఆర్యులచే వర్జింపబడినవారు అగుదురు."

(మను: 2—36,37,38,39).

అనగా, కొంతవయస్సు వచ్చుసరికి మనస్సును దానికి ఉపాధియైన మెదడులోని నరములును మోటుబారి ఉపయోగము లేకపోవును. ఆ నరములెంతసున్ని

తముతైనవో అంత త్వరగా మాటుపారి పోవును. ఈ యర్థమునే ప్రొ॥ జేమ్సు 'మానసిక శాస్త్రతత్త్వములు' అను తన గ్రంథములో నీవిధముగ వ్రాసెను:—

"మనుష్యులు తమ తమ వ్యాపారములతో సంబంధించని యితరవిషయములను గురించి 25 సంవత్సరముల వయస్సుకు ముందు తెలిసికొన్న సంగతులే వారి కాజన్మాంతము తెలియబడునవి. క్రొత్త సంగతులను తెలియజాలరు క్రొత్తసంగతులను తెలుసుకొనుటకు తగిన సంగరహితమైన ఆకాంక్షపోయి, మనోవృత్తులు ఘనీభవించి, సమీకరణశక్తి నశించును. విద్యాగరపులలో గొప్పసంగతి ఏమనగా, విద్యార్థికి ఒక్కొక్క విషయమును నేర్చుకోవలెనని కుతూహలము కలిగినప్పుడే, ఆ తరుణము మించనీయక ఆ కుతూహలము అణగిపోక ముందే, ఆవిషయమును బోధించవలెను. దానివల్ల ఆ విషయజ్ఞానము చక్కగా కలిగి ప్రావీణ్యము వచ్చును. అట్లు పెంపొందిన కుతూహలములో విద్యార్థి పెద్దవాడైన తరువాత విహరించవచ్చును. చిత్రలేఖనమునందు, జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము మొదలగు ప్రకృతి శాస్త్రములయందు, ఆధ్యాత్మికశాస్త్రమునందు, లేక, ప్రాపంచికవిషయములయందు ప్రావీణ్యము సంపాదించుటకు ప్రతివాని జీవితములోను ఒక సుముహూర్త ముండును. మఱియును, ఈ విషయములను నేర్చుకొనుటకు కొంతవయస్సు మీరినతరువాత నారంభించినయెడల ఆ విషయమెంత ప్రయత్నించినను తలకెక్కదు....ఒక పిల్లవాడు ఆడుకొను ఈడున ఆడుకొననియెడల జన్మమంతయు బద్ధకస్థుడై కూర్చొనిన చోటునుంచి లేచుట కిష్టములేని వాడగును."

ఈ ఆధునిక మానసికశాస్త్రజ్ఞుని యభిప్రాయ మునుబట్టి వయస్సులో నొకభాగమును విద్యయందు, నిగ్రహము నభ్యసించుటయందు వినియోగించవలసిన ఆవశ్యకత స్థిరపడుచున్నది.

## పురుషార్థములు

విద్య ఒక కార్యసిద్ధికి ఉపాయముగాని కార్యము కాదు. అయితే ఈ యుపాయముచే పొందదగిన సిద్ధి యేది? ఇది నవీన బోధకులకు తెలియని విషయము. వారు విద్యావిధానముల నేర్పఱచునపుడు పురుషార్థము లను స్పష్టముగా తెలిసికొనరు. వీరికిని ప్రాచీనులకును గల భేద మిది. కార్యమేదో తెలియకపోవుటచేత వీరికి ఉపాయములుకూడ యుక్తములైనవి దొరకవు. అది యేమి పాపమోగాని ఈ కాలపువారు ప్రపంచమునం దన్నిరకముల జీవుల పరిణామమునకును భిన్నత్వము ఆవ శ్యకమని అంగీకరింతురుగాని, వర్ణభేదము వచ్చినప్పుడు మాత్ర మంగీకరించక అందరు మనుష్యులు సమానులై యుండవలెనందురు. ప్రాచీనమానవుని భ్రష్టసంతతికి చెందిన మనుష్యుడు ఆత్మైకత్వమును నోటితో నొప్పు కొనునుగాని ప్రతిమనుష్యుని ఒక భిన్నవర్ణము వానిగా నెంచును. అనగా, భేదబుద్ధిగల పాశ్చాత్య దేశము లలో బాహ్యమగు ఏకత్వము విశేషముగనున్నది. అభేద బుద్ధిగల ప్రాచ్యదేశములలో విభేదము లెక్కువగా నున్నవి. ఇది నేటిస్థితి.

ఇప్పటి ప్రవీణులు బిడ్డలలో పలురకములవారున్నా రని యొప్పుకొందురుగాని స్వభావమును బట్టి కలిగిన వర్ణభేదములచేతనే బిడ్డలలో ఆ తరగతు లేర్పడియున్నవని

అంగీకరించరు. ఇప్పుడున్న వర్ణసంకరస్థితినిబట్టి వారి కట్లంగీకరించుట సాధ్యముకాదు. ఇక పురుషార్థములను గురించి వారికి స్పష్టమైన అభిప్రాయములు లేవు; భాగ్యవంతులకు విలాసార్థమును ఇతరులకు పొట్టకూటికిని వృత్తులను నేర్పవలెనని యందురు. అనగా కామము, అర్థముమాత్రము అస్పష్టముగ వారి దృష్టిలో నున్నవి. మనుష్యులలో స్వార్థము వృద్ధియైనకొలదియు, పోటీ యెక్కువయై పొట్టకూటి విద్యలు చాలామంది నాక్రమించుచున్నవి. ఇట్లే మరికొంత కాలము గడచిన యెడల, ఆ విద్యల కాధారమును, సంఘప్రతిష్ఠకు పునాదియునైన ధర్మవిద్య, మోక్షవిద్య పూర్తిగనశించిపోవును. సంఘ నిర్మాణమంతయు నేలగూలిపోవును.

పురుషార్థములను బాగుగా తెలిసికొనుట, సంఘజీవితమునకు ధర్మమాధారమని ఒప్పుకొనుట, ధర్మము, అర్థకామములకు మూలమని విద్యార్థులకే గాక, జనులందరకును ఎడతెగకుండ బోధించుట, బిడ్డ పెద్దవాడైన తరువాత ఏ వృత్తి నవలంబించవలెనో పెద్దలు ముందుగా నిర్ణయించుట, ఎప్పుడు సంభవించునో, అప్పుడే విద్యావిధానము సార్థకమగును. అంతవరకు సార్థకము కాదు. అంతవరకు విద్యావిధానము నిశ్చితముకాదు: అంతవరకు పాఠపుస్తకములుగురించి, బోధించవలసిన విషయములను గురించి యే విషయములు ముఖ్యములు, ఏవి ఐచ్ఛికములు అను విభాగమును గురించి ఏవి సమగ్రముగ నేర్చుకొనవలెను, ఏవి అక్కరలేదు అను ఏర్పాట్లనుగురించి వాదములన్నియు ఆత్మవంచకములును కాలహరణములును అయియుండును. అంత-

గాక ఈ వాదములవల్ల ముఖ్య విషయమును గురించి మఱచిపోయి అక్కరలేనిప్రసంగములలో నేర్పరితనము చూపించుట తప్ప యితర ప్రయోజన ముండదు. ఇదం తయు మేడమీది అంతస్థు పడిపోవుచున్నదని దానిని బాగుచేయుటకు పునాదులలోని మన్ను త్రవ్వి ఉప యోగించుట వంటిది.

పూర్వకాలమున, పురుషార్థములు స్పష్టముగా తెలిసి బిడ్డ పెద్దవాడై అవలంబించ వలసిన వృత్తి ముందుగా గోచరించుచుండుటచేత వానికితగిన విద్య యెటువంటిదై యుండవలెనో నిర్ణయించుట సులభముగా నుండెను. బిడ్డయొక్క అంతరంగశక్తులు వికసించినకొలదియు వాని కే విషయములో విశేషప్రజ్ఞ కలుగుట కవకాశ మున్నదో, అది కనిపెట్టబడి, అది చెప్పబడుచుండెను. జీవితనియమములు చక్కగా అనుష్ఠింపబడుటచేత జను లారోగ్యవంతులై దీర్ఘాయుర్దాయము గలిగియుండుట తప్పదుగనుక విద్యాభ్యాసకాలము ఎక్కువగానుండెను. గురుకులమున ప్రవేశించినది మొదలు ముప్పదియారేండ్లు పూర్తియైన విద్యాభ్యాసకాలము. ఈ కాలములో సకలవిద్యలు పూర్తికావలెను. గౌణముగ పదునెనిమి దేండ్లు లేక తొమ్మిదేండ్లు, లేక, కావలసిన జ్ఞానము లభించునంతవరకు అని కాలనిర్ణయము చేయబడినది. (మను-3-1) 'ద్విజాదులు తమ వయస్సులో మొదటి నాల్గవభాగములో బ్రహ్మచారులై గురుకులవాసము చేసి, రెండవభాగమునందు వివాహము చేసికొని గృహ స్థాశ్రమమున వసింపవలెను. (మను-4-1).

# బ్రాహ్మ క్షత్రియులు.

మప్పదియారేండ్లు విద్యాభ్యాసము చేసినవాడు, వాదోపవాదములలో సమయస్ఫూర్తి గలిగి ఎదుటివారి నోడించుట, ఏ విషయమును గురించియైనను తడుము కొనకుండ గంటల కొలది యుపన్యసించుట మొదలగు వానికి తగిన పాండిత్యము మాత్రమేగాక సకలవిషయ ములలోను పూర్వోత్తర సందర్భముల నరయుటకును, ఏమాట నాడిన, ఏపని చేసిన, ఏమి ఫలిత మెట్లుగలుగునో చూచుటకును ఎప్పుడెట్టి విషమస్థితి తటస్థించినను ఎదుర్కొనుటకును సమర్థత గలిగిన సర్వజ్ఞుడగును; శారీరక బ్రహ్మచర్యము నేగాక మానసిక బ్రహ్మచర్యముగూడ నభ్యసించిన వాడగుటను ఇంద్రియ నిగ్రహము మనో నిగ్రహము గలవాడగును. అట్టివారు సత్సంతానము కని, గృహస్థాశ్రమమును సంతోషదాయకముగ చేసి కొని, దేశమునకు సుఖసంపదల గలుగ జేయువారు. తపోవిద్యా సంపన్నులైన అట్టి మహనీయులు నిజమైన బ్రాహ్మణులు, మునులు. వారే భూపాలురకు మంత్రులును, స్మృతికర్తలును, దేశనాయకులును కాదగినవారు.

అంత విపులమైన శాస్త్రజ్ఞానము లేకపోయినను, అంత యెక్కువైన పరలోక సిద్ధులు, నిరంతర బ్రహ్మనిష్ఠయు కలుగ కున్నను, శరీరబలము, అస్త్రశస్త్రాది విద్యలు, శరీర నిగ్రహము, ఐహికత్యాగము గలిగి పరమార్థజ్ఞానము గలిగినవారు క్షత్రియులు. బ్రాహ్మ క్షత్రియులవలె ద్విజత్వ సిద్ధికి తగినంత పరమార్థజ్ఞానము గలిగి, వారికంటె ఐహికత్యాగమున కొంచెము మిన్నయై తక్కిన విషయములలో తక్కువయైనవారు వైశ్యులు.

## ఉచిత విద్య

ఇక నేర్పవలసిన విద్య యేది? దీనినిగురించి ఇప్పుడు విశేషమైన ఆందోళన జరుగుచున్నది. ఈ వేళనున్న పద్ధతి రేపు మారిపోవుచున్నది. ఎవరికిని నిశ్చయమైన అభిప్రాయములు లేవు. పండితుల పోరాటములలో బిడ్డలు నలిగిపోవుచున్నారు. దీనికంతకు సంఘనిర్మాణముయొక్క దుస్థితి, తలిదండ్రులు, ఉపాధ్యాయులు గూడ పిల్లలు పెద్దవారై యేవృత్తి నవలంబించ దగిన వారో తెలిసికొనుటకు అసమర్థులై యుండుట, అనేక విషయములలో నొకొక్క దానిని గురించి బహుతక్కువ తెలిసియుండుట ముఖ్య కారణములు. తక్కువమంది యైన సంపన్నులలో నైహిక భోగములకై పోటీల వల్లను, ఎక్కువమంది యైన పేదవారిలో కూటికిని, గుడ్డకును పాటుబడుటయొక్క ఆవశ్యకతవల్లను, జ్ఞానాభివృద్ధికొరకును, భావసంస్కృతి కొరకును, మానసిక సంస్కృతికొఱకును, శాస్త్రములు, కళలు అభ్యసించుట కెవ్వరికిని తీరుబడియుండుట లేదు. బిడ్డ పెద్దవాడైనప్పుడు వాని జీవితాధారమేమియైయుండవలెనో ముందుగా నిర్ణయము కానియెడల వానికి తగినవిద్యగఱపుట సాధ్యముకాదు.

"ఉత్పాద్య పుత్రాంస్తు పితా తేషాం వృత్తిం ప్రకల్పయేత్॥" అనగా తండ్రి పిల్లలను కని వారికి జీవనాధారమును కల్పించవలెను. వృత్తిని నిర్ణయించుకోజాలనంత వరకు విద్యాపద్ధతులు నిరర్థకములు; బిడ్డలకు, తలిదండ్రులకు, ఉపాధ్యాయులకు గూడ మనస్సు, శరీరము పడుబాధలకు అంతముండదు. ఈ యవస్థలో నుంచి

తిరిగి యెప్పటికైనను పూర్వపు విద్యావిధానమునకు రాక తప్పదు.

## గురుశిష్య సంబంధము

పూర్వపు వర్ణ భేదములవల్ల శరీరము యొక్కయు, మనస్సు యొక్కయు వికాసమును బట్టి మనుష్యులు నాలుగు తరగతులుగా విభజింపబడి యుండుటచేత, వారిలో ఎవరి కే రీతి విద్య గఱపవలెనో నిర్ణయించుటకు కష్టములేదు. మరియును వేదములలోను, శాస్త్రములలోను విషయము లన్నియును త్రికాలజ్ఞుల ప్రత్యక్షానుభవముచే వ్రాయబడిన వగుటను, రోజున కొకవిధముగ మారుచుండుట కగత్యము లేక. బిడ్డలు తమశక్తి ననుసరించి వానిని నేర్చుకొనుటయే మిగిలియుండెను. అట్లని విద్యార్థి యే విషయములోను సంశయపడుట, ప్రశ్నించుట లేకపోలేదు. కాని, ఏ సంశయము కలిగినను, దానికి సమాధానము వెంటనే సిద్ధముగ దొరకుచుండెను. విద్యార్థికి గురువునెడల భక్తి, గౌరవము నమ్మకముఉండెడివి. విద్యార్థియెడల గురువునకు వాత్సల్యముండెడిది. అందుచేత వారు నిర్భయముగ సందేహముల నడుగుటయు, వీరు వాత్సల్యముతో, వారిని జ్ఞానవంతులుగ చేయుటయే యుద్దేశముతో బోధపడునట్లు సమాధానమునిచ్చుటయు కలదు. ఇట్టి పరస్పర సంబంధము లేనియెడల ఉభయుల జీవితములు నిర్జీవ యంత్రములైపోవును. జాతియంతయు మార్దవమును రసజ్ఞతను గోల్పోవును.

'అధ్యేష్యమాణంతు గురు
ర్నిత్యకాల మతంద్రితః।

అధీష్వ భో ఇతి బ్రూయాత్
విరామోఽ స్త్వితి చారమేత్॥'

(మను—2-73)

[ ప్రతిదినము గురువు శిష్యుడు చదువు నారంభించు నపుడు, నాయనా, ఆరంభించు మని చెప్పి, దినమంతయు ఏమరక, నాయనా బోధపడుచున్నదా ? అని అడుగుచు, అంతమున ముగింతమని చెప్పవలెను. ]

'జిజ్ఞాసా నాస్తి నాస్తిక్యమ్' (మత్స్యపు.) అనగా, జిజ్ఞాస, తెలిసికోవలెనను ఆకాంక్ష, నమ్మకము లేక పోవుట కాదు. 'యస్తర్కేణానుసంధత్తే సధర్మం వేద నేతరః' (మను 12-106) అనగా, తర్కముచేసి యెవడు తెలిసికొనునో వాడే ధర్మము నెరుగును గాని యితరు లెరుగరు. కనుక చదువుచున్న కొలదియు కలుగు సంశయములను తీర్చుకొనుచు, విషయము ఎప్పటికప్పుడు బోధపఱచుకొనుచు చదువుట పూర్వము విధింపబడినది, గాని, ఇప్పటి ఉపాధ్యాయులవలె తమకు తెలియక ప్రశ్నలడిగిన విద్యార్థుల నవిధేయతకై దండించుట లేదు.

మరియును విద్యార్థి ప్రశ్న నడుగుటయును ఉపాధ్యాయుడు సమాధానమిచ్చుటయును సద్భావముతో జరుగవలెనని విధించబడినది. 'నాపృష్టః కస్యచిద్బ్రూయాన్నచాన్యాయేన పృచ్ఛతః । జానన్నపిహి మేధావీ జడవల్లోక ఆచరేత్॥' (మను 2-110) [అడుగనివానికి చెప్పకూడదు; భక్తిశ్రద్ధలతో నడుగక అక్రమముగా నడుగువానికి చెప్పనక్కరలేదు. తెలిసినవాడైనను (క్రమముగా అడుగజాలనివారి మధ్య) జడునివలె ప్రవర్తింపవలెను.]

పూర్వము మునులు సకలశాస్త్రములను, వేదములను, వేదాంగములను శుద్ధచైతన్య మొకటి యున్నదన్న నిశ్చయమయిన సంగతిమీద ఆధారముచేసి వ్రాసిరి. ఆ చైతన్యము నుంచి సకల ప్రపంచమును సృష్టియైన విధానమంతయు నిరూపించిరి. దానినిబట్టి ఆ శాస్త్రములు మొదలైనవి చదువుకొను వారికి, వానిని సంశయించుటకు కారణము లేదు. మరియును వానియందలి యభిప్రాయములు మారుట కవకాశము లేదు. నేడు భౌతిక శాస్త్రజ్ఞులు తమ అభిప్రాయములకు అస్థిరములైన ఆధారములను గైకొనుటచేత, ఆ యాధారములు మారుచుండుట చేత, అభిప్రాయములుకూడ మారుచుండును, గనుక విద్యార్థి యీరోజున నేర్చుకొన్న సంగతులు రేపు విడిచిపెట్టవలసి యుండును. అందుచేత ఇప్పుడు నేర్చుకొనువిద్యకు స్థిరత్వము లేదు.

కనుక, నేర్చుకొను విషయము యథార్థమని నిశ్చయము. పిల్లవాడవలంబించవలసిన వృత్తినిర్ణయము, విశ్రాంతి, చిత్తశాంతి, ఇవి యున్నయెడల ఉపాధ్యాయునకు విద్యార్థికికూడ కష్టములేకుండ పురుషార్థసిద్ధి కవసరమైన విద్య నేర్పుటకు, నేర్చుకొనుటకు, కావలసినంత అవకాశముండును.

## శిష్యవిధులు.

అయితే కేవలము శాస్త్రములు మొదలైనవి చదివి జ్ఞానము నభివృద్ధి చేసికొనుట మాత్రమే పూర్వపు విద్యావిధానములో ముఖ్యాంగము కాదు. అంతకంటెను ముఖ్యములైనవి చెప్పబడినవి. 'ఉపనీయ గురుః శిష్యం శిక్షయే చ్ఛౌచ మాదితః । ఆచార మగ్ని కార్యంచ సంధ్యోపాసన మేవచ॥' (మను 2-69)

[శిష్యునకు (పుత్రునకు) ఉపనయనముచేసి గురువు (తండ్రి) తొలుత నాచారమును, శౌచమును, సమిధాధానమును,* సంధ్యావందనమును బోధించవలెను.] అని మనువు శాసించి ఒక్కొక్కదానిని గురించి వివరముగ పద్ధతులనుకూడ ఏర్పరచెను. దీనిని బట్టి మొదట విద్యాభ్యాసము గురువు ఇంటియొద్ద జరుగవలెను అని స్పష్టమగుచున్నది. తలిదండ్రులు శైశవమునం దారంభించిన శిక్షణమునే బాల్యమున గురువు కొనసాగించును. గురువు విద్యార్థికి తల్లియును తండ్రియును, వాత్సల్యముతో సంరక్షించుటకు బుద్ధిపూర్వకముగ నొడంబడిన సేవకుడును, చుట్టమునై యుండెను. విద్యార్థి గురువు కుటుంబములో నొకడై యుండెను. బ్రాహ్మణుడు తనశిష్యుల యెడల చూపు వాత్సల్యముచేత శిష్యుల గౌరవమునకు కృతజ్ఞతకు పాత్రుడగుచుండెను.

గురుకులవాసముచేయు విద్యార్థి ప్రతిదినము భిక్షాటనముచేసి సంపాదించిన అన్నముచేత తనను, ఒక్కొక్కప్పుడు గురువునుకూడ పోషించవలసియుండెను. భిక్షాటనమువల్ల విద్యార్థికి పేదరిక మనుభవించుట అభ్యాస

---

*ఆచార మనగా సత్ప్రవర్తనము, సచ్ఛీలము. శౌచమనగా మనోవాక్కాయ శుద్ధి. సమిధాధానమనగా హోమమునకు అగ్నిహోత్రమును సమిధలతో వేల్చుటయేగాక, వంటచేయుటకు నిప్పుచేయుటయనికూడఅర్థము చెప్పబడినది. వంటచేయుటకూడ విద్యార్థులు నేర్చుకొనవలసినదై యుండెను.

మగును. దానివల్ల జీవితము పరిపూర్ణమగును. జీవితములో రసజ్ఞత పెంపొందు, చిన్నతనము, గౌరవలోపము అను భావముండదు. ఈ భిక్షాటనమునకు అనేక నియమము లేర్పఱచబడినవి. 'మొట్టమొదట పిల్లవాడు ఎవరియొద్ద భిక్షఅడుగుటకు సిగ్గుపడడో అట్టితల్లి, సోదరి, లేక మాతృభగినియొద్ద భిక్ష నెత్తవలెను, తరువాత తన యొక్క-గాని గురువుయొక్క-గాని బంధువుల యింట భిక్ష నెత్తరాదు. పరిక్రియూరిలో వేదము యజ్ఞము కలవారు, తమకర్మలను జాగ్రితగాచేయువారు, అయిన గృహస్థులయిండ్లలో భిక్షనెత్తవలెను. అట్టివారియిండ్లు లేనియెడల బంధువులయిండ్లలోను అవిలేనియెడల గురుకులములోను భిక్ష నెత్తవచ్చును; వేదాద్యనుష్ఠానములు గలవారి యిండ్లు లేనియెడల నూరంతయు మౌనముతో తిరిగి పాపుల గృహములు వదలిపెట్టి బ్రాహ్మణుల యిండ్లలో భిక్ష తీసికొనవచ్చును. మూడుచోట్లకు తగ్గక తనకు కావలసినంత భిక్ష తీసికొని దానిని గురువునకు నివేదించి, తూర్పుముఖముగ నుండి ఆచమనము చేసి భుజింపవలయును. (మను. 2-183-186, 50, 51)

ఈ పద్ధతియంతయు నిప్పుడు ఆచరణీయము కాక పోవచ్చును. కాని, దీనినుండి మనము నేర్చుకొనవలసిన పాఠము మిక్కిలి గొప్పది. మొదట, విద్యార్థులందరు నొక్కచోట చేరుట, అందరును ఒక్క అచ్చులో పోసి తయారు చేసిన యంత్రములు గాకుండుట, దాని వల్ల కలుగు దయారాహిత్యము మొదలగు లక్షణములు బయలు దేరకుండుట, విద్యార్థులను పోషించుభారము, చదువు చెప్పుభారము ప్రజలందరు పంచుకొనుట, ఇవి

స్పష్టముగా ఈ పద్ధతివల్ల కలుగు ఫలితములు. 'భిక్షాం దేహి' అని యడిగిన బాలునిమీద భిక్షపెట్టు తల్లికి పుత్రవాత్సల్య ముద్రేకించును. సంఘములో 'నా' బిడ్డ 'పరుల' బిడ్డ యను భేదముండదు. అందరును సమానులే. గృహస్థునకు కష్టములేకుండ భిక్షకు మితియున్నది. పాపులయిండ్ల భిక్ష నెత్తరాదనుటవల్ల అందరును భిక్ష పెట్టుట కర్హు లగుటకు పాపములను చేయకుండుటకు ప్రయత్నింతురు. ఈ విధముగ మనువు సంఘములోని జనుల హృదయములను బంధించి, శాశ్వతసుఖమునకు, ప్రేమకు నెలవుల నేర్పరచెను. ఇంతకంటె గొప్ప సామ్యవాదతంత్రము (Socialism) ఇంకొకటి కలదా?

## నూతన విద్యాపద్ధతులు

నూతన విద్యాపద్ధతులు ఇంత ప్రశస్తములు కావు. కాని ప్రస్తుత సంఘనిర్మాణమును బట్టి చూడ అంత కంటె బాగుండుట కవకాశములేదు. సంఘనిర్మాణము నంతయును పోరాటమునకు బదులు ప్రేమను ఆధారముగా నుంచి, సంస్కరించవలెను. క్రమక్రమముగ ఇప్పుడు ఉపాధ్యాయులు స్వంతముగ గురుకులవాసములను పెట్టుట, పాఠశాలలోనే బిడ్డల నివాసమునకు వసతు లేర్పరచి ఒక్కొక్క యుపాధ్యాయుని సంరక్షణలో కొందరు కొందరు విద్యార్థుల నుంచుట, మొదలైనవి బయలు దేరుచున్నవి. దీనివల్ల జనుల బుద్ధి ప్రాచీనపద్ధతి వైపు మరలుచున్నట్లు తోచుచున్నది.

నేర్పవలసిన విషయములలో శౌచము, సచ్ఛీలము ముఖ్యముగా చెప్పబడినవని యిదివరకే చెప్పి యున్నాము. శరీరము, బట్టలు, ఇల్లు, వాకిలి పరి

శుభ్రముగా నుంచుకొనుటయును, భోజనముచేయుట, దాహము త్రాగుట, నిద్రించుట, స్నానముచేయుట, మొదలైన నిత్యచర్యలు యుక్తముగా చేయుటయును ఐశ్వర్య కారణము లందురు. వీనిలో నే లోపమున్నను దరిద్రహేతువందురు. ఇప్పుడు పాఠశాలలలో శీలమును గురించి కొంచెమును శ్రద్ధచూపుటలేదు. దానివల్ల సంఘమునకు ఎంత ప్రమాదము కలుగుచున్నదో చూడుడు. ఒకపల్లెనుంచి నాగలి విడిచిపెట్టి వచ్చిన వానికి, నాలుగక్షరములు వ్రాసి చదువగల డని, ఒక చిన్న యుద్యోగము నిచ్చినయెడల, వా డా యుద్యోగము సంఘసేవ చేయుట కొరకయబడిన దని యెరుగక పోవుటచేత, తన తోడి సేద్యగాండ్రకంటె తానధికుడనైతి నని అనుకొని తలదిరిగి గర్వముచే తన యుద్యోగాధికారమును దుర్వినియోగము చేయును. ఇంగ్లండులో రక్షకభటులకు ముందుగా ప్రజాసేవ తమ ధర్మమని బోధపఱచబడి వారి శిక్షణ మంతయు ప్రజాసేవచేయుట కొరకే ఇయ్యబడును. గనుక, వారు ప్రజలను బంధువులవలె కాపాడుదురు. ప్రజలు వారియందు పూర్ణమైన నమ్మక ముంచుదురు. మనదేశములో అట్టి శిక్షణము లేకపోవుటచేత రక్షకభటులు ప్రజలమీద అధికారము చేయుటకు నియమింపబడినా మనుకొని, గర్వముతో బ్రవర్తింతురు. అందుచేత ప్రజలకు వారియందు నమ్మకములేదు. వారికి ప్రజలను కాపాడవలెనను బుద్ధియు నుండదు. దీనినిబట్టి శీలము చిన్నతనముననే బిడ్డలకు అలవాటు చేయుట యెంతముఖ్యమో తెలియును.

‘జ్యేష్ఠుడు యోగ్యుడుగా నుండిన యెడల కులమును ప్రకాశింపజేయును. కాదేని కులమును నశింపజేయును. కావున సదాచారముగల జ్యేష్ఠుడు పూజింపదగినవాడు. వాడు పెద్దలచేత నిందింపబడని వాడుగా నున్నాడు. తమ్ములు తమయందు ప్రీతిగల జ్యేష్ఠసోదరుని తలిదండ్రులవలెను, ప్రీతిలేని జ్యేష్ఠుని మేనమామ మొదలగు బంధువులవలెను చూడవలెను. (మను 9-109-110) జ్యేష్ఠత్వమువల్ల కలిగిన బాధ్యత సోదరులయందేగాక, సంఘములో పెద్దలయందును, ఉద్యోగులలో పెద్ద ఉద్యోగులయందును కూడ కలదు. వారు తమకంటె చిన్నవారిని, తక్కువపదవులలో నున్నవారిని ఆదరించి, సత్ప్రవర్తనము గఱపవలసిన బాధ్యతయున్నది. పెద్దలు చిన్నలు, సమానులు, ఒకరి కొకరు తగినట్లు మర్యాద చేయుట, ఆత్మ నిగ్రహము, తన భావములను ఎదుటి వాని భావములను కనిపెట్టి మసలుకొనుట, ఇవి శీలమునకు ప్రధానములు. ఇవి యున్నయెడల ఒకరియందొకరికి అపోహలు కలిగి వైరములు పుట్టవు. ఒకవేళ కలిగినను త్వరలో పోగొట్టుకొన గలరు. అందుచేత సత్ప్రవర్తనను గురించి మనువు విపులముగా నియమముల నేర్పరచెను. ఆ ప్రకార మందరును ప్రవర్తించినయెడల జీవిత మొక నిత్యపండుగ యగును. అందరును సమానులే యను భావము పెరిగి, దానివల్ల అహంభావము వృద్ధియై, ముసలివారును చిన్నవారును ఒక్కవిధముగ చూడబడవలె నను సిద్ధాంతము బయలుదేరి ఒకరికొకరు గౌరవమర్యాదలు చూపుటకు బదులు నిర్లక్ష్యమును, అగౌరవమును,ఉదాసీనతను చూపుట సంభవించుచున్నది.

దీనివల్ల సంఘమునకు శిరచ్ఛేదన మైనట్లగును. శిరస్సు లేని శరీర మెంత నిరుపయోగమో ఈ మర్యాద ప్రవర్తనము లేని సంఘమంత నిరుపయోగము. కనుక, విద్యావిధాన సంస్కర్తలు జాగ్రతగా అటువంటి మర్యాదలకు కారణములను బోధపరచుకొని, తగిన నియమముల నేర్పరచి, గొప్పవారు, కొద్దివారు, ఉద్యోగులు, నిరుద్యోగులు, పెద్దలు, చిన్నలు అందరు తమతమస్థితికి తగిన ప్రవర్తన నలవరచుకొనుట విద్యాభ్యాసములో నొక నిర్బంధభాగముగ నేర్పరచినయెడల ప్రపంచమునందు శాంతి యేర్పడి, అందరకును సమానముగా పరిశ్రమ, విశ్రాంతి, సుఖము లభించును.

## విద్యార్థి సామాన్యధర్మములు

ఈ విషయమై మనువు శాసించిన విధులను వివరించుట కిచట అవకాశము లేదు. కనుక, కొన్ని సామాన్య ధర్మముల నుదహరింతుము.

సత్యమును గురించి 'సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ నబ్రూయా త్సత్య మప్రియమ్। ప్రియంచ నానృతం బ్రూయా దేషధర్మః సనాతనః॥' (మను 4–138) [సత్యమును చెప్పవలెను, ప్రియమును చెప్పవలెను. సత్యమైనను అప్రియమును చెప్పరాదు. ప్రియమైనను అసత్యమును చెప్పరాదు. ఇది సనాతనధర్మము] అనియును, సాధారణ ప్రవర్తనమును గురించి 'విత్తం బంధు ర్వయః కర్మ విద్యాభవతి పంచమీ। ఏతానిమాన స్థానాని గరీయో యద్య దుత్తరమ్॥' 'విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠం క్షత్రియాణాంతు వీర్యతః । వైశ్యానాం ధాన్యధనతః శూద్రాణామేవజన్మతః॥' (మను 2–155)

[విత్తము, బలము, వయస్సు, (సత్) కర్మ, విద్య, ఈ యైదును గౌరవమునకు స్థానములు. ఇం దొక్కొక్కటియు దాని పూర్వము చెప్పినదాని కంటె శ్రేష్ఠమైనది. బ్రాహ్మణులలో జ్ఞానము ఎక్కువ గలవాడు పెద్దవాడు, క్షత్రియులలో భుజబలము వీర్యము ఎక్కువగల వాడును, వైశ్యులలో ధన ధాన్యము లెక్కువ గల వాడును, శూద్రులలో వయస్సు ఎక్కువగలవాడును పెద్దలు] అనియును చెప్పబడినది. తెలియనివాడు బిడ్డగాను తెలిసిన వాడు తండ్రిగాను చెప్పబడుచున్నారు. తెలివిగల వాడే పెద్దవాడుగాని వయస్సు, నెరసిన వెండ్రుకలు. ద్రవ్యము, బాంధవ్యము, వీనిచేత నొకడును పెద్దవాడు కాడు. (మను, 151-154) అన్నిటికంటెను జ్ఞానమున కాధిక్యము ఈయబడినను, తక్కినవి, అనగా సంపదాదులు తృణీకరించ దగినవి కావు. జ్ఞానమువలెనే అవియును పూర్వజన్మ సుకృతము వల్ల లభించునవే గాని, నిష్కారణముగ లభించవు. కాని, జ్ఞానము లేక, సంపదాదులను దుర్వినియోగము చేయువానికి గౌరవముండదు. కనుక అవిమాత్రమే ఎవనిని పెద్దవానినిగా చేయవు. అవి సద్వినియోగము చేసినవాడు మాననీయుడు.

## బ్రహ్మచర్యము

ఇక శౌచశీలములను గురించి చెప్పినపుడు, దేహ శిక్షణము గూడ నొక అంగముగా చెప్పబడినది. దేహ శిక్షణమునకు బ్రహ్మచర్యము ముఖ్యసాధనము. బ్రహ్మచర్యము ఆయుర్బల వీర్యములకే గాక సకల పురుషార్థ

ములకును మూలముగా చెప్పబడినది. బ్రహ్మచర్యము భంగము కానంతవరకు శరీరమునకు మరణముండదు అని భీష్ముని చరిత్రమువలన తెలియుచున్నది. వేదము చదువ నందునను, తనయాచారమును విడుచుటచేతను, శక్తి యుండియు చేయవలసిన పూజాదికార్యములను (ఆచారములను) విడుచుట వలనను విప్రులను అపమృత్యువు చంపుచున్నది. (మను, 5 3), ప్రపంచ పరిణామమున కంతకును ఆహారమైధునము లాధారములగుట చేత మనువా రెండింటిని గురించియును మిక్కిలి విపులముగా విధించెను. బ్రహ్మచర్యమనగా కేవలము శారీరక వ్యభిచారము లేకుండుట మాత్రమే కాదు. మానసిక వ్యభిచారముకూడ వర్జించవలెను. బలహీనుడు నిర్వీర్యుడు ఐన వానిసంతానము దుర్బలముగా నుండును. దుష్టబుద్ధి, మతి భ్రష్టుడు, అయిన వానిసంతానము దుష్టబుద్ధులు మతిహీనులునై వారివల్ల జాతికంతకును ప్రమాదము కలుగును. భావోద్రేకము కలిగించు పుస్తకములు, పత్రికలు చదువుట, అప్రస్తుత సంభాషణలు, ఖండనములు, విమర్శలు చేయుట, మానసిక బ్రహ్మచర్యమునకు శత్రువులు. పూర్వము బ్రహ్మచారులు గురువు చెప్పినది విని బోధపరుచుకొనుటయే గాని అధికప్రసంగములు ఖండనములు చేయకూడదు అని విధించుట కిదియే కారణము.

అఖండబ్రహ్మచర్యవ్రతము బూనినవారు గృహస్థాశ్రమము ద్వారా ఋణవిముక్తి చేసికొన నక్కర లేదని మనువు విధించెను. వానికి ఈషణత్రయము లేనందున ఉత్తమధర్మమును నెరవేర్చుట కధికారము

కలుగును; ఆ ధర్మముల నాచరించుచు పరమార్థశక్తులను బడసి, సంఘమునకును జాతికిని మూలబలమై, కావలసినపుడు సహాయముచేయ నర్హుడై యుండును. వైద్య శాస్త్రములో కూడ ఆహారము వీర్యముగా మారి, ఆ వీర్యము నిగ్రహించబడిన యెడల, తేజస్సుగను, ఓజస్సుగను, సహస్సు (వెలుగు)గను మారునని వ్రాయబడినది. ఒక్కొక వర్ణమునకును వారి వారి జ్ఞానము గుణము మొదలైన స్వభావ లక్షణములను బట్టి బ్రహ్మచర్యకాలము నిర్ణయింపబడినది

దేహశిక్షణములో ఆహారము, నిద్ర, స్నానము మొదలైన వన్నియు వివరముగా చెప్పబడినవి. విద్యార్థి యొక్క శరీరములో జరుగు అన్నము జీర్ణమగుట, రక్తము ప్రవహించుట, మొదలగు వ్యాపారములకును, శరీరము చుట్టును ఉండి వ్యవహరించు ఆకర్షణాదిశక్తులకును, ఆధారములైన పంచప్రాణములయొక్క వృత్తులను బట్టి ఈనియమము లేర్పరుపబడినవి. మనుస్మృతిలో శరీరవ్యాయామము, ఆటలు ఏవియు చెప్పలేదు. కాని పురాణములలో యజుర్వేదము నందొక భాగమైన ధనుర్వేదమును గురించియును, యోగసంబంధమునైన ఇతర వ్యాయామములు, విద్యలు, కుస్తీలు, గుఱ్ఱపు పందెములు, మొదలైన పందెములు ఆటలు ఆయావర్ణములకు తగినట్లు విధింపబడిన వనియును ఉన్నది. ఈవ్యాయామములలోను ఆటలలోను పురుషార్థములలో నేదో యొకటి యుద్దేశముగా నుండి, అవి విద్యార్థి తన దృష్టిలో నుంచుకోవలసినట్లు ఏర్పరచబడినది. దానివల్ల ఆ యాటలు సంతోషదాయకముగ నుండక పోవచ్చును

గాని, ఆ యాటనే పరమావధియని భావించకుండ, పురుషార్థములను పరమావధిగా నుంచుకొనిన పరమార్థలాభము చేకూరును. నిరర్థకముగ నే అంగమును కదల్పకూడదు అని మనువు (4-177) శాసించెను.

## ప్రాణాయామము

ఈ శరీరవ్యాయామము లన్నిటికంటెను ముఖ్యము ప్రాణాయామము. స్వర్ణము మొదలైన వానియొక్క మలినము నిప్పునందు కొల్చుటచే నెట్లు పోవునో, అట్లే దేహముతో జేరిన యింద్రియదోషము లన్నియు ప్రాణాయామము చేత నశించును. ప్రాణాయామము చేత నింద్రియదోషములను, పరమాత్మయందు ధారణ చేయుట చేత ప్రారబ్ధమును, ఇంద్రియ నిగ్రహము చేత విషయ సంబంధములను, బ్రహ్మధ్యానముచేత కామక్రోధములను పోగొట్టుకొనవలెను, (మను. 6-71, 72). ప్రాణాయామము ఎవరు ఎప్పుడు ఎట్లు చేయవలెనో, ఎట్లుచేసిన ఏఫలము గలుగునో శ్రుతిస్మృతులలో ననేకచోట్ల వివరింపబడి యున్నది. త్రికాలసంధ్యావందనములో ప్రాణాయామమును విధించుటచేత ఆ ప్రాణాయామము శరీరపోషణ కెంత ఆవశ్యకమైన వ్యాయామమో తెలియుచున్నది.

## సంధ్యావందనము

మతసంబంధమైన విద్య: మనుస్మృతికి ఇహపరలోకధర్మము ఆధారమని యిదివరకు చెప్పియున్నాము. కనుక మనుస్మృతి విధించిన విద్యావిధానమునకు అంతకును ధర్మమే ఆధారమని వేరేచెప్పనక్కరలేదు. అయి-

నను ప్రత్యేకముగ మతాచారముల విషయమున గూడ నియమము లేర్పరచబడినవి. అందు ముఖ్యము సంధ్యా వందనము. సంధ్యావందనముచేయని ద్విజుడు ద్విజత్వ మును గోల్పోవును. సంధ్యావందనము దృశ్యాదృశ్యము లను కలుపును. సంధ్యావందనములో ప్రతియొక్క భాగమువలనను విశేషమైన ప్రయోజన మున్నది కాని, వానిలో ముఖ్యమైనది గాయత్రీమంత్రము. ఇది మనకు ప్రత్యక్ష దేవతయును, తనయందు సకల దేవతలను గలవాడు (సర్వదేవమయోహి సః) ను అగు సూర్య నారాయణమూర్తి నుపాసించు మంత్రము. శరీరపోష ణకు అన్నపానములు, గాలి, యెట్లావశ్యకమో అట్లు ప్రాణశక్తికి ఓజస్సుకు సూర్యుని తేజస్సు అవశ్య కము. ఈ తేజస్సు గాయత్రీజపము విధ్యుక్తముగ చేయుటచేత లభించును. ప్రణవమాహాత్మ్యమును గురిం చియును జపవిధానమును గురించియును ఇక్కడ విపు లముగా వ్రాయుటకు అవకాశము లేదు. దీనినిగురించి సంగ్రహముగా మనువు చెప్పిన వాక్యముల నుదహరిం చెదము. 'బ్రహ్మ, ప్రణవముయొక్క అంగములైన అ కార ఉకార మకారములను, భూః, భువః, సువః, అను మూడు వ్యాహృతులను, మంత్రము యొక్క మూడు పాదములను, మూడు వేదములనుండి (సారము తీసి) సృజించెను. వ్యాహృత పూర్వకమైన గాయత్రిని సంధ్యాకాలములయందు జపించెడు విప్రుడు మూడు వేదములను పఠించినవాడు...' (మను. 2-76-79).

త్రికాలములయందు సంధ్యావందనముచేయు విద్యార్థి తన యితర మతాచారములను గుఱించి ప్రత్యేకముగ

నేర్చుకొనినను నేర్చుకొనకున్నను నిర్బంధములేదు. ఏల యన ఏవిద్యయైనను పరమార్థముకొరకే నేర్పబడును గనుక, ఆవిద్య నేర్పుటయందే 'మత' బోధకూడ కలిసి యుండును.

## మానసిక శిక్షణము

తరువాత, మానసిక శిక్షణము: ఇది వృత్తినిర్ణయము వల్లను, సర్వజ్ఞులైన ఋషుల వాక్యములలో విషయము సంగ్రహముగను సమగ్రముగను చెప్పబడుటచేతను మిక్కిలి సులభముగ నుండెను. ఎంత గొప్ప విషయ మయినను సూత్రరూపమున చెప్పబడుచుండెను. ఇప్పుడు కూడ ఫార్ములాలు (formula) లు అని గణితాది శాస్త్రములలో చెప్పుదురు. అవి అట్టి సూత్రములే. వానివల్ల విషయ మంతయు సులభముగ జ్ఞాపక ముంచు కొనుటకు వీలుండును. మనువు 'అక్షరజ్ఞానము లేనివాని కంటె గ్రంథము చూచి చదువగలవాడు మేలు. వాని కంటె చదివినదానిని చూడకుండ తిరిగి చెప్పగలవాడు మేలు. వానికంటె చదివినదాని యర్థము నెరింగిన వాడును, వానికంటె చదివినదాని ననుష్ఠించి ప్రవ ర్తించువాడును శ్రేష్ఠులు' (మను 12-103) అనిచెప్పు టచేత సూత్ర ప్రాయములైన గ్రంథ వాక్యములను విద్యార్థులు కంఠపాఠముచేసి, వానిని మననము చేయు చుండిరి. ఇప్పుడు పాఠపుస్తకములలోని యితర గ్రంథ ములలోనుంచి విచక్షణలేకుండ ఎత్తివ్రాసిన చిన్నచిన్న భాగములు అనేకములు మితిలేకుండ చదువుటయును వార్తాపత్రికలను చదువుటయును, అజీర్ణము కలిగించు

అకాల భోజనము చేయుట, అమితాహారము తినుటా వంటివి.

ఇట్లు కంఠపాఠము చేయు శాస్త్రములలో మొట్ట మొదటివి కోశము (నిఘంటువు), వ్యాకరణము. ఇవి భాషాజ్ఞానమునకు మూలములు. భాషాజ్ఞానము సరిగా లేనియెడల విద్యార్థి భావములు సంకల్పములు కూడ సరిగానుండవు. మాట్లాడుటకు భాష ముఖ్యము. యుక్తమైన సంభాషణ చేయుటకు భాష చక్కగా వచ్చి యుండవలెను. లేనియెడల మనోభావములు యథార్థముగా వ్యక్తముగావు. దానివల్ల వివాదలు పుట్టును. అందుచేత భాషకంఠ పాఠ్ర ముఖ్యము ఈయబడినది. 'సర్వేషామేవ శాస్త్రాణాం న్యాయవ్యాకరణం ముఖం' (సకలశాస్త్రములలో ప్రవేశించుటకు న్యాయ వ్యాకరణ శాస్త్రములు ద్వారము) అని చెప్పబడినది.

బాల్యములో విచక్షణశక్తి తక్కువగా నుండును; అనుకరణశక్తి ఎక్కువగా నుండును. ఆ వయస్సులో కంఠస్థము చేసిన విషయములు ఎప్పటికిని మరుపునకు రావు. వయస్సు ముదిరినతరువాత తర్కశక్తి వృద్ధియై ప్రతివిషయమునకు కార్యకారణ సంబంధములను తెలిసికొనగోరుట, విమర్శించుట, వచ్చును. అందుచేత విద్యార్థులకు మొదట ముఖ్యశాస్త్రములలోని సూత్రములను కంఠపాఠము చేయుట అవశ్యకము.

వేదముతో పాటు వేదాంగములు, శాస్త్రములు కూడ బోధింపబడుచుండెను. ఒక్కొక్క విషయమునకు వారములో కొన్ని ప్రత్యేకదినము లేర్పరచబడుచుండెను. అందుచేత ప్రతిదినము ఏ డెనిమిది విషయ

ములు చదివి, వాని నన్నిటిని జ్ఞాపక ముంచుకొనుటకు శ్రమపడ నక్కరలేకుండ ఒక్కొక్క విషయము తీరు బడిగ చదువుటకును బోధపరచుకొనుటకును జ్ఞాపక ముంచు కొనుటకును అవకాశ ముండెను.

విద్యార్థి పాఠము నేర్చుకొనునపుడు "శరీరము, వాక్కు, బుద్ధి, ఇంద్రియములు, మనస్సు, వీని నణచు కొని, చేతులు మొగిడ్చి, గురున కెదురుగా గురునిముఖము చూచుచు నిలువబడవలెను. గురువు ఆజ్ఞయైనపుడు ఎప్పుడును ఉత్తరీయమునకు వెలుపల దక్షిణహస్తము నుంచుకొని, గురువున కెదురుగా, మూసికొనవలసిన అంగ ములను చక్కగా మూసికొని కూర్చొనవలెను" (మను. 192,193) దీనివల్ల మెలకువ, జాగ్రత, ఊపిరి దీర్ఘముగా తీసికొనుట మొదలగు సుగుణములు కలుగును. ముఖ్య ముగా ప్రథమావస్థలో చదువుటకు పుస్తకములు లేక పోవుటచేతను, ఉపాధ్యాయుడు చెప్పిన వాక్యములను శిష్యుడు వెంటనే చెప్పి వల్లించుటచేతను, కంఠస్థనికి మంచి శిక్షణము కలిగి, కండ్లజబ్బులును, పుస్తకములకు కాగితములకు ఘనవ్రయమును లేకుండెను.

## అనధ్యయన దినములు

ఉదయమున, సాయంత్రము సంధ్యావందనమైన తరువాత, చదువుకొనుకాలము. తక్కినకాలము భిక్షాట నము, విశ్రాంతి, గురువునకు ఇంటిపనలుచేయుట, ఆట పాటలు, మొదలగు పనులతో గడుపుచుండిరి. అనధ్య యనదినములు మిక్కిలి తక్కువ. 'వేదాంగపఠనము, గాయత్రీజపము, బ్రహ్మయజ్ఞము, ఔపాసనము,

వైశ్వదేవము మొదలగు నిత్యకృత్యములకు అనధ్యయన కాలము లేదు' (మను. 2-105) అనధ్యయనకాలములు గాలి, వాన, విద్యుత్తు, మొదలగు ప్రకృతిసంఘటన లను బట్టియును, శరీరశౌచమును బట్టియును, గ్రామ పారిశుద్ధ్యము, గ్రామములోని పండుగలు, పర్వములు, కష్టసుఖములను బట్టియును ఏర్పరచబడినవి. ఒక వేదము నధ్యయనము చేయు శబ్దము వినునపు డింకొక వేద మును పఠింపరాదు. (మను. 4-101-127) యంత్రాది పరికరములు కావలసిన పారిశ్రామిక విద్యలు పట్టణ ప్రాంతములలో చెప్పుచుండిరి. గురుకులమునకు పెద్ద భవనములు లేవు. అందుచేత చదువు చెప్పుటకు వ్యయము లే దనియే చెప్పవచ్చును. దేశసంచారమువల్ల జ్ఞానము సంపాదించుటకూడ కలదు. కాని, సాధారణముగ నిది గృహస్థాశ్రమములోనో వానప్రస్థాశ్రమములోనో జరుగుచుండెను.

మనుష్యుడు అంతర్ముఖు డగుటకు నిష్కళంకమైన బ్రహ్మచర్యము ఆవశ్యకము. ఎంత గొప్ప పండితుడైనను బాల్యమున బ్రహ్మచర్యము నవలంబించని యెడల, ఈ జన్మమున ఆత్మవిద్య యొక్క ఫలము ననుభవించ జాలడు. అథవా, అనుభవించుట బహుకష్టసాధ్యము. మనస్సు బుద్ధితో కలిసిన యెడల ఆత్మానుసంధానము సాధ్యమగును గాని కామముతో గలిసినయెడల మనస్సు బహిర్ముఖమై ఆత్మానుసంధానము సాధ్యము కాదు. గనుక బ్రహ్మచర్యము ఆత్మవిద్యకంత ఆవశ్యకమైనది. ఆత్మానుసంధానమునకు కావలసిన ప్రయత్నభారమును ఐహిక భోగములకై తమశక్తిని తమకామమును వ్యర్థ

ముగ వ్యయముచేయని కుమార జీవ్రులేగాని భరించ జాలరు.

ఇది మహాభారత యుద్ధమునకు పూర్వము, ద్విజాలకు ఏర్పర్చిన విద్యావిధానము. ఇక, శూద్రులకును బాలిక లకును విద్య గఱపుటను గురించి ఎట్టి యేర్పాట్లు చేయబడెనో చూతము.

## శూద్రులకు విద్య

శూద్రుడు తత్త్వతః ఆత్మవిద్యను బోధ పరుచు కొనుటకు సమర్థతలేని అపరిపక్వజీవి. అందుచేత, వాని విద్యను గురించి మనువు ప్రత్యేకముగ నెట్టి నియమము లను ఏర్పర్చలేదు. తక్కిన వర్ణముల వారు ద్విజత్వసిద్ధి కలుగువరకు నుండు స్థితిలోనే శూద్రుడు యావజ్జీవ మును నుంచబడెను. 'జన్మనా జాయతే శూద్రః సం స్కారా ద్ద్విజ ఉచ్యతే' (ప్రతివాడును జన్మముచేత శూద్రుడు. ఉపనయన సంస్కారము పొందినది మొదలు ద్విజు డనబడును.) అనియును 'శూద్రేణ హి సమ స్తావ ద్యావద్వేదే న జాయతే' (వేద సంస్కారము పొంద నంతవరకు శూద్రసముడు) అనియును చెప్పుటచేత, ద్విజత్వమును పొందని వారును, పొందుట కర్హులు కానివారు నొక్క తరగతిలో చేర్చబడినట్లు తెలియు చున్నది.

కనుక, తనకు చెప్పినపని చేయుటయును, గురుకుల మునకు వెళ్ళకముందు, బిడ్డలింటియొద్ద నేర్చుకొనునట్లు, తానే యింటిలో పనిచేయునో ఆ యింటివారి సహవా సమువల్ల నేర్చుకొనుటయును, పురాణములు వినుట వల్ల

నేర్చుకొనుటయును, శూద్రునకు విద్యాభ్యాసముగా నుండెను. ఋషులు వేదములను చదువదగిన మనో బలము లేనివారికొరకు ప్రత్యేకముగ పురాణములను వ్రాసియుంచిరి. ఇప్పుడు Popular scientific books అని శాస్త్రపరిభాషలేకుండ భౌతికశాస్త్రము మొదలైన శాస్త్రవిషయములు జనసామాన్యమునకు సులభముగ బోధపడు మాటలతో వ్రాయుచున్నారుగదా! ఇటు వంటివే పురాణములు. ఈ పురాణములకు సరియైన యర్థము చెప్పగల పండితులు అర్థముచెప్పి బోధించిన యెడల, వినినవారి కెంతయో విపులమైన విషయజ్ఞానము కలుగును. ఆధ్యాత్మిక శక్తులు బడయు సాధనములు తప్ప తక్కిన వేదరహస్యములన్నియును పురాణములలో వ్రాయబడినవి. శూద్రుని నిరాదరణచేసి, అవమానించి, అణగద్రొక్కిరను మాట సత్యదూరము. ప్రాచీనకాలములో శూద్రునకు తదితరులకంటె తక్కువగౌరవము లేదని పురాణములవల్లనే కనిపించుచున్నది. ఆకాలపు శూద్రుడు నేటి శూద్రునికంటె మిక్కిలి యున్నతస్థితిలోనుండెను. సమర్థులైనశూద్రులు కొన్ని నియమములకు లోబడి, ద్విజులవలె విద్యాభ్యాసము చేయుచుండిరి. ఇప్పుడు నాగరికజాతులలో సంఘు దారులయొక్కయు దరిద్రులయొక్కయు అవస్థకంటె నాటి శూద్రుల అవస్థ మిక్కిలి శ్రేష్ఠముగ నుండెను.

'శూద్రుడు పాపముజేయుట అనునది లేదు. (తక్కిన వారు దుష్కర్మచేసిన యెడల పతితు లగుదురు. శూద్రుడు పతితు డగుట కవకాశము లేదు గనుక తక్కినవారుచేసిన పనులు శూద్రుడు చేసినను వారివలె వీనికి పాపమంటదు)

వానికి సంస్కార యోగ్యతయును లేదు. ఒకధర్మ మును పాలింపవలెనను నిర్బంధములేదు. పాలించి నందువల్ల ప్రతిబంధకములేదు. శూద్రుడు ధర్మశాస్త్ర మును తెలిసికొని, దాని ననుష్ఠించి, గుప్తమంత్రములు జపించుట తప్ప తక్కిన పంచయజ్ఞములు మొదలైన సత్కర్మల జేయుచు ద్విజులవలె ప్రవర్తించినయెడల వాడు ప్రశంసాపాత్రుడును గౌరవనీయుడును అగును గాని దోషిగాడు'. మను (10-126, 127) దీనివల్ల రహస్యమంత్రములు తప్ప తక్కిన విద్య లన్నియును శూద్రుడు నేర్చుకొనుట కర్హు డనుట స్పష్టమగుచున్నది.

## స్త్రీ విద్య

స్త్రీవిద్య విషయమై యీ మధ్య మన దేశములో మిక్కిలి ప్రబలమైన ప్రచారము జరిగినది. ఆ ప్రచా రముకొరకు ప్రాచీన గ్రంథములలోని వాక్యములు విపులముగా నుదహరింపబడి అనేక వాదోపవాదములు జరుగుచున్నవి. స్త్రీలకు విద్య అక్కరలేదని యెవ్వరు ననరుగాని యెటువంటి విద్యకావలెను అనునది వివా దాంశమై యున్నది. స్త్రీకిని పురుషునకును శారీరకము గను మానసికముగను భేద మున్నంతకాలము వారిశిక్ష ణములోకూడ భేద ముండక తప్పదు. ఈభేద ముండుట చేత స్త్రీ పురుషులు ఒక పూర్ణమునందు రెండు అంశ లుగా నున్నారు. ప్రపంచమునందున్న సర్వ భూతము లును ఒక్కటి యను తత్త్వముమీద ఆధారపడి యున్న మనుస్మృతి యందు స్త్రీ పురుషులయం దేకత్వభావ ముంచుట ఆశ్చర్యముకాదు. స్త్రీ పురుషుల ఆత్మల

యందు ఏకత్వ మున్నను బాహ్యచిహ్నముల యందు భేద ముండుట చేతనే ఇద్దరును కలిసినగాని పరిపూర్ణత కలుగదు. ఇది గృహస్థాశ్రమమునకు మూలము. సంఘ నిర్మాణమంతయు గృహస్థులమీాద నిలిచియున్నది. మెదడులో రెండు భాగములు నొకదాని కొకటి యెట్లు పరిపూర్ణత గలిగించుచున్నవో, శ్రవణేంద్రియ మొక్కటియైనను రెండు చెవులును, దృగింద్రియ మొక్కటియైనను రెండు కన్నులును ఉండి, యెట్లు ఒకదాని కొకటి పరిపూర్ణత నిచ్చుచున్నవో అట్లే స్త్రీ పురుషులిరువురును కలిసి గార్హస్థ్యమున పరిపూర్ణత నిచ్చుచున్నారు. ఇది మనుష్యులలో స్త్రీ పురుషజాతి భేద మున్నంతకాలము ఇట్లుండును కనుక స్త్రీ పురుషులు తమతమ ధర్మములను యుక్తముగ నెరవేర్చగలుగుటకు వారికి గరపు శిక్షణవిధానమున భేదము లుండకతప్పదు. అందుచేత మనువు,

'స్త్రీలకు జాతకర్మాదులు ఆయాకాలములలో శరీర శుద్ధికొరకు వేదమంత్రములు లేకయే తంత్రపూర్వకముగా చేయవలెను స్త్రీలకు వివాహము ఉపనయనముగాను భర్తృశుశ్రూష గురుకులవాసము గాను, గృహ సంరక్షణము అగ్ని సేవగాను చెప్పబడుచున్నది. (మను 2-66, 67) అనిచెప్పి 'కన్యాప్యేవం పాలనీయా శిక్షణీయా ప్రియత్నతః, కన్యయైనను ప్రియత్నపూర్వకముగ (బాలునివలె) పాలింపబడదగినది. శిక్షణ నీయ దగినదియు నైయున్నది] అని చెప్పెను.

దీనినిబట్టి స్త్రీవిద్య గృహకృత్యములు – అనగా ఇల్లుచూచుట కింపుగా నుండునట్లు చక్కగా సవరించుచు

ఇంటిలోని వారికి దయతోను మార్దవముతోను సకల సదుపాయములను సమకూర్చి సుఖము చేకూర్చుట, అతిథిసత్కారము చేయుట, పోషించుట, పెంచుట మొదలైన మాతృస్వభావమున కనుగుణ్యములైన కార్యములు—నిపుణతతో చేయగలుగుటకు శిక్షణము నిచ్చునదియును, పురుషుల విద్య, ధన, సంపాదనము, యుద్ధము, విద్యాబోధనము మొదలైన లౌకిక వ్యాపారములు నిపుణతతో చేయగలుగుటకు శిక్షణము నిచ్చునదియును, అయి యుండవలెనని విశద మగుచున్నది. స్త్రీవిద్యలో గూడ వర్ణభేదమునుబట్టి కొన్ని భేదము లున్నవి. బ్రాహ్మణ, బాలికకు పుస్తకములద్వారా నేర్చుకొనునది యెక్కువ. క్షత్రియ బాలికకు శరీర వ్యాయామ మెక్కువ. వైశ్య బాలికకు ఆర్థికజ్ఞాన మెక్కువ. ఈ విధమైన భేద ముండెను. దీనివల్ల బాలిక భర్తృగృహమున కేగినపుడు అక్కడి వ్యాపారమునకు తగిన శిక్షణ మీయ బడుచుండెను. చిత్రకళలు బాలురకు గూడ నేర్పబడుచుండెను. గాని బాలికలకు ముఖ్యముగా నేర్పబడు చుండెను. ఇట్టిభేదములు ఏర్పడియున్నను స్త్రీలు ఇష్టమున్న యెడల పురుషులవలె తమవర్ణమున కనుగుణ్యములైన సకలవిద్యలను నేర్చుకొనగూడ దని నిషేధ మెక్కడను లేదు. అటువంటి విద్యావిశారద లగు స్త్రీలు పండితసభలలో విజయములు గాంచి రని పురాణములలోను ఇతిహాసములలోను పెక్కు నిదర్శనము లున్నవి.

భార్యయు భర్తయు విద్యావంతులును, కళాప్రవీణులును అయిన యెడల వారి పరస్పరానురాగమునకు విద్య తోడై వారి గృహస్థ జీవనము లోపరహితమై యుండును. వారు రసానుభవమునకు నిల్లు విడిచి పో

నక్కరలేదు. 'సుఖానుశయీ రాగః' అనగా సుఖము ననుసరించుటయే రాగము (యోగ. 2-7) ఆ సుఖము ఇంటను లభించనపుడు దానికొరకు బైటకు పోవుట చేత రాగము బైటను వృద్ధియై సంఘ దురాచారములకు కారణ మగును. కనుక, స్త్రీలుకూడ మీద చెప్పిన నియమములకు లోబడి విద్యల నేర్చుట ఆవశ్యకము.

స్త్రీపురుష భేదము ఆత్మకు లేదు. ఆత్మ యీ భేద లక్షణములు గల శరీరములలో బుట్టుచు అనుభవములను సంపాదించును. కనుక, ఈ జాతిభేదముచేత విద్యావిధానము నందును, నేర్చుకొను వృత్తులయందును స్వల్ప భేదము లున్నను ఆత్మవికాస హేతు వగు విద్య అందరకును ఒక్కటియే యగును. కనుక, జ్ఞానవికాసము కలిగించు విద్య అందరకును సమానముగా చెప్పవలెను.

# గృహస్థ ధర్మము

## నాల్గవ అధ్యాయము

అధీత్య విధివ ద్వేదాన్ పుత్రాంశ్చోత్పాద్య ధర్మతః
ఇష్ట్వా చ శక్తితో యజ్ఞై ర్మనో మోక్షే నివేశయేత్ ॥
సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
సమం పశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి ॥
ఏవం యః సర్వభూతేషు పశ్యత్యాత్మాన మాత్మనా।
స సర్వసమతా మేత్య బ్రహ్మాభ్యేతి పరంపదమ్॥
(మను-6-36; 12-91,125)

[వేదమును విధ్యుక్తముగ నేర్చుకొని, ధర్మయుక్తముగ సంతానము గని, శక్తికొలదిగ యజ్ఞాదులజేసి,

అటుమీద మోక్షమునందు మనస్సు నుంచవలెను. తన యందు సర్వభూతములును, తాను సర్వభూతములయందును ఉన్నట్లు సమముగా చూచు ఆత్మయాజి (ఆత్మ యందాత్మను యజ్ఞము చేయువాడు) స్వారాజ్యమును (మోక్షమును) పొందును. ఈ ప్రకార మెవ్వడు తన యాత్మచే సర్వభూతాంతర్యామి యైన పరమాత్మను గనుచున్నాడో వాడు సర్వోత్కృష్టమైన బ్రహ్మ పదవిని పొందుచున్నాఁడు.]

బ్రహ్మచర్యాశ్రమమున శారీరక మానసిక శిక్షణమును పొందినవాడు గృహస్థాశ్రమమున కర్హుడగును. సతీపతులును తలిదండ్రులును వారి బిడ్డలును ఒకరి యెడల నొకరు నెరవేర్చవలసిన ధర్మములు మాత్రమే గాక, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, జనసంఖ్య మొదలైన ఆర్థికసమస్యలతో గూడిన విషయములు, ఇవన్నియును గృహస్థాశ్రమముతో సంబంధించినవే.

## కుటుంబ జీవనము

కుటుంబ సౌఖ్యము సమకూడుటకొరకు ఎవరే ప్రకారముగా ప్రవర్తించవలెనో మనువు వివరముగా విధించెను. మొదట, 'భార్యాభర్తలను గురించి భార్యయు భర్తయు అమరణాంతము (మనోవాక్కాయములచే) వ్యభిచరించకుండ ఉండవలెను. ఇదే స్త్రీ పురుషులకు సంగ్రహమైన ధర్మమని యెరుంగవలెను.' (మను.9–101) అనియును, 'ఏ స్త్రీ మనోవాక్కాయముల నణచుకొని వ్యభిచరించకుండునో ఆమె పతిలోకమును చెందును. పెద్దలచే పతివ్రత యని చెప్పబడును' (మను.

5-165) అనియును చెప్పబడినది. ఏకపత్నీత్వము, అవ్యభిచార జీవనము ఆదర్శములుగా విధింపబడినవి. బహుపత్నీత్వము కొన్ని సందర్భములలోను, బహుపతిత్వము మిక్కిలి అరుదైన స్థితిగతులలోను అంగీకరించబడినవి. భార్యపోయిన పురుషుడును, భర్తపోయిన స్త్రీయును దిరిగి వివాహమాడ వచ్చునని యంగీకరించ బడినను, అది గౌణముగా నెంచబడెను.

స్త్రీకి ప్రేమయును ఏకాగ్రతయును స్వభావ సిద్ధములగుట చేత, ఆమెకు పరమార్థసిద్ధి కలుగుట కవకాశము ఎక్కువగ నున్నది. అందుచేతనే వితంతు స్త్రీ భార్యపోయిన పురుషునికంటె ఎక్కువ కఠినములైన బ్రహ్మచర్య నియమము లేర్పర్చబడినవి. ఇంద్రియ నిగ్రహములేని స్త్రీ పురుషులకు – అనగా, శూద్ర స్వభావము గల అపక్వజీవులకు – మాత్రమే పునర్వివాహము అంగీకరించబడినది. మరియును స్త్రీకికూడ పురుషునివలె నైష్ఠికబ్రహ్మచర్యము అంగీకరించ బడినది.

వివాహము స్త్రీ పురుషులకు పరమార్థసాధనముగ విధింపబడినది. వారి కామరణాంతము అవ్యభిచార జీవన మాదర్శమగుటచేత, వారి కా జీవనమువల్ల ప్రేమ, కరుణ, భూతదయ మొదలగు నిష్కలుషము లగు రాగములు వికసించి, అవి ఆత్మవికాసము కలిగించి పరమార్థసాధనము లగును. కాని, తిరిగి తిరిగి వివాహములు చేసికొను ఇంద్రియలోలుర కట్టి రాగ వికాసము కలుగుట కవకాశ ముండదు.

'నదిలోని యుదక మెటువంటిదైనను, సముద్రములో ప్రవేశించి నంతనే సముద్రోదకము యొక్క గుణమును పొందుచున్నది. అది యెట్లనిన, వసిష్ఠునిచే వివాహము చేసికొనబడిన అక్షమాలయును, మందపాలునిచే వివాహము చేసికొనబడిన సారంగియును, అధమ జాతివారైనను, తమ భర్తల గుణమును పొంది పూజింపదగిన వారైరి.' (మను.9,22,23) అనియును, 'పాముల వాడు పామును పుట్టలోనుంచి పైకి తీసినట్లు పతివ్రతయైన స్త్రీ బ్రహ్మహత్య,కృతఘ్నత, మిత్రద్రోహము మొదలైన ఘోరములు చేసినవాడైనను భర్తను ఉద్ధరించును' (యాజ్ఞవల్క్య - మితాక్షర) అనియును చెప్పుటచేత భార్యా భర్తలలో నెవ రుత్తములైనను రెండవ వారిని ఉద్ధరింతురు. అందులో స్వభావముచే పురుషుడు స్త్రీని జ్ఞానముచే నుద్ధరించును. స్త్రీ పురుషుని ప్రేమచే నుద్ధరించును. జ్ఞానముకంటె అవ్యాజమైన ప్రేమ శక్తి గొప్పది. గనుక భార్యను భర్తకంటె పతివ్రతయైన స్త్రీ తనభర్త నుద్ధరించుట కెక్కువసామర్థ్యము కలిగియుండును.

మనువు (2-145) 'ఉపాధ్యాయుని కంటె ఆచార్యుడు పదిరెట్లు ఎక్కువ గౌరవార్హుడు. ఆచార్యునికంటె తండ్రి నూరురెట్లు ఎక్కువ గౌరవార్హుడు. తండ్రికంటె తల్లి వేయిరెట్లు ఎక్కువ గౌరవమున కర్హురాలు.' అని చెప్పుట చేత స్త్రీకి మనువు ఇచ్చిన ఆధిక్యము నేటి నాగరిక సంఘములలో నెక్కడను కానరాదని చెప్పవచ్చును. అయితే, యీ గౌరవము మాతృస్వరూపిణి యైన స్త్రీకి ఇయ్యబడినదిగాని 'స్త్రీలహక్కులకై' పోరాడు స్త్రీ-

కీయబడలేదు. 'తస్మాత్తాఃసదా పూజ్యా స్త్రియః పూజ్యాః సతతం దేవవన్నరైః, సతీనాంతు ప్రసాదేన ధార్యతే వై జగత్త్రయమ్' (మత్స్యపురాణం). [సాధ్వులగు స్త్రీలు ఎల్లప్పుడును దేవతలవలె పూజ్యురాండ్రు. సతుల ప్రసాదము చేతనే మూడులోకములును నిలచియున్నవి.]

భర్తకు భార్య అర్ధదేహము, పుత్రుడు ఆత్మస్వరూపము అగుటను, మనువు 'భార్య, పుత్రుడు పురుషుడు ఈ ముగ్గురును చేరియే పురుషుడగుచున్నాడు, మరియును ప్రాజ్ఞులు భర్తకును భార్యకును భేదములేదని చెప్పుదురు' అని వ్రాసెను. (9-45) పురుష ప్రకృతులొకరినొకరు ఎడబాసి యుండరు. ప్రకృతి స్వరూపమగు స్త్రీ లేని పురుషుడుగాని, పురుషుడులేని స్త్రీగాని అసంపూర్ణముగనుండును. కనుక, వారిద్దరినిచేర్చి సంపూర్ణముచేసి, దంపతులకు ఆధ్యాత్మికసిద్ధి కలుగజేసి, ఈ సంసారయాత్రలో సుఖప్రయాణము చేయుటకై యితర జీవులకు తగు నుపాధులను బుట్టించుటకు వివాహమేర్పడినది. అందుచేతనే, వివాహ సంస్కారమున కంత పవిత్రత చెప్పబడినది.

బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము అని వివాహ మెనిమిది విధములు. (మను. 3-21). వీనిలో మొదటి నాలుగును శ్రేష్ఠములు వానిచే బుట్టిన బిడ్డలు మాత్రము బ్రహ్మతేజస్సుగలవారుగాను, పెద్దలచే పొగడ తగినవారుగాను ఉందురు. అందము, బలము, గుణము, ద్రవ్యము, యశము, చాలినంత యనుభవము, ధర్మముగలవారై నూరేండ్లు జీవింతురు. తక్కిన

నాలుగు వివాహములవలన బుట్టినబిడ్డలును హత్యచేయు వారుగను, అసత్యము బల్కువారుగాను, బ్రహ్మ ధర్మమునకు విరోధులుగను ఉందురు. (మను.3–39,–42) నిందిత వివాహముల వలన కలుగు సంతానమున కౌరసత్వము నిచ్చుటకు వానిని కూడ వివాహములుగా నంగీకరించ వలసివచ్చినది.

ఈ విధముగా మనువు జాత్యభివృద్ధికి పరలోక సౌభాగ్యము నొక సాధనముగ నేర్పర్చెను. జాత్యభివృద్ధి కొరకే దంపతులకు అవ్యభిచార జీవనము ధర్మముగా విధించెను. కాని, ఈ ధర్మములును విధులును ఎట్లున్నను ప్రవృత్తిమార్గమునం దున్న జీవుడు సహజముగ వ్యక్తిత్వమును బలపర్చుకొనుటయును, దానితో పాటు స్త్రీ పురుష విభేదము బలపర్చుకొనుటయును తత్ఫలితముగ వర్ణసంకరమును, ఆశ్రమసంకరమును, సంభవించినవి. ఈ సంకర మింకను వృద్ధియై, తుదకు ప్రతిక్రియ ప్రారంభమై, మనుష్యజాతి ఇంద్రియ లోలత్వముకంటె ఇంద్రియ నిగ్రహము ఎక్కువ సుఖదాయక మని తెలిసి సన్మార్గానువర్తు లగుదురు. ఇది నివృత్తిమార్గము. అప్పుడు తిరిగి మనువు శాసించినట్లు పురుషుడును స్త్రీయును పురుషప్రకృతుల వలె అవినాభావముతో మెలగుదురు.

పురుషునకును స్త్రీకిని శారీరక, మానసిక లక్షణములు వేర్వేరుగా నుండును. ఈ భేదము జీవునియందున్నది కాదు. జీవునియం దన్ని లక్షణములును బీజరూపముగ నుండును. కాని, కొంతకాలము స్త్రీ లక్షణములును కొంతకాలము పురుషలక్షణములును ప్రకో

పించి, అందుకు తగిన యుపాధులు కలుగుచుండును. అట్లు గలిగిన స్త్రీ శరీరముగాని పురుషశరీరముగాని జీవుని సర్వలక్షణములను ప్రకటింప జేయనందున జీవునకు పరిపూర్ణత్వ మనుభవించుటకు రెండవజాతి శరీరముతో సంబంధము కావలసి వచ్చును. ఈ సంబంధముచే స్త్రీ పురుషు లన్యోన్యము సాహాయ్యము చేసికొని, ఒకరియందున్న లోపముల నొకరు పూర్తిచేసికొందురు.

## ప్రజాభివృద్ధి

మనువు తన అపార కరుణచేత ప్రజాభివృద్ధి యావశ్యకమైనను, అతివృద్ధి కాకుండ చేయనెంచి, ఈశ్వర సంకల్పమును బట్టి పూర్తియైన సంతాననిషేధము నిరర్థక మగునని యెరింగినవాడై, జ్యేష్ఠపుత్రుడు పుట్టిన మాత్రముననే మానవుడు తండ్రియై పితృఋణమును తీర్చినవాడగుచున్నాడు, కనుక, జ్యేష్ఠపుత్రుడు పితృధనమున కంతకు అర్హుడగుచున్నాడు, మరియును తండ్రి తన మూడు విధముల ఋణములను జ్యేష్ఠపుత్రుని కొప్పజెప్పును. దానిచేత తండ్రి మోక్షమును బొందును, కనుక, జ్యేష్ఠపుత్రుడే ధర్మముచే బుట్టినవాడనియును, తదితరులు కామసంతాన మనియును చెప్పుదురు. జ్యేష్ఠపుత్రుడు పిత్ర్యమును స్వాధీనముచేసికొని, తన సోదరులను తండ్రివలె కాపాడవలెను. తమ్ము లన్నను దండ్రిని వలె అనుసరించవలెను, మనుః-(9-105, 106, 107) అని సంతాన విషయమున ధర్మమును మాత్రము సూచించి విడచెను.

మనువు, మనుష్యుడు చేయు సకల సంకల్పములకును చర్యలకును కామమే కారణ మగుటను, ఆ కామత యీ లోకమునం దెచ్చటను కానరాదు గాని, జీవుడు కామములకు బద్ధుడగుట ప్రశస్తముకాదు అని చెప్పి, ధర్మము ననుసరించి చరించినవాడు ఈ లోకమున సర్వకామ్య సిద్ధిపొందినవాడై పరమునం దమరలోకమును పొందును. (మను 2-2-5) అని యొకసామాన్య సూత్రమును చెప్పెను. కామము నణచి నాశనము చేయక, ధర్మముచే దానిని సన్మార్గముల యందు దుపయోగించుటకు లోబర్చు కొనవలె నని సర్వత్ర బోధింపబడుచున్నది.

ఆర్థిక శాస్త్రమున కంతకును ఆధారము ఒక్కటే. అది, దేశమునందు ఆహారము, బట్ట ఎంత, ఎటువంటిది దొరకును? వానిని వాడుకొను ప్రజలు దేశము లో నెందరున్నారు? ఆహారము, బట్ట తయారుచేయు పని వారెందరు? పనిచేయకుండ వాని ననుభవించు వారెందరున్నారు? ఈ యాధారమును విడిచి యెన్ని సమాధానములు చెప్పినను ఆర్థిక సమస్యలు విడక పోవుట యేగాక చిక్కు లనేకములు సంభవించును. అందుచేత ఈ ముఖ్య ఉపాయమును గమనించి మనువు జ్యేష్ఠ పుత్రుడు మాత్రమే ధర్మసంతానమని తక్కినవారు కామ సంతాన మని విధించి బ్రహ్మచర్యము యొక్క మాహాత్మ్యమునంత విపులముగా వర్ణించెను.

కాని, ప్రకృతి బద్ధులైన మనుష్యు లీ ధర్మమును యథావిధిగ పాలింపజాలక పోవుటచేత, తరుచు విషమ పరిస్థితులు సంభవించుచుండును. వర్ణసంకరమై, ఆహారము బట్ట మొదలగునవి తయారుచేయక పెత్తనము

చేయు జనులసంఖ్య యెక్కువ యైనపుడు దేశములో జీవనము దుర్భర మగుట తప్పదు. అటువంటిసమయము లలో జనుల మొర విని బ్రహ్మ యుద్ధములను కల్పించి దుష్టులను నశింపచేయును. లేక, మొత్తముమీద జన సంఖ్య యెక్కువయై, ఇంద్రియతృప్తికొరకు పాప కర్మయు, వానితోపాటు దరిద్రము, అపరిశుభ్రత మొదలైన పరిస్థితులు కలిగినపుడు, వ్యాధులు, కాటక ములు వచ్చి అదనపు జనసంఖ్యను తగ్గించివేయును.

పూర్వకాలములో ప్రజాపాలనము చేయుటకు తప శ్శాలులు ఆత్మజ్ఞానసంపన్నులు రాజులుగా పుట్టుచుండిరి. ఆ ప్రకారముగానే,కుటుంబమును పాలించుటకు మహా నీయు డొకడు జ్యేష్ఠపుత్రుడుగా పుట్టి కుటుంబ ద్రవ్య మును స్వలాభముకొరకు గాక, ధర్మకర్తవలె ప్రజా ర్థము వ్యవహరించుచుండెను. రానురాను వ్యక్తిత్వము బలపడి 'అహం'భావము వృద్ధియైనందున స్వార్థపరులు జ్యేష్ఠపుత్రులుగా పుట్ట నారంభించిరి. దానితో కుటుంబ ద్రవ్యము తలిదండ్రుల యనంతరము పుత్రు లందరు పంచుకొనుట వచ్చినది.

ఇప్పుడు ప్రపంచమునం దెక్కడ చూచినను స్త్రీ పురుషులలో నైష్ఠిక బ్రహ్మచర్యము ఎక్కువ యగు చున్నది. దానివల్ల జనసంఖ్య తగ్గి బ్రతుకు దెరువునకై పోరాటములు తగ్గి మనువు ఏర్పర్చిన సుఖజీవనము తిరిగి రావచ్చునను సూచనలు కనిపించుచున్నవి.

## పారిశుద్ధ్యము.

జనసంఖ్యకును ఆర్థిక స్థితికిని సంబంధమున్నట్లే, జన సంఖ్యకును పారిశుద్ధ్యమునకును సంబంధమున్నది.

బాల్యమున బ్రహ్మచర్యాశ్రమమునందుఁ బడయు శిక్ష
ణము వల్లనే ప్రతివానికిని అనారోగ్యకరములైన ఆహార
పానీయములను విసర్జించుట, శరీరశౌచము మొదలగు
ఆరోగ్యవిధులు అభ్యాసములై పోవును. హిందూ
మతాచారములలో సగము ఆచారములీ సంబంధ
మైనవే. కాని క్రమముగా శీలము జ్ఞానము తగ్గి, ఆ
యాచారముల నిజోద్దేశములను మఱచిపోయి, నేటి
హిందువులు వాని కపార్థములుచేసి, నిర్జీవ ప్రతి
మల నారాధించుచున్నారు. స్పృశ్యత, అస్పృశ్యత,
పంక్తిభోజనములు మొదలైన ఆచారములు నేడు
ఆరోగ్యహేతువులుగాక, విరోధహేతువులైనవి. ద్విజు
లందరును విద్యార్థిదశలో, వర్ణవిచక్షత లేకుండ, ఒక్క
గురుని యొద్ద నివసించుచు, ఒక్క వంటలో తినుచు,
అందరు తెచ్చిన భిక్షాన్నమును గురువునకు సమర్పించి,
అందరును కలిసి భుజించుచు ఉండవలె నని విధించిన
మనువు నేటి యీవిభేదముల నంగీకరించె ననుట హాస్యా
స్పదము. ద్విజులు ధర్మవర్తనులైన యెడల వర్ణవిచక్షత
లేకుండ పంక్తి భోజనములు చేయుచుండిరనుటకు పురా
ణముల నిండ నిదర్శనము లున్నవి. ద్విజుడు శూద్రుని
చేతి భోజనమును చేయుట గురించి మనువు 'తనయొక్క
పంటపండించువాడు, తనకులమిత్రుడు, తన గోవులను
పాలించు గొల్లవాడు, పరిచారకుడు, మంగలి, తన్ను
సంరక్షించ వలయు నని ఆశ్రయించినవాడు అయిన
శూద్రులచేతి యన్నము తినవచ్చును' (మను-4-253)
అని చెప్పెను.

ఈ విషయములో వర్ణభేదముకంటె భక్తి ప్రేమ
శరీరపరిశుభ్రత ఎక్కువ ముఖ్యముగా చెప్పబడినవి.

(మను. 4–224, 225). అయితే, ఈ నియమములు సామాన్యగృహస్థుల కొఱకేర్పడినవిగాని యోగాభ్యాసుల కొఱకు కాదు. యోగాభ్యాసికి ఇంతకంటె కఠినములైన నియమము లున్నవి. అవి సామాన్యగృహస్థులకు పనికి రావు.

శరీర పరిశుభ్రితతోపాటు, ఇంటి పరిశుభ్రితకూడ విధింపబడినది. నిత్యాగ్నిహోత్రము చేయుట, ఆజ్యాది ద్రివ్యముల హోమముచేత, దేవతామందిర మొకటి యేర్పాటుగా నుంచి దానిలో నిత్యము సంధ్యావందనము చేయుట, పుష్పములతోను, సుగంధద్రివ్యములతోను పూజాద్యర్చనలు చేయుట, వీని పారలౌకికోపయోగ మెట్లున్నను గృహమును నిర్మలముగ నుంచును. కొన్ని యిండ్లు అరువది సంవత్సరముల తరువాత పడగొట్టవలెనుగాని ఉపయోగించకూడ దని వాస్తుశాస్త్రము చెప్పుచున్నది.

'ఒక గ్రామమునకు నాలుగు ప్రక్కలను నన్నూరు మూరల దూరము బయలు నేర్పర్చవలయును, లేక బలముగలవానిచే విడువబడిన మూడు కోలలు పోవుదూరము వరకైన విడిచి పెట్టవలెను. పట్టణమునకు మూడు పాళ్లధికముగ నేర్పర్చవలెను' (మను 4-237) దీనిని బట్టి గ్రామమునకు గాలి వెల్తురు నిరాటంకముగా వచ్చుటకును, జనుల మలమూత్ర విసర్జనమునకును, పశువులకు గ్రాసము జనులకు కట్టెలు మొదలగునవి సమకూర్చుటకును తగిన యేర్పాట్లుకూడ చేయబడినవని స్పష్టమగుచున్నది. మలమూత్రములు విడుచుట, పాదప్రక్షాళనము, ఉచ్ఛిష్టమును వేయుట, ఇవి గృహమునకు దూ

ముగా చేయవలెను. (2-151) గాలి, ఎండ, కొన్ని రకముల మొక్కలు జంతువులు ప్రకృతి సిద్ధములైన సమ్మార్జకులై, అనారోగ్యము కలుగనీయవు. పెద్ద నగరములలో జనసమ్మర్ద మెక్కువయై, ఇట్టి సౌకర్యములు కొరకపోవుటచేత, అక్కడ కృత్రిమపు యేర్పాట్లు చేయవలసివచ్చుచున్నది. ఈ యేర్పాట్లు ఎన్ని చేసినను సంతుష్టికరముగ నుండుటలేదు.

అంటురోగములు ప్రబలకుండ గూడ కొన్ని యేర్పాట్లు చేయబడినవి. అనారోగ్యము ఒకరినుండి యొకరి కంటును; ఆ విధముగనే, కొంచెము ఎక్కువ తక్కువ భేదముతో అన్నిరోగములును కూడ ఒకరినుండి యొకరికంటును; శరీరరుగ్మతలే గాక, కామములు, ఉత్సాహము, ఉద్వేగము, వ్యాకులత, ఇవన్నియును ఒకరినుండి యొకరి కంటునవే. అందుచేత ఒకయింటనెవరు మరణించినను, వాని బంధువులకు ఆశౌచ మేర్పర్చబడినది. ఈ యాశౌచము సామాన్యముగ రోగముచే మరణించినపుడు విధించబడినది గాని యుద్ధములోవలె శరీర మారోగ్యముగా నున్నప్పుడును, వానప్రస్థసన్యాసులకువలె స్వేచ్ఛికముగ ప్రాణము వదలినప్పుడును విధించబడలేదు.

## సాంఘిక జీవనము

మనుస్మృతిలో సాంఘిక జీవనమునకు వర్ణవిభాగ మాధారమయి యున్నదని యిదివరకు చూచియున్నాము. తక్కిన అన్నివిషయములలో వలె ఈ విషయములో కూడ ఐహికము ఆముష్మికమునకు మార్గముగా నేర్ప

రుప బడినదిగాని అదియే పరమావధిగా నెంచబడలేదు. ఆపద లేని కాలమందు ప్రాణులకు ద్రోహము చేయ నట్టియు అది వీలులేనప్పుడు అత్యల్పద్రోహము చేసిన సరిపోవునట్టియు వృత్తి నవలంబించవలె నని విధించబడి నది. (మను. 4—2) దీనివల్ల ఐహిక భోగములు ఆధ్యాత్మిక సౌఖ్యము కలుగజేయునవియై యుండవలె నను నుద్దేశమే గాని, ఆధ్యాత్మిక శక్తులను గూడ ఐహిక భోగముల కొరకు వినియోగించు నుద్దేశము పూర్వకాలధర్మము కాదని తెలియుచున్నది. కేవలము ఐహిక భోగములకొఱకు జీవించువాని కిహసౌఖ్యము గూడ దొరకదు. కాని, ఆధ్యాత్మిక సంపదకొరకు ఐహిక ప్రవర్తనమును సవరించుకొన్నవాని కైహిక సౌఖ్యము కూడ చేకూరును. కామము భోగమువల్ల వృద్ధియగును గాని శమించదు. 'ఈ ప్రపంచమునందు దొరకు సమస్త సంపదలును, సమస్త భోగములును ఒక్క మనుష్యుని తృప్తిపరచుటకు చాలవు అని తెలిసి శమమును బొందుము' అని యయాతి చెప్పినట్లు మహా భారతములో వ్రాయబడినది. కనుక, ఒక జాతిలో ప్రతి వ్యక్తియును స్వలాభాపేక్షతో పని చేసినయెడల మొత్తముమీద జాతీయ సౌభాగ్యమున కవకాశ ముండదు. వ్యక్తులు స్వలాభమునకు గాక సంఘలాభము నకు పనిచేసినయెడల ఆ జాతి సకల సంపదలతో తులదూగును. జాతీయసంస్థ లన్నియును జను లందరకు సుఖమును సంతోషమును కలుగజేయునవియైయుండును. వ్యక్తులు ఆ సుఖసంతోషములలో బాల్గొనుచు ఏ విధ మైన బెంగగాని, ఆందోళనగాని, లేకుండ హాయిగా బ్రతుక వచ్చును.

పూర్వము ఋషులు విధించినట్లు ఆముష్మికము కొరకు ఐహికకర్మను చక్కగా చేయుట మాని కాల క్రమమున మనదేశస్థు లైహికకర్మమందు పూర్తిగా అశ్రద్ధను జూపనారంభించిరి. పాశ్చాత్యులు ఆముష్మికమును పూర్తిగా మఱచిపోయిరి. ఇకముందు తిరిగి పూర్వమువలె సమత్వము రావలసియున్నది.

## నాలుగు వర్ణములు

ప్రజలు స్వార్థపరులై ఐహిక భోగముల కొర కొకరితో నొకరు పోట్లాడకుండ మనువు శరీరస్వభావ మునుబట్టి నాలుగువర్ణముల నేర్పర్చి, వారివారికి అను కూలములైన ధర్మముల నేర్పర్చి, సంఘములో నొకరి కొకరు సహాయము చేసికొనుటకును, సాంఘిక జీవితము శాంతముగను, సుఖముగను నడుచుటకును అవకాశముల నేర్పరచెను. (మను. 1-31)

ఏదేశమునందుగాని ఏకాలమునందుగాని, మనుష్యుల శరీర నిర్మాణమున భేదములు విశేషముగా నుండునో ఆదేశమున, ఆకాలమున, వర్ణవిభేదముకూడ బలముగా నుండి, సామాన్యముగ నొకవర్ణములోని వారొక వర్ణము లోనికి మారుట సాధ్యము కాదు. కాని, శరీర తత్త్వ మున భేదములు లేక అందరు నొక్క విధమైన స్వభా వముగల శరీరములు గలవారై నపుడు ఒక వర్ణమువారిం కొకవర్ణములోనికి చేరుటయును, ఒకవర్ణము వారింకొక వర్ణధర్మమైన వృత్తి నవలంబించుటయును సాధ్యమగును. ఒక్క చెట్టుయొక్క విత్తులనుండి పుట్టిన మొక్కలను వేరువేరు పరిస్థితులలో పెంచి సంరక్షించి, క్రమముగా

వానినుండి భిన్నలక్షణములుగల చెట్లను తయారుచేయు చున్నారు. ఆ లక్షణ భేదము కనిపించిన తరువాత, ఆ మొక్కలకు ప్రత్యేక సంరక్షణ చేయుట మానివేసిన యెడల, వాని సంతతి తిరిగి మొదటిరకమున చేరును. ఇది వృక్షశాస్త్రజ్ఞు లంగీకరించిన విషయము. అట్లే మనుష్యజాతులయందును జరుగును.

బ్రహ్మ శరీరమునుండియే నాలుగు వర్ణములును పుట్టినవని మనువు వ్రాసెను. వర్ణవిభాగములేని మనుష్య జాతిలో నుంచి వర్ణవిభాగము కలిగెనని మార్కండేయ పురాణము చెప్పుచున్నది. వాయు పురాణములో కృతయుగములో వర్ణాశ్రమ వ్యవస్థగాని సంకరముగాని లేదని చెప్పబడినది. విష్ణు భాగవతములో పూర్వ యుగములలో విశ్వామిత్రునివంటి వా రెవరో యొకరిద్దరు మాత్రమే గాక, అనేక కుటుంబములు, కులములుగూడ పైవర్ణములలో జేర్చుకొనబడినట్లు నిదర్శనములు కనిపించుచున్నవి. భవిష్యత్ప్రశంసలో గూడ కలియుగాంతమున, వర్ణసంకరము పూర్తియైనపుడు—అనగా, అన్ని వర్ణముల జనుల శరీరముల స్వభావము ఒక్కటియైనపుడు భగవంతు డవతరించి, మరియొకరీతిగ వర్ణవిభాగము నేర్పరుచునని పురాణములలో చెప్పబడియున్నది.

మహాభారతము వనపర్వములో యుధిష్ఠిర నహుష సంవాదములో, అప్పటికే వర్ణసంకరము పూర్తియైనట్లును, ఒకడు ద్విజుడగునా కాదా యన్న సంగతి వాని వృత్తము (ప్రవర్తన) వల్లనే చెప్పవలెను గాని, జన్మవల్లగాని, సంస్కారములవల్లగాని, చదువువల్లగాని, కుల సంప్రదాయమును బట్టిగాని చెప్పుటకు వీలు

లేదనియును యుధిష్ఠిరుడు చెప్పిన ట్లున్నది. మనువు తపస్సుయొక్కయు బీజము యొక్కయు ప్రభావము చేత అన్నియుగములయందును తక్కువజాతిలో బుట్టిన వారు ఎక్కువజాతిని పొందుచున్నారు. ఆ ప్రభావము లేనివారు తక్కువజాతిలోనికి పోవుచున్నారు (10–42) అనియును; శుచియైనవాడును, అభివృద్ధి నభిలషించిన వాడును, మృదువైన వాక్కుగలవాడును అహంకారము లేనివాడును, ద్విజులను విడువక ఆశ్రయించి విడువ కుండ వారి శుశ్రూష చేయువాడును, అగు శూద్రుడు ఉత్కృష్టజాతిని పొందును' (మను 9–335) అనియును చెప్పెను. వర్ణములో మార్పు ఎట్లు చేసికొనవలెనో (10–57 మొ॥ 65) మనువు విధించెను. ఈ మార్పు పూర్వకాలములో (శరీరస్వభావములో భేదములు బలపడనప్పుడు) ఒక్క జన్మములోనే సాధ్యమగు చుండెను. కాని, తరువాత తరువాత, కొన్నిజన్మలలో గాని సాధ్యముగాకయుండెను.

ఇప్పుడు ఒక వర్ణములో పుట్టిన బిడ్డయొక్క జాత కమును చూచిన యెడల వాడు మరియొక వర్ణమునకు చెందిన స్వభావముగల వాడుగా కనబడుట సాధారణ ముగా తెలిసిన విషయమే. ఈ జాతక శాస్త్రమును బాగుగా నవలంబించిన యెడల వర్ణవిభాగము సులభ మగును. దానివల్ల వృత్తి విభాగముకూడ సులభమగును.

## బ్రాహ్మణుడు.

వర్ణవిభాగములో బ్రాహ్మణునకు జ్ఞానసాధన ములను కాపాడుట, జ్ఞానబోధచేయుట, స్వయం

కృషిచే క్రొత్తవిషయములను తెలిసికొని జ్ఞానమును విస్తరింపచేయుట, ఆధ్యాత్మిక శక్తులను వికసింపచేయుట, ధర్మములుగా విధింపబడినవి. దానికి కావలసిన విద్య, తపస్సు, యోగము; వీనిని సాత్విక స్వభావముగల శరీరము ధరించవలెనుగాని యితర శరీరములు ధరించజాలవు. గనుక, బ్రాహ్మణున కొసగబడిన ధర్మములు ఇతరుల కొసగబడలేదు. ఇతర వర్ణములవారు తమధర్మములను నెరవేర్చుటకు పడవలసిన శ్రమ బ్రాహ్మణ శరీరము భరించజాలదు గనుక ఆకర్మములను బ్రాహ్మణునకు విధించలేదు. 'బ్రాహ్మణునకు తపస్సు, విద్య, మోక్ష సాధనములు. అందు తపస్సుచే పాపములు పోవును. విద్యచే మోక్షము కలుగును' (మను 12–104) సమస్త సుఖములకును తపస్సే ఆదిమధ్యాంతములైయున్నది. అందు బ్రాహ్మణునకు జ్ఞానమును, క్షత్రియునకు ప్రజా సంరక్షణమును, వైశ్యునకు సేద్యము,వర్తకమును, శూద్రునకు సేవయును తపస్సు లగును. దుస్తరములు, దుష్ప్రాప్యములు, దుష్కరములు అయిన వన్నియు తపస్సుచే సాధ్యము లగును,' (మను-11-234,235,238). 'ఆత్మ సంయమము గలవారును, కందమూలఫలములను గాలిని ఆహారముగా గొనువారును అగు ఋషులు తమ తపోబలముచేత ముల్లోకములయందుండు చరాచరములను అన్నిటిని ప్రత్యక్షముగా చూడగలరు,' (11–236), 'బ్రాహ్మణుడు జీవనముకొరకు లౌకికవృత్తుల నవలంబించ కూడదు. దుష్ప్రవర్తనములు లేని సాధుజీవనము చేయవలెను.' (4-11).

ఆత్మజ్ఞానము బడయవలసినవాని జీవిత మంత పరిశుద్ధముగా నుండవలెను. గనుక, బ్రాహ్మణునకు, తన ధర్మావలంబమునం దాటంకము గలుగకుండ ప్రభువు కాపాడవలసిన బాధ్యత యున్నది. అందుచేత "బ్రాహ్మణుడు రాజునొద్ద నుండియైనను తనశిష్యుల యొద్ద నుండియైనను తనచే యజ్ఞము చేయించుకొను వాని యొద్దనుండి యైనను ధన మార్జింపవచ్చును. వా రుండగా ఇతరులనుండి ధనము గ్రహించరాదు" (మను 4-33), అని విధించబడినది.

బ్రాహ్మణుడు తన జ్ఞానమును విక్రయించరాదు. ధనమునకు ధనము ప్రతిఫలము, పాటుపడినందుకు ధనము ప్రతిఫలము. కాని, జ్ఞానమునకు ప్రతిఫలము గౌరవము గాని ధనముకాదు. కనుక, అయాచితముగ నెంత లభించిన నంతటితో సంతుష్టుడై యుండవలెను. ఇది జను లందరకును ఆదర్శమైన జీవితము: బ్రాహ్మణునకు దేహము క్షుద్రకామములయందు వ్యర్థముగా వ్యయముచేయుట కీయబడలేదు, తపస్సుచే దహింప బడుట కీయబడినది. తపస్సుచే దనకును ఇతరులకును ఇహపర సుఖములు సమకూర్చును." ఆటువంటి బ్రాహ్మణుని గౌరవించుట అందరకును విధి. 'గౌరవించనివారు కృతఘ్నులు. కాని, బ్రాహ్మణుడు తనకు తాను గౌరవము నపేక్షించరాదు. అన్యులుచేయు గౌరవమును విషమువలెను, అవమానమును అమృతమువలెను చూడవలెను. (మను 2-162).

బ్రాహ్మణునకు గౌరవము చేయనివాడు ఆ బ్రాహ్మణునివల్ల (జ్ఞానమును) విద్యను బడయజాలడు. (దీనిని

గురించి విద్యావిధానములో వ్రాయబడినది.) అధ్యాపకుడు తనను అక్రమముగా నడిగినవానికి చెప్పనక్కరలేదు. గాని తన నాశ్రయించుకొని యున్న పసిబాలురు, పుత్రులు తనను గౌరవము చేసినను చేయకపోయినను వారియందు కరుణగలవాడై, విద్య చెప్పవలెను, అని విష్ణుభాగవతములో చెప్పబడినది.

కొంతమంది హిందూమత మనగా బ్రాహ్మణుని గోవును పూజించుటయే యని హేళన చేయుదురు. ఇందులో హేళనకు కారణములేదు. బ్రాహ్మణుడు జ్ఞానస్వరూపుడును గోవు మాతృస్వరూపిణియును. ఈ రెండింటిని పూజించుటకంటె గొప్పకర్మ యేమున్నది?

'బ్రాహ్మణుడు, గోవు, స్త్రీ, బాలుడు, వీరికొరకు దేహత్యాగము చేసిన బాహ్యజాతివాడు సిద్ధిపొందును.' (మను-10-62) 'గోవుయొక్క మాతృవాత్సల్యమును బ్రాహ్మణునిజ్ఞాన సంచయమును ఎక్కడ గౌరవించెదరో ఆదేశము సంపత్సమృద్ధమై ఏకొఱతయు లేకయుండును.'

'బ్రాహ్మణుడు అన్నివర్ణములవారి వృత్తులను తెలిసియుండి వారికి ఆయావృత్తులతో సంబంధించిన యుపాయములను బోధించుచు, తన జీవనమునకు తన వృత్తి నవలంబించవలెను' (మను-10-2), ఇటువంటి బ్రాహ్మణులున్న దేశములో విద్యావిషయమైన సమస్య లేమియు నుండజాలవు. ప్రతి బ్రాహ్మణుని యిల్లును ఒక వసతి గృహసహితమైన పాఠశాలయగును. ఎక్కువ మంది విద్యార్థు లొకచో మూగుటగాని విద్యార్థులకు

ప్రపంచముతో సంబంధము లేక పోవుటగాని యుండెను. పిల్లలకు ఇంటియొద్ద నున్న సదుపాయము లుండును. విషయము, ఎవరి కనుకూలమగు నట్లు వారు కావలసినంత వ్యవధి కలిగి, నేర్చుకోవచ్చును. ప్రతి పిల్లవానికి వాని ప్రకృతిని బట్టి బోధించుటకు ఉపాధ్యాయునకు తీరుబడి యుండును. విద్యకొరకు తగనివ్యయ మక్కరలేదు. గురువునకు, శిష్యునకు, తలిదండ్రులకు, ఇతర గృహస్థులకు పరస్పరము అనురాగము, గౌరవము, నమ్మకము వృద్ధియై, ఈ ప్రేమ సకల ప్రాణులకును విస్తరించును.

పిల్లలేగాక పెద్దలుగూడ బ్రాహ్మణులవల్ల పుణ్యదినములందు పురాణములు ఇతిహాసములు ఉపన్యాసములు వినుటచే వారికిగూడ నిత్యము విద్యాబోధనము లభించుచుండును. సంవత్సరములో నించుమించుగ సగము దినములు పుణ్యదినములే. ఎవరో యొక దివ్యపురుషునితోగాని, యొక దేవతతోగాని, యొక పుణ్యకర్మతోగాని సంబంధించిన దినములన్నియు పర్వదినములే. ప్రకృతి సౌందర్యము, దేవతలు నిత్యసంస్మరణీయములు. ప్రతి వస్తువు పవిత్రమైనదే. పుస్తకము సరస్వతీ స్వరూపము గనుక వీధిలో బోవు ప్రతివాడును వ్రాయకూడదు, ముట్టకూడదు. ప్రతినాణెము లక్ష్మి స్వరూపము గనుక పాపకర్మలకు వినియోగించరాదు. ప్రతి ఆయుధము యముని ధర్మదండ స్వరూపము గనుక ధర్మసంరక్షణార్థమేగాని ఎత్తరాదు. ఈవిధముగ జీవితము నందంతటను ఆధ్యాత్మచింత దృఢమగుట కేర్పాట్లు చేయ

బడినవి. అటువంటి పరిస్థితులలో బుట్టిన మనుష్యుని జీవితముగాక మరియెవరి జీవితము ధన్యమగును!

## క్ష త్రి య ుడు

బ్రాహ్మణుడు జ్ఞాన సంచయమును కాపాడునట్లు క్షత్రియుడు దేశబలమును కాపాడును. పైనుండివచ్చు శత్రువుల నెదిరించుటకును, అంతఃకలహముల నణచుటకు తగిన భుజబలము దేశములో నుండవలయును. ఆ బలము క్షత్రియునిది. బలవంతులచే హింసింపబడకుండ బలహీనుల గాపాడువాడు అని, క్షత్రియ శబ్దమునకు అర్థము. 'క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః రాజ్యేన కిం తద్విపరీతవృత్తేః ప్రాణై రుపక్రోశమలీమసైర్వా' (రఘువంశము 2-53) ఇతర విధముగ ప్రవర్తించువాడు రాజు అగుటకు తగడు. శరణాగత రక్షణ చేయజాలని వానికిని అపఖ్యాతి ప్రబలిన వానికిని ఈ జీవితముతో పని యేమి? క్షత్రియుని ఆదర్శ మిది.

రాజునకు తన అధికారము చేతను భుజబలము చేతను గర్వము కలుగకుండుటకును, యితరులకు వానిమీద అసూయ కలుగకుండుటకును రాజు నెరవేర్చవలసిన ధర్మములును, వహించవలసిన బాధ్యతలును కూడ విధించబడినవి. పేద బ్రాహ్మణుని జ్ఞానమునకును, సాధు శీలమునకును వినమ్రము డగుటయును, తనరాజ్యములో నతి నీచ జనులైనను దుర్మార్గులనుండి కాపాడుటకు తన జీవితము నైన నిచ్చుటయును, రాజునకు ధర్మము. ప్రజలను రక్షించుట, దానము, యజ్ఞముచేయుట, అధ్య

యనము, విషయములయం దపిసక్తత క్షత్రియునకు ధర్మములు (మను-1-89). ప్రజలు రాజునెడల భక్తికలిగి విధేయులై యుండవలెను. ఇట్లుభయులు తమతమ ధర్మములు నెరవేర్చి నప్పుడే రాజ్యమున సుఖము, శాంతి యుండును. అందుకు మంచి నేర్పరితనము యుక్తి యుండవలెను. అహంభావము, వ్యక్తిస్వాతంత్ర్యము ప్రబలియున్న యీ కాలమున యీధర్మము లసహ్యములుగా కనబడును.

'రేయింబగళ్ళు రాజు ఇంద్రియనిగ్రహము చేయవలెను. ఇంద్రియములను నిగ్రహించిన రాజునకే ప్రజలు వశమగుదురు!'(మను 7-44) 'శుచి, సత్యసంధత, శాస్త్రాను సారముగ నడవడి, మంచి(వారి) సహాయముగల రాజు మాత్రమే దండమును యుక్తముగా నేల గలడు. దురాశ గలవాడు, మంచి (వారి) సహాయములేని, వాడును, మూఢుడును, బుద్ధిహీనుడును, ఇంద్రియలోలుడును, అయిన రాజు దండము నేలజాలడు. అట్టి రాజుచేత మిక్కిలి తేజస్సుగల యీ దండపురుషుడు ఏలబడడు. ఆ దండము ధర్మములేని రాజును సకుటుంబముగ నాశనము చేయును.' (మను 7-31, 30, 28). ఈ విధముగ రాజధర్మములను, ప్రజాధర్మములను విధించి, మనువు రాజ్యపరిపాలనా విధానమును మిక్కిలి విపులముగా వివరించెను. పరిపాలనమున కంతకును ధర్మము ఆధారముగా జేయబడినది. ధర్మబుద్ధిలేని అధికారులున్నయెడల శాస్త్రము లెంత విపులముగ నున్నను ప్రయోజనము లేదు. అధి

కారి ధర్మబుద్ధిగలవాడైనయెడల శాస్త్రవిధు లెంత సంగ్రహముగా నున్నను లోపముండదు.

రాజు తన ధర్మమును పాలించుచున్నాడా లేదా యని చూచు బాధ్యత బ్రాహ్మణునకును, తన క్రింది యధికారులు, ఉద్యోగులు తమతమ యుద్యోగములను న్యాయముతో నెరవేర్చుచున్నారో లేదో చూచు బాధ్యత రాజునకును గలదు. ధర్మము లన్నిటిలో ముఖ్యమైన యీ ధర్మము మనుసంహితకు ఆధారము. ఈ కాలములో ఇటువంటి ధర్మములు బాలబోధలలో వ్రాయవలసినవే గాని రాజ్యతంత్రజ్ఞులకు చెప్పవలసినవి కావని భావింతురు. కాని బాలబోధలలో గూడ ఈ ధర్మములు ఎక్కడను చెప్పుటలేదు. అందుచేత విద్యావంతులు అధికార పదవులలో నున్నను దర్పము, గర్వము ఎక్కువగా కనిపించు చున్నవి గాని ఓరిమి, క్షమ, విచక్షణ మొదలగునవి అరుదుగా నున్నవి. "రాజు వ్యాజ్యమునం దోడినవారైనను, చిన్నవారైనను వృద్ధులైనను, రోగిష్ఠులైనను తన్ను తిట్టినట్లయిన దానిని ఓర్చుకొనవలెను. దుఃఖము బొందినవారి తిట్లను క్షమించిన రాజు స్వర్గమునందు గౌరవము పొందును. తన యైశ్వర్యము వలన తిట్టు వానియెడల నరకమును పొందును." (మను-8-312,313).

రాజు ప్రజల ఆదాయములో ఆరిట నొకపాలు తీసికొనవలెను. కరువుకాలమున పదవపాలు, మంచికాలమున నాల్గవపాలు తీసికొనవచ్చును. కాని సామాన్యముగ ఆరవపాలు పన్నుగా తీసికొనవలెను. ఆ ఆదాయములో నుంచి రాజ్యాంగమునకగు వ్యయము, ప్రజల

సౌకర్యము లమర్చుటకు అగు వ్యయము చేయవలెను. బడులు, వైద్యశాలలు, తోటలు, వస్తు ప్రదర్శనశాలలు, నాట్యశాలలు, సత్రములు, నూతులు, చెరువులు, మొదలైనవి ప్రజాసౌకర్యమునకు చేయు ఏర్పాట్లు. ఈ ఆదాయములోనుంచి స్వంతఆదాయములేని బ్రాహ్మణులను సన్యాసులను పోషించవలెను. ప్రజల ఆదాయములోనే గాక ప్రజల పుణ్యాపాపములలో గూడ రాజున కొరవ పాలు ముట్టునని మనువు చెప్పుచున్నాడు (మను— 8-304,35;11-23)

క్షత్రియులందరును శస్త్రనైపుణ్యమును యుద్ధ తంత్రమును నేర్చి రక్షకబుద్ధి గలిగి యుందురుగాని, వారిలో కొద్దిమందిమాత్రము సైనికవృత్తిలో చేరుదురు. తక్కినవారువివిధములైన యుద్యోగములలోజేరికావలసి నప్పుడు యుద్ధమునకు సిద్ధమగుదురు. తమ ప్రాణములను ఆర్తులను రక్షించుటకై ధారబోయుట కనుక్షణము సిద్ధముగా నుండు క్షత్రియునకుగూడ తపస్సు చేయు బ్రాహ్మణునకు లభించు పదవి లభించును. 'యోగారూఢుడైన యోగియును, యుద్ధములో బాణముచే హతుడైన వీరుడును ఈ యిద్దరియాత్మలే సూర్యమండలమును భేదించుకొనిపోవునవి.' క్షత్రియులీ ధర్మమును విడిచినపుడు భూభార మధికమై, ఆభారమును తగ్గించుటకు భగవంతు డవతరించును. అటువంటి సమయములలో తిరిగి ధర్మప్రతిష్ఠయగుటకు ముందు యుద్ధము ప్రజానాశనము తప్పదు. సామాన్యముగ జనులలో అహంభావము స్వార్థపరాయణత బలమైనపుడు పోటీబయలుదేరి ఒకరి నొకరు, ప్రత్యక్షముగా

శాకమన్నను, పరోక్షముగను, ఒక్కమారుగాక మెల్ల మెల్లగను చంపుకొందురు. వారు అనుభవముచేత కొంత కాలమునకు ఈ పోరాటమువల్ల తమకు కావలసిన సుఖము దొరకలేదని గ్రహించి, తమ ప్రవర్తన యందసహ్యము పుట్టి తద్ద్వారా వైరాగ్యము పుట్టి, సత్ప్రవర్తన నభ్యసింప నారంభింతురు. వారు అరవజాతి మూలపురుషులుగా బుట్టుదురు. పూర్వకాలములలో జనులు తమ వర్ణధర్మములను, రాజులు తమ ధర్మములను జాగ్రత్తగా పాలించుచుండుటచేత జనులయందీమార్పు శాంతముగ జరుగుట కవకాశము లెక్కువగా నుండెను. ధర్మపరిపాలనము లేనప్పుడు యుద్ధములు, తిరుగుబాట్లు, విప్లవములు సంభవించును.

మనువు నిరంకుశ ప్రభుత్వమునుగాని, మూఢజనుల మూకల ప్రాతినిధ్యముగల ప్రజాపరిపాలనమునుగాని అంగీకరించలేదు. రాజు జ్ఞాననిధియైన బ్రాహ్మణుల యొక్క కర్మేంద్రియము, జ్ఞాననిధులచే నిర్మితములైన ఆమ్నాయములలో స్పష్టముగా విధింపబడిన విషయములను రాజు మార్పుచేయుట కధికారము లేదు. 'మూడు వేదములను, న్యాయశాస్త్రమును, నిరుక్తమును, ధర్మశాస్త్రమును ఎఱింగిన వారును, బ్రహ్మచారియు, గృహస్థుడును, వానప్రస్థుడును, కూడినది దశవిధ లక్షణములుగల పరిషత్తు. ఋగ్యజుస్సామ వేదముల నర్థముతో తెలిసిన ముగ్గురు కూడినది త్రివిధ లక్షణములుగల పరిషత్తు. ఈ రెండు విధములైన పరిషత్తులలో నొకటి దేనిని ధర్మముగా విధించునో దానినే ధర్మముగా అంగీకరించవలెనుగాని ఆక్షేపించరాదు. ధర్మసందేహమును

తీర్చుటకు ఈ పరిషత్తులకే అధికారము గలదు. (కొన్ని స్మృతులలో పరిషత్తునకు 12,15,21 వరకు సభ్యులుండ వలెనని విధించ బడియున్నది.) పరిషత్తు లేనిచోట వేద విదుడైన యొక్క బ్రాహ్మణుడు నిర్ణయించినదే ధర్మ ముగా నంగీకరించవలెనుగాని, వేదార్థ మెఱుగని పది వేలమందియైనను చెప్పునది ధర్మము కానేరదు. బ్రహ్మచర్యాది వ్రతనియమములను వదలినవారును, గాయత్రీ మంత్రోపదేశము పొందనివారును, పేరు నకు మాత్రము తమ కులమునకు చెందియున్నవారును వేలకొలదిగ కూడినను, వారు న్యాయమును తీర్చుటకు సమర్థులుకారు గనుక, అది సభ యన తగదు. తమో గుణము గలవారు, మూర్ఖులు, చేసిన తీర్పువల్ల కలిగెడు పాపము నూరు రెట్లు వృద్ధియై తీర్పు చేసినవానిని చెందును' (మను 12-108 మొ॥ 115) జ్ఞానులు, ధర్మ వర్తనులు, వయోవృద్ధులు, అనుభవ సంపన్నులు, తమ ఆత్మత్యాగము చేతను జ్ఞానముచేతను ప్రజలయొక్కయు రాజుయొక్కయు నమ్మకమునకు పాత్రులై, వారిచే నాహూతులై ధర్మ నిరూపణ చేయుట ఆదర్శప్రాయ మైన శాసన నిర్మాణముగాని, అల్పజ్ఞులు, అర్ధజ్ఞానులు, తమ మాటలచే జనులను వంచించి వారి నాశబెట్టి వారి సమ్మతులను గొని సభలలో జేరువారు చేయునది సరి యైన శాసన నిర్మాణము కాజాలదు. సత్యమొక్కటియే గనుక దానిని నిరూపించుటకు సత్యసంధు డొక్కడు చాలును. అసత్యము వేయి రూపములు గలది గనుక దానిని నిరూపించుట కంతమంది మూర్ఖులు కావలెను.

ఈ కాలపు ప్రజా పరిపాలనములో నియోజక వర్గ

ముల నేర్పర్చి ప్రతినియోజక వర్గమునకు ప్రతినిధు
లుండవలె ననుట మూలసూత్రము. దీనివల్ల పోటీలు
బయలుదేరి పెద్దలు చిన్నలుకూడ వాటిలో ప్రాల్గొన
వలసివచ్చుచున్నది. ఈ పోటీలమీద గెల్చినవారు సభ
లలో గూర్చొని సంఘమునకు మొత్తముగా లాభించు
విషయముల నాలోచించుటకు ప్రయత్నించక, ఎవరికి
వారు లాభమును, ఎవరినియోజకవర్గమునకు వారు మేలును
కలుగవలె నని చూచెదరు. తన లాభమునకు, లేక తన
వారియొక్క లాభమునకు, పోరాడుట యనగా తన
ప్రయోజనము ఇతరుల ప్రయోజనముకంటె భిన్నమని
నిశ్చయము చేసి కొన్నట్లే గదా! అట్టి భేదభావము గల
వాడు దేశక్షేమమునకు ఏమి పని చేయగలడు? అంద
రిని సమముగా చూడగలవాడు అందరి క్షేమముకొఱకు
పని చేయువాడు న్యాయము నాలోచించగలడు. గాని
పక్షపాతము గలవాడు న్యాయము నాలోచించ
జాలడు.

సాంఘిక వ్యాపారము లన్నియు నొక దానితో
నొకటి సంబంధించి యుండును. ఒకదానిలో గొప్ప
మార్పు ఏదైన జరిగినయెడల తక్కిన వన్నియు
మార్పుగోరును. ఈ సంగతి హెర్బర్టుస్పెన్సరువంటి
ఆధునిక సంఘశాస్త్రజ్ఞులు అంగీకరించిరి. గాని శాసన
నిర్మాణ నిపుణులు మాత్ర మీసూత్రము నంగీకరించరు.
వారికేవో కొన్ని విషయములను గురించి కొన్ని అభి
ప్రాయము లుండును. వానినే అటునుంచి ఇటు, ఇటు
నుంచి అటు మార్చుచుందురుగాని ఆత్మజ్ఞానముతో పురు
షార్థముల నెఱింగి తత్సిద్ధికొఱకు శాసనములను నిర్మిం

చుట నెరుగరు. ఇప్పుడు పాశ్చాత్యులలో కొందరు శాసన నిర్మాతలు ప్రత్యేకముగ శిక్షణము నొందిన వారుగ నుండవలె నని అంగీకరించు చున్నారు. ఈ శిక్షణమునే మనువు బ్రహ్మచర్యాశ్రమములో గురుకుల వాసమున 36 సంవత్సరములు పొందుటకు విధించినది. అట్టి శిక్షణముపొంది మూడువేదములను తెలిసినవారు ధర్మపరిషత్తులలో గూర్చొనుట కర్హులు అని విధించబడినది.

పూర్వులకంటె మేము గొప్పవార మని, తెలివైన వారమని, పూర్వపు శాసనసభలకంటె మావియెక్కువ జనాభిప్రాయమును పొందుపరచునవి అని దర్పము లాడు నేటి రాజ్యాంగవేత్త లేర్పర్చిన పరిషత్తులలో గూడ నిజముగా మంచిచెడ్డల నాలోచించి, వాదములు చేయువారు బహుతక్కువమంది. తక్కినవారు గంట వాయించగానే తమనాయకు డే పక్షము చేయెత్తిన ఆ పక్షము చేయెత్తువారే. అయినను ఆ కొద్దిమంది యైనను సరియైన యాదర్శముతో పనిచేయువారు కానందున నేటి శాసనసభలు మనువు చెప్పిన సభలవంటి యున్నతస్థితియం దుండజాలవు.

ఏ కాలములోనైనను విజ్ఞులు తక్కువమంది అజ్ఞులెక్కువమంది యుండుట సహజము. అట్టి విజ్ఞుల సహాయముతో ధర్మబద్ధుడైన ప్రభువు చేయు పరిపాలనములో కరుణతో శాసించుటయును, కృతజ్ఞతతో శాసనము ననుసరించుటయు నుండెను. నేటి ప్రజా ప్రాతినిధ్య పరిపాలనము ధర్మబదుడుకాని నిరంకుశ ప్రభువు

పరిపాలనముకంటె క్షేమకరము కావచ్చునుగాని ధర్మబద్ధుడైన ప్రభుని పాలనమునకు సాటిరాదు.

'సర్వం పరవశం దుఃఖం సర్వ మాత్మవశం సుఖమ్।
ఏతద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః॥' [మను 4-160] [ఇతరుల వశమగు టంతయు దుఃఖము, ఆత్మ వశమై యుండు టంతయు సుఖము,ఇది సంగ్రహముగ సుఖదుఃఖముల లక్షణము] అని చెప్పుటలో మనువు స్వరాజ్య సిద్ధాంతమును చక్కగా నిరూపించెను. ఇక్కడ ఆత్మ అనగా మన యంతరాత్మ అనియు పరులనగా అనాత్మయైన శరీరము, కామములు, ఇంద్రియములు అనియును అర్థము చేసికొనవలెను. మనుష్యుని యందు అంతరాత్మ దేహాత్మయున్నట్లే జనాంగములో గూడ సత్వగుణ ప్రధానులైన తక్కువమంది జనులు రజస్తమోగుణ ప్రధానులైన యెక్కువమంది జనులును ఉన్నారు. ఆత్మ పరిపాలించునపుడు సుఖము అనాత్మ పరిపాలించునపుడు దుఃఖము కలుగును. కనుక సత్వగుణ ప్రధానులైన కొద్దిమందిపాలనము సుఖదాయకము గాని రజస్తమోగుణ ప్రధానులైన జనసమూహముల పాలనము దుఃఖకరము.

మనుష్యుడు బాల్యమున అజ్ఞానముచే తలిదండ్రుల పాలనముక్రింద నుండి శాంతి ననుభవించును. యౌవనమున అజ్ఞానజనితమైన శాంతి పోయి,జ్ఞానము లేనందున జ్ఞానముచే గలుగు శాంతి సమకూడక, ఇంద్రియముల ప్రభావ మెక్కువయై జీవితము ఒడుదొడుకులతో నుండును. వార్ధక్యమున జ్ఞానము కలిగి శాంతి చేకూరును. అట్లే జనసామాన్యము అజ్ఞానదశలో నున్నప్పుడు

అనుభవజ్ఞులైన కులపెద్దలచే పాలింపబడుచుండిరి. జనసామాన్య మిప్పటివలె యౌవనదశలో నున్నప్పుడు పెద్దలు చెప్పినట్లు వినక స్వతంత్రముగ ప్రవర్తించవలెనను కుతూహలముతో బయలుదేరి, యింద్రియములకు లోబడి పోవుటచే, అల్లకల్లోలముగ నుండును. ఈ యనుభవము లన్నియు ననుభవించి క్రమముగా జ్ఞానము సంపాదించినపుడు, ముందు కాలములలో జనసామాన్య మంతేయు నింతకంటె జ్ఞానవంతు లగుదురు. గనుక స్వరాజ్యమున కర్త లగుదురు. గనుక, అప్పుడు ఇప్పటికంటె నుత్కృష్టమైన ప్రజాపరిపాలన ముండ గలదు.

ఈ సందర్భములో మనుస్మృతియందు చెప్పిన దండనవిధానమును గురించి కొంత యోచింతము. మనువు విధించిన శిక్షాస్మృతిని జాగ్రత్తగా జదివి జూచిన యెడల ఇప్పటి నవనాగరిక దేశములయందలి శిక్షాస్మృతులకు దీసిపోదని చెప్పవచ్చును. ఎనిమిదవ అధ్యాయములో నేరముచేసిన జనుల కెట్లు శిక్షలు విధింపబడినవో అన్యాయముచేసిన రాజునకు న్యాయాధిపతికి కూడ అట్లు దండన విధింపబడినది. న్యాయాధిపతి ధర్మములను గురించి మనువు వ్రాసిన విధులు నేటి చట్టములలో నిమిడ్చిన యెడల న్యాయస్థానము లిప్పటి కంటె ఎక్కువ ఉపయోగకరముగ నుండవచ్చును. ఇప్పటి న్యాయస్థానములలో న్యాయవాదుల వాక్నైపుణ్యము, సాక్షుల తెలివితేటలు, జయాపజయకారణములు గాని న్యాయము, సత్యము కనుగొనవలెనన్న ఆకాంక్ష తక్కువ.

'రాజుగాని న్యాయాధికారిగాని స్వయముగా వ్యాజ్యమును కల్పించరాదు. ఒకరు తెచ్చిన వ్యాజ్యమును విచారించక యుండరాదు' (మను 8-43)

దండన యెట్టిదిగా నుండవలెను? ఎంత యుండవలెను? అను విషయమై మనువు ఇట్లు శాసించెను. 'దండింపదగనివారలను దండించినను, దండింపదగినవారిని దండింపకున్నను న్యాయాధిపతి ఇహమందపయశస్సును పరమందు నరకమును పొందును. ఒకడు మొదటచేసిన నేరమునకు వానిని నోటితో హెచ్చరించుటయు, రెండవ నేరమునకు నలుగురిలో నవమానపరుచుటయు, మూడవ మారు నేరము చేసినయెడల జుల్మానా వేయుటయు, నాలుగవమారు చేసినయెడల శరీరహింసయును దండనలు. ఒక కార్షాపణము దండన విధించవలసిన నేరమును రాజే చేసినయెడల వానికి వేయిరూకలు విధించవలెను. దొంగతనమును శూద్రుడు చేసినయెడల విధించు దండనకు రెండురెట్లు వైశ్యునకును, అంతకు రెండురెట్లు క్షత్రియునకును, అంతకు రెండురెట్లుగాని మూడు నాలుగు రెట్లుగాని బ్రాహ్మణునకును విధించవలెను. చేసినది దోషము అని బ్రాహ్మణుడు తెలిసినవాడు గనుక వానికంత దండన విధించబడినది. దొంగయెత్తుకొనిపోవు ద్రవ్యము దొరికినయెడల దాని స్వంతగాడు దొరకనప్పుడు దానిని సర్వవర్ణస్థులకును రాజు పంచిపెట్టవలెను. అట్లు పంచక తానుపయోగించుకొన్న యెడల రాజు ఆ దొంగచేసిన పాపమును పొందును. పాపము చేసినవాడు తాను చేసిన పాపము నందరితో చెప్పుటచేతను. పశ్చాత్తాప పడుటచేతను,

తపస్సుచేతను, అధ్యయనముచేతను, దానము చేయుట చేతను, శుద్ధుడగుచున్నాడు. పాపముచేసిన జనులు రాజుచే దండింపబడిన యెడల తమ పాపమును నివర్తించుకొని నిర్మలులై పుణ్యముచేసిన వారివలె స్వర్గమును పొందుదురు. (మను 8-128,129,336,337,338, 40; 11-227; 8-318).

చోరత్వముచే నొకపౌరుడు నష్టము పొందినద్రవ్యమును రాజు చోరుని యొద్దనుండి తీసికొనజాలనప్పుడు తన కోశమునుంచి తీసి ఆపౌరున కీయవలెనని భీష్ముడు చెప్పినట్లు మహాభారతములో నున్నది. ఈ పైవిధులలో నున్న ధర్మములను నేడే శిక్షాస్మృతిలోను కానము. మనుస్మృతినంతను చక్కగా బోధపరచుకొనని వారు శూద్రునకు విధించు దండముకంటె వైశ్యునకును అంతకంటె క్షత్రియునకును తక్కువ దండమును చెప్పిన శ్లోకములను మాత్రముదహరించి మనుస్మృతి ఘోరమైన అన్యాయము అని చెప్పుదురు. ఇట్టి శ్లోకములు పదిపన్నెండు కంటె నెక్కువలేవు. అట్టి ఘోరదండనలు నేరస్థుల భయములో నుంచుటకు విధించియుండవచ్చును. మరియును, దండనము నేరమునుబట్టి గాక నేరముచేసిన వానినిబట్టి యుండును. దండన నేరము చేసినవానిని సంస్కరించుట కేర్పడినది. ఒకనిని సంస్కరించుటకు మందలింపుచాలును. మరియొకనికి కొరడాతో కొట్టినగాని బుద్ధిరాదు. మరియొకనికి వాని ధనమును తీసికొనిన బుద్ధివచ్చును. మరియొకనికి నలుగురిలో నవమానపరచిన యెడల ఉరిదీయుటకంటె నెక్కువ పని

చేయును. ఇది ఆయామనుష్యుల స్వభావమును బట్టియు, వాని ఆత్మ వికాసమును బట్టియు నుండును.

మనుస్మృతిలో చాలానేరములకు అర్థదండన (జుల్మానా) మాత్రమే విధించెను. దేహదండన విధించినవి బహుతక్కువ. వానిలో బ్రాహ్మణునికూడ విడిచి పెట్టలేదు. ఏ పని చేసినవాని కా పనికి తగిన శిక్ష ప్రకృతి విధించియుంచును. ఇదియే కర్మ యందురు. బహుశః, ఆకర్మతత్త్వము నెరింగిన మహనీయులు కర్మ ఫలముగ నెప్పుడో యనుభవించవలసిన దానిని ఇప్పుడే దండన రూపముగ విధించియుందురు. మనువు 'వధ', 'భేదము' అనుమాట లుపయోగించినపుడు వానికి ప్రాణము తీయుట, అంగమును కోసి పారవేయుట అను నర్థములను చెప్పగూడదు. మీద నుదహరించిన 8-129 శ్లోకములో వధ అన్నమాటకు కొట్టుట, బాధించుట అని వ్యాఖ్యాత లర్థము చెప్పిరి. ఇట్టికారణముల చేత ఆ పదిపండెండు శ్లోకములను బట్టి మనువు పక్షపాతముగ దండనలు విధించె నని చెప్పదగదు.

రాజు ఎట్టివాడై యుండవలెనో విష్ణుభాగవతములోని పృథుచక్రవర్తి వర్ణనమును బట్టి తెలిసికొనవచ్చును. పృథుచక్రవర్తి తనయందు సమస్తమైన లోకపాలు (రగు దేవతల) లక్షణములను ఏకీభూతము చేసికొన్నవా డని చెప్పి ఆయా దేవతల గుణము లతనియం దున్నవని వివరించి తుదకు, 'వాత్సల్యేమనువన్నౄణాం ప్రభుత్వే భగవానజః,బృహస్పతిర్బ్రహ్మవాదే ఆత్మవత్త్వే స్వయం హరిః' (విష్ణుభాగ. 4-23-61) [వాత్సల్యమున మనువు వంటివాడు; ప్రభుత్వమునందు అజుని (బ్రహ్మ) వంటి

వాడు, ఆత్మవిద్యయందు బృహస్పతివంటివాడు, ఆత్మానుభూతియందు విష్ణువువంటివాడు]అనియుగించెను. రా జెట్టివాడై యుండవలెనని విధించబడినదో వానిచే నియమింపబడిన రాజకయోద్యోగు లందరును కూడ అట్టి వారై యుండవలెను. అనగా జనుల నమ్మకమునకు పాత్రులై, జనులను రక్షించువారై యుండవలెను. లేని యెడల 'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః' అను వాక్యమును బట్టి ప్రజ లందరు దుర్మార్గు లగుదురు.

## వైశ్యుడు

బ్రాహ్మణునకు జ్ఞానబోధయును క్షత్రియునకు రాజ్యసంరక్షణయును ధర్మము లగుటచేత వారికి లాభ కరము లగు వృత్తు లవలంబించవలసిన బాధ్యత లేదు. ఆ బాధ్యత వైశ్యున కియ్యబడినది. 'పశూనాం రక్షణం దానమిజ్యాఽధ్యయనమేవచ । వణిక్పథం కుసీదంచ వైశ్యంచ కృషిమేవచ' (మను 1-90).

[వైశ్యునకు పశుసంరక్షణ, దాన మిచ్చుట, యజ్ఞము చేయుట, వేదాధ్యయనము, వాణిజ్యము, వడ్డీకి బదు లిచ్చుట, సేద్యముజేయుట ఇవిధర్మములు.]యజ్ఞము అధ్యయనము ద్విజు లందరకు సమానము. దానము చేయుటకు తక్కినవారి కంటె వైశ్యున కెక్కువ అవ కాశము లున్నవి. తరువాత స్వభావజనితమైన కర్మలు 'కృషిగోరక్షవాణిజ్యం' (గీతా-18-44) చెప్పబడినవి. కృషి, గోరక్షణ జీవనాధారములు. వాణిజ్యము సంపద లకు సుఖమునకు కావలసినది. కనుక, మొదటి రెండింటి కిని మనువు మిక్కిలి ప్రాముఖ్యము నిచ్చెను.

కాలక్రమమున కృషి, గోరక్షణ నిరక్షరకుక్షులైన మూర్ఖుల చేతిలో పడినది గాని పూర్వము అట్లు లేదు. ఆహారపదార్థ మేది యైనను అమృతముగా భావించబడుచుండెను. 'అన్నము పూజనీయము. దానిని తిరస్కరించక సంతోషముతో చూచి, పొగడి, భుజింపుము. అన్నమును పూజించి భుజించిన ధైర్యమును బలమును ఇచ్చును. నిందించిన నా రెండింటిని నాశనము చేయును. (మను 2-54,55). శ్రుతిస్మృతు లన్నియు అన్నము మిక్కిలి పవిత్రమైనది అని చెప్పుచున్నవి. బృహదారణ్యకోపనిషత్తులో 'అన్నంబ్రహ్మ' అని సంక్షేపముగా చెప్పబడినది.అన్నమునకును శరీరమునకును మనస్సునకును సంబంధ మున్నది. 'పవిత్రమైన అన్నము వల్ల సత్వము (మనస్సు) పవిత్రమగును. దానివల్ల పూర్వస్మృతి కలుగును. దానివల్ల హృదయాది సర్వగ్రంథులు విడిపోవును. అట్టివానికి స్కందు డనబడు శ్రీ సనత్కుమారులవారు అంధకారమును తొలగించెదరు' అని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది.(7-26) ఈ తత్వము తెలిసిన యెడల ధనవంతుల యిండ్లలో ఆహారపదార్థము లింత రద్దు అగుటయు పేదవారికి దొరకకుండుటయు నుండదు. ధనవంతు లెక్కువ తినుటవల్లను, పేదలకు తిండి లేకుండుటవల్లను కలుగు రోగములు కలుగవు.

అటువంటి పవిత్రమైన ఆహార పానీయములను నిర్మలమైన వానిని సమకూర్చుట ఆత్మజ్ఞానము సమకూర్చుట కంటె తక్కువ పని కాదు. అట్టి మహాకార్యము వైశ్యున కొప్పగించబడినది. బ్రాహ్మణునకు శబ్దబ్రహ్మము ఒప్పగించబడినది. వైశ్యునకు అన్నబ్రహ్మము ఒప్పగించబడినది.

పార్వతీదేవికి అన్నపూర్ణ యని పేరు. దానిని బట్టి అన్నమును సమకూర్చు పని యెంత పవిత్రమైనదియు తెలియును. వ్యవసాయము చేయుటయును, ఆహారపదార్థములను సేకరించుటయును, అన్నము వండుట, బిడ్డలకు పెద్దలకు అతిథులకు ఆదరముతో పెట్టుట మొదలగు గృహిణీధర్మములు, ఇట్లు పవిత్రము లని తెలిసినవారికవి యెంత మనోహరముగా కనబడునో చూడుడు. మన దేశములో గృహిణిని అన్నపూర్ణాదేవి యని గౌరవించెదరు. పాశ్చాత్యదేశములలో గృహిణియొక్క ధర్మములును, గౌరవమును తెలియనందున పురుషులతో సమానత్వము కావలె నని స్త్రీలు కోరుచున్నారు. ఆ గాలి మన దేశములోనికి రాకుండుగాక !

శ్రీకృష్ణుడు కౌరవులయొద్దకు రాయబారియై వెళ్లినపుడు దుర్యోధనుని ఆతిథ్యము నంగీకరింపక విదురునికతిథియై, సమస్తోపచారములను పొంది తృప్తుడై వరము కోరుకొను మని విదురు నడిగెను. కేవలము యమధర్మరాజు అవతారమైన విదురున కేమి కావలెను? అయినను శ్రీకృష్ణు నిట్లడిగెను. 'అస్తుమే త్వయిరతిః సుతాఫలం భోజ్యమప్యతిథి సంకులం కులం' (బాలభారతము) [నేను నీయందు రతుడనై యుందునుగాక! నాయింట బిడ్డలును అతిథులును విశేషముగానుండి వారు తినుట కాహారము చాలినంత యుండుగాక!] ధనమదాంధతచే ఒడలు తెలియక బిడ్డలను తమ చేతితో సంరక్షించని వారికిని, అతిథులను తమ చేతితో సత్కారించని వారికిని సంపదలు నిలువవు అని చెప్పుదురు. అటువంటి సత్కార భాగ్యము వైశ్యున కీయబడినది.

వైశ్యునకు భూమాతను గోమాతను సంరక్షించు మహా భాగ్యము లభించినది. 'ఒకడొక ధర్మకార్యమును చేసి సంపాదించిన పుణ్యములో మూడువంతులు ఆ పని చేయుటకు బలము కలిగించిన అన్నము నిచ్చిన వానికి పోయి, యొకవంతు కర్తకు మిగులును.'

శరీర మారోగ్యముగా నుండుటకు శిరస్సు అవయవములు అన్నియు బలముగాను ఆరోగ్యముగాను ఉండవలెను. అందుకు హృదయము నీరోగముగా నుండి రక్తము అన్ని వైపుల ప్రసరించుచుండవలెను. ఆవిధముగా ఒకదేశమున ప్రజలు సుఖముగా నుండుటకు వైశ్యులు ఎక్కువ మంది యుండి తమధర్మమును చక్కగా పాలించుచున్నయెడల, వారి యొద్దనుండి ఆహారవస్తువులు, ధనము అందరకును కావలసినట్లు చేరును. ఒక జనాంగములో వైశ్యు లెక్కువగా నుండుట క్షేమము గాని శూద్రు లెక్కువగా నుండుట క్షేమము కాదు. సేవచేయు శూద్రు లెక్కువగా నున్నయెడల తక్కిన వర్ణములవారికి బద్ధక మెక్కువ యగును. మరియును, జ్ఞానముగలవారు తక్కువమంది యగుదురు. అందుచేతనే ఏ రాజ్యము శూద్రభూయిష్ఠమో ఆరాజ్యము దుర్భిక్షములచేతను, దారిద్ర్యముచేతను వ్యాధులచేతను నాశన మగునని మనువు (8-22) చెప్పెను.

పూర్వము ద్విజు లందరికిని తపస్సు, దానము, అధ్యయనము ముఖ్యముగ విధింపబడినవి గనుక, జనులలో ముప్పాతికమంది ఆత్మజ్ఞానము గలవారై, రాజ్యమును గృహమును చక్కగా పాలించుకొనగలవారై, యుండిరి. అందుచేత అప్పటి జనులు ఆరోగ్యవంతులు

దీర్ఘాయుర్దాయము గలవారునై ధర్మవర్తనులై యుండుటలో ఆశ్చర్యము లేదు.

వైశ్యునకు ప్రత్యేకముగ తెలిసియుండవలసిన విషయము లేవనగా: మణులు, ముత్యములు, పగడములు, లోహములు, వస్త్రములు, కర్పూరము మొదలగు వాసనద్రవ్యములు, ఉప్పు మొదలగు రసద్రవ్యములు, వీటి సారాసారములు, విలువల హెచ్చు తక్కువలు తెలియవలెను. విత్తనములను విత్తెడు క్రమము, ఆయావిత్తులు నాటుకాలమును, భూమియొక్క గుణదోషములును, కొలపాత్రలను, త్రాసును, వీనిలో నుండు ప్రమాణభేదములును ఎరుగవలెను. ఒకరకము సరుకులో మేలు చెడ్డలను, ఏదేశములో ఏ సరుకుకు ధర గలిగి యున్నదియును, ఏ సరుకు ఎంతకాలము నిలువ యుంచిన యెంతలాభము, లేక నష్టము కలుగునదియును, ఏదేశమందు పశువృద్ధికి కావలసిన పచ్చికయును నీరును సమృద్ధిగా నున్నదియును, ఎరుంగవలెను. (మను 9–329–332) వైశ్యధర్మములో పోటీగాని, చవుకగా సరుకులను తయారుచేయుటకు అందము, కళ, గమనించక, అచ్చులలో పోసి చూచుట కసహ్యకరములును, త్వరలో చెడిపోవునట్టియును సరుకులను తయారుచేయుటయు లేదు. వైశ్యుడు తనకొరకు గాక ప్రజ లందరికొరకు ధనార్జనముచేయును, ప్రజలందరికిని శరీరపోషణమునకే గాక, జ్ఞానపోషణమునకు రసజ్ఞతా పోషణమునకు గూడ నుపయోగించు వస్తువులను తయారుచేయును.

# శూద్రుడు

నాలుగవ వర్ణమునకు చెందిన శూద్రునకు సేవ, పరిశ్రమ ధర్మముగా మనువు విధించెను. శూద్రునకు స్వామ్యములు, అధికారములు లేకపోవుటచేత బాధ్యతలు గాని, విధిగా చేయవలసిన కష్టకార్యములు గాని, ఇతరులకొరకు చింతగాని లేవు. చెప్పిన పని చేయుటయే వానిపని. వానికి కావలసిన తిండి, బట్ట లోపము లేకుండ లభించుచుండెను. సంగ్రహముగా శూద్రుడు బాలునివలె చూడబడుచుండెను. 'శూద్రునకు కొంచెమైనను పాపము అంటదు. వాడు సంస్కారమున కర్హుడు కాడు. వానికి అధికారములులేవు. కాని ధర్మకార్యములు చేయుట నిషేధింపబడలేదు. (మను10-126) ఈకాలములో ప్రజలలో నుత్తమపదవియందుండు రాజునకు పాపమంట దందురు. (The King can do no wrong.)

మనువు శూద్రుని బానిసవలె చేసినాడని నవనాగరికు లందురు. ఇప్పటి జనులు తమ మానసిక ప్రకృతిని బట్టి, తమకంటె ఇతరులు అల్పులని భావించుచు, దానికి ఫలితముగ,తమ రితరులచేఅవమానమునుపొందు చుండుట చేత, తాము పరిపూర్ణుల మనుకొని తమ అల్పత్వ మితరుల కారోపించి పూర్వులు అల్పు లని భావించెదరు. మహాభారతయుద్ధము తరువాత, ఇతర దేశములలోవలె ఈ దేశమునందును బానిసత్వము ప్రబలి యుండినను, మనువుకాలమునం దట్లు లేదు. శూద్రుడు 'కులమిత్రు' డని చెప్పిన శ్లోక మిదివర కుదహరించి యుంటిమి.

శూద్రుడు పాదములతో పోల్చబడి నంతమాత్రమున లాఘవము లేదు. శరీరమునంతను భరించునవి పాదములు. శరీరమునం దితరావయవము లెంత ముఖ్యములో పాదములును అంత ముఖ్యములే.

మనువు ప్రతివాదును జన్మచే శూద్రుడు, ద్విజత్వము సంస్కారముచే లభించును, వేదోపదేశమగు నంతవరకు శూద్రునితో సమానుడు, అని చెప్పుచున్నాడు. దీనికి వ్యతిరేకముగ మహాభారతములో మానవజాతి యంతయు బ్రహ్మపుత్రులు బ్రాహ్మణులుగా బుట్టిరనియును, క్రమముగా గుణభేదము లేర్పడి వర్ణములుగా విభజింపఁబడిరనియు చెప్పబడినది. ఈరెండు భావములను విమర్శించి చూచినయెడల, ఇదివరకు చెప్పినట్లు, మొదట మనుష్యులు పొగరూపముగల శరీరములతో నుండినప్పుడు, ఒకరితో నొకరికి భేదములు లేక అందరు సమానలక్షణములు గలిగియుండిరనియును, శరీరములు గట్టిపడి స్థిరపడినప్పటినుంచియు గుణభేదము లేర్పడి, దానితో వర్ణభేదము లేర్పడినవనియును, క్రమముగా వర్ణసంకరమై, అందరును తిరిగి సమానులై యున్నారనియును, ఇటుపైని వేరువిధములైన తపస్స్వాధ్యాయాదిభేదములచే క్రొత్తవర్ణము లేర్పడవలసి యున్నదనియును తెలియుచున్నది. అనగా, అంత దృష్టి లేనివారందరు శూద్రులుగా నెంచబడి, వారి ధర్మములు ప్రత్యేకముగా నేర్చర్చబడినవి. శిరస్సు, పాదములు వేరువేరు విధముగా నిర్మింపబడి, వేరువేరు పనులుచేయుట కేర్పడినంతమాత్రముచేత ఒకటి గొప్పది ఒకటి తక్కువది యనుటకు వీలులేకపోవుటయేగాక,

రెండింటిచేతను ఒక్క విధమైన పనులు చేయించబోవుట అసందర్భము, తెలివితక్కువ అగును. రెండును నిద్ర (ప్రళయ) సమయమునం దొక్క విధముగ ప్రవర్తించును, గాని, మేలుకొనియున్నపుడు భిన్నముగా నుండుట తప్పదు. ఆహారము, సంరక్షణ, విశ్రాంతి రెండింటికి సమానముగా కావలెను. దండనము మొదలగు కొన్ని విషయములలో మనువు పాదముల (శూద్రుల)యెడలనే ఎక్కువదయ చూపెను. కొన్ని స్మృతులలో గృహయజమానులయిన దంపతులు తమ బిడ్డలు, అతిథులు, సేవకులు భుజించిన తరువాత భుజించవలె నని యున్నది. మానవజాతికి శూద్రుడు పరిణతి పొందని గర్భస్థపిండమువంటివాడు. లోపలనున్న చైతన్యమునుండి క్రమముగ జ్ఞానము, కామము, క్రియ బయలుదేరినపుడు బ్రాహ్మణాదివర్ణములును బయలుదేరును. కనుక, శూద్రునియందు వికాస చిహ్నములు కనిపించినపుడు వానిని వికసింపజేయ వలె నని వాడు పైవర్ణములలో జేర నర్హుడగునని విధింపబడినదని యిది వరకు చెప్పియున్నాము. (మను 10-127,128,42;9-335 చూ॥)

శూద్రుడు వానికి చూపవలసిన ఆదరణయందు స్త్రీబాలురతో సమానముగా చెప్పబడెను. కృపణవత్సలుడైన వ్యాసుడు సర్వభూతముల హితము గోరి వేదార్థమును ద్విజబంధువులైన స్త్రీ శూద్రుల కోమల బుద్ధులకు బోధపడునట్లు పురాణ ఇతిహాసములను రచించె నని చెప్పబడినది. దీనిని బట్టి పూర్వకాలమున శూద్రుల పదవి ఇప్పటివలె నుండలేదని తెలియుచున్నది. పాశ్చాత్య

నాగరికతవల్ల నిర్బంధ బానిసత్వము అణచివేయ బడినదిగాని అది యితరరూపములుగా యింకను ప్రబలి యున్నది. బలవంతము లేక బుద్ధిపూర్వకముగను, దయాపూర్వకముగను సంఘములో నొకరి కొకరు, తమ తమ శక్తినిబట్టి సేవజేయుట కందరును పూనుకొను సమయము తిరిగి రావలసి యున్నది.

## మిశ్రమజాతులు-చిన్న చిన్నకళలు - వృత్తులు.

మనువు వర్ణములు నాలుగేగాని అయిదవవర్ణము లేదు అని స్పష్టముగా చెప్పి, ఈనాలుగువర్ణములలో సంకరమగుట చేత బయలుదేరిన మిశ్రమజాతులను గురించి కూడ వ్రాసెను. సంకరము ఆమోదింపదగినది కాదు గాని యున్నదానిని అంగీకరించక తప్పదు. అందుచేత, మనువు నాలుగువర్ణముల వారును అవలంబించవలసిన వృత్తులు ముఖ్యమైనవి విధించి, చిన్న చిన్న వృత్తులు వ్యాపారములు ఈ మిశ్రమవర్ణములకు ఒప్పచెప్పెను. ఏయే వర్ణములవారికి సంకరమై పుట్టినవారి కే యే వృత్తులు తగిన వని విధించబడినవో జాగ్రత్తగా పరిశీలించి చూచినయెడల, ఆ యేర్పాటు కూడ శారీరక మానసిక ప్రవృత్తులను బట్టి చేయబడిన దని కనిపించును.

జీవనాధారమునకు చేయవలసిన పనిచేసి, తీరుబడిగా నున్నప్పుడు విద్యల కన్నిటికిని మూలమైన యోగము నభ్యసించవలెను అని పూర్వుల అభిప్రాయము. ఫలితము నిచ్చు వృత్తులకు గౌరవ మెక్కువగ ఈయబడినది. చిత్రకళలు మొదలైన వృత్తుల కంత గౌరవము లేదు. అందుచేతనే బ్రాహ్మణుడు జ్ఞానబోధచే గడువని

రొదల సేద్యవృత్తి నవలంబించవలెనుగాని, చిత్రకళలను వృత్తిగానవలంబించగూడదనివిధించబడినది. బ్రాహ్మణుడు చిత్రకళలను, అనగా చిత్రలేఖనము, నృత్యము, గానము మొదలైనవి నేర్చుకొనియితరులకుబోధించవచ్చునుగాని తన జీవనమున కవి వృత్తులుగా నవలంబించరాదు, అని విధించుటచేత వానిని మనువు లాఘవముతో చూచెనని కనిపించును కాని, ఆకళలను స్వలాభమును కోరి, ఉదర పోషణమునకు, అవలంబించ కూడకపోయినను, ఇతరుల కుల్లాసము గలిగించుటకును, దైవభజనయందును ఉప యోగించ వచ్చునని చెప్పుటచేత, వాని కీయవలసినంత గౌరవము నిచ్చెనని విశదమగును. దేవాలయములు కట్టు టలో ఉపయోగించిన శిల్పజ్ఞానము, యుద్ధమునందు శత్రువుల నోడించుటకును రాజ్యమును కాపాడుకొను టకును చేసిన యంత్రములను, మనుష్యుల రాకపోకల కుపయోగించు వాహనములను నిర్మాణముచేయుట యందు చూపిన యంత్రకౌశలము, సంస్కార ములయందు పూజాదులయందు ఉపయోగించు వేద గానము అసమానములుగ నుండెను. ఇవన్నియును బ్రాహ్మణుల వల్లనే బోధింపబడుచుండెను. బ్రాహ్మ ణుల సలహామీదనే ఆయా పనులు జరుగుచుండెను. కాని బ్రాహ్మణుడు ఈ విద్యలను స్వలాభముకొరకు వినియోగించినపుడు వాని గౌరవము చెడిపోయెను. ఇది స్వభావతః అనివార్యమగుటచేత పతనమును సాధ్య మైనవరకు అరికట్టుటకు మనువు సంకరవర్ణముల నంగీక రించి వారికీ వృత్తుల నొప్పగించెను.

ఇది మనువు చేసిన వృత్తుల యేర్పాటు. మనువు ఈ వృత్తు లన్నియును గృహస్థాశ్రమమునందు అవలంబించ వలసినవిగా నేర్పరచెను. "సమస్తప్రాణులును వాయువు నాశ్రయించి యెట్లు జీవించుచున్నవో అట్లు సర్వ ఆశ్రమస్థులును గృహస్థు నాశ్రయించి జీవించు చున్నారు. గృహస్థుడు ఎల్లప్పుడును తక్కిన మువ్వు రను భిక్షమిచ్చి, ఆదరించి, వేదాధ్యయనము చేయించి కాపాడుటచేత గృహస్థాశ్రమము ఉత్తమ మని చెప్ప బడినది." (మను 3-76,77).

దేహబలము, ఓపికగలిగి, సోమరులై, భిక్షమెత్తు వారిని మనువు నిరాకరించెను. అన్ని వర్ణములవారును తమ తమ విధ్యుక్తములైన వృత్తులయందు శ్రద్ధ గలిగి కష్టపడి పనిచేయవలెను. (మను-7-100,102,8-419), తగినంత కారణముండిననే తప్ప ప్రతివాడును గృహ స్థాశ్రమమున బ్రవేశించి సమష్టి ప్రయోజనముకొరకు తన వంతు కష్టమును పడి పనిచేయక తప్పదు. గృహ స్థాశ్రమము సంతానముకొరకేర్పడినది గాని ఇంద్రియ భోగముల కొరకు ఏర్పడినది కాదు. ఎంతకాల మా యాశ్రమమునం దుండవలెనో, ఎప్పుడు విరమించ వలెనో నిర్ణయింపబడినది. దేనియందును మితిమీర కూడదు.

## వానప్రస్థుడు

గృహస్థాశ్రమమున తన జీవితమునందలి రెండవ భాగమును గడపిన పురుషుడు పరిశుద్ధుడై యింద్రియ ముల నణచుకొని వానప్రస్థాశ్రమమును బొంది వనము

నందు వసింపవలెను. గృహస్థుడు తన దేహమందు ముసలితనమునకు గుర్తులైన ముడుతలు, నెరసిన వెండ్రుకలును, పుత్రునకు పుత్రుడును కనబడగానే వాన ప్రస్థమున బ్రవేశించవలెను. (మను 6–1,2) ఋణత్రయమును దీర్చి, పుత్రునియందు కుటుంబ భారము నుంచి, తాను మధ్యస్థుడుగా నుండవలెను. రహస్యస్థలమునం దొంటరిగానుండి ఆత్మహితమును గూర్చి చింతించవలెను. అట్లు ఏకాంత ధ్యానము చేసినవాడు పరశ్రేయస్సును బొందును. (4–257,258) ఎప్పుడును స్వాధ్యాయము నందు శ్రద్ధగలవాడును, శీతోష్ణములను సమముగా నోర్చువాడును, సకల ప్రాణులకు హితుడైనవాడును, ఇతరుల కిచ్చుటయేగాని, ఇతరుల నుండి తాను తీసికొననివాడును, అయియుండవలెను. (6-8,9) ఆ యా కాలముల యందా యా యజ్ఞములను చేయవలయును. (6–10).

పూర్వము చేయబడుచుండినట్లు వనవాసము చేయుటకుగాని యజ్ఞముల చేయుటకు గాని యీ కాలమున నెవ్వరును అంగీకరించరు. ఇటువంటి కాలములకు తగినట్లుకూడ మనువు మీద చెప్పిన నియమముల ననుసరించ జాలని వానికొరకు, 'కర్మలను (అనగా గృహస్థుడు చేయవలసిన కర్మలను) అన్నిటిని విడిచిపెట్టి, పూర్వకర్మరాహిత్యము చేసికొనుచు, పరిశుద్ధుడగుచు, వేదము చదువుకొనుచు, పుత్రునిచే పోషింపబడినవాడై యింటియొద్దనే యుండవలెను' (4–95) అని నియమించెను. ఎక్కడ నున్నను ఈ యాశ్రమమున ముఖ్యధర్మము త్యాగము.

ఈ యాశ్రమములో కూడ తక్కిన యాశ్రమము లలో వలె పురుషుడు లోకక్షేమము కొరకు పనిచేయుట మానరాదు. ఈ యాశ్రమములో నున్నవారు ధర్మపరిషత్తులలో నుండదగినవారు. విప్రునకు తల్లిగర్భమునుండి పుట్టుట మొదటి జన్మము, ఉపనయనము రెండవజన్మము; యజ్ఞదీక్ష మూడవ జన్మము. వానప్రస్థుడు మూడవ జన్మమును పొంది యోగరహస్యముల నెఱుంగుట కర్హుడగును.

## సన్న్యాసి

వానప్రస్థాశ్రమ ధర్మములను యుక్తముగా నెరవేర్చినవాడు సన్న్యాసి. ఆశ్రమ ధర్మములను బొందుట కర్హుడై అచట వానప్రస్థమునం దారంభించిన ఆత్మధ్యానాదుల పరిపాకముంగాంచిక్రతార్థుడగును. పూర్వాశ్రమ ధర్మములను చక్కగా నెరవేర్చి వానియందు బడలిక గలిగి, ఆశ తీరిన వెనుక సన్న్యాసమును పొందవలెను. ఋణశేషము లేకుండ తీర్చిన తరువాత సన్న్యాసమును తలచవలెను. ఋణములు తీరక మిగిలియున్నంత వరకు మోక్షమునకు త్రోవలేదు. సన్న్యాసి బ్రతికియున్నను మరణించినను సంతోషించరాదు. భృత్యుడు భృతికొరకు వలె మరణమున కెదురు చూచుచుండవలెను. ప్రాణాయామముచే నిందిర్యదోషములను, పరమాత్మ యందు ధ్యానముచే పాప్రబ్ధమును, ఇందిర్య నిగ్రహముచే సంబంధములను, ఈశ్వర గుణధ్యానముచే కామక్రోధములను పోగొట్టుకొనవలెను. వేదాంతవాక్యముచేత అధియజ్ఞము, అధిదైవికము, అధ్యాత్మికము అని చెప్పబడిన

బ్రహ్మ స్వరూపమును సదా ధ్యానించవలెను సకల సంబంధముల యందును మమతను మెల్లమెల్లగా విడిచి, ద్వంద్వములనుంచి విముక్తినొందిన వాడై బ్రహ్మము ను పొందుచున్నాడు. తన యిష్టులవద్ద తన పుణ్యమును, తన ద్వేషులవద్ద తన పాపమును విడిచి బ్రహ్మయోగము వలన సనాతనమైన బ్రహ్మానందమును పొందును. ఆత్మ యీ శరీరమును మరల పొందకుండ చేయవలయును. ఈ విధి ప్రకారము ఎవడు సన్న్యాసము చేయుచున్నాడో వాడు సకల పాపములను ఇహమందే వర్జించి పరమైన బ్రహ్మమును పొందుచున్నాడు. (మను. 6-34 శ్లో॥) ఇది మనువు ఇంతచక్కగా నేర్పర్చిన మానవ జీవిత మునకు సమాప్తి.

ఈ యాశ్రమ క్రమమును చూచినయెడల ముం దైహిక ధర్మములను నెరవేర్చి క్రమముగా ఆముష్మికధర్మ ములను బూనుటకవి యేర్పడినట్లు విశదమగును. ఏకా గ్రమైన ధర్మనిష్ఠ గలవానికి ఆధ్యాత్మిక శక్తులు వికసించి లోక సంగ్రహార్థ ముపయోగించును. ప్రతిజీవుని కిని భక్తి, కర్మ, జ్ఞానములలో నొకటి ప్రధానమైయున్న ను, తక్కినవికూడ గౌణముగ నుండును. వానియందు తమస్సు, రజస్సు, సత్త్వము, ఈ మూడు గుణములలో నేది ప్రధానముగ నుండునో దానినిబట్టి వానికి భక్తి కర్మ జ్ఞానములలో నొకటి ప్రధాన మార్గమగును. వీని కన్ని టికిని సామాన్యమైనది ఉపాసన(సేవ, సన్నిధినుండుట), తమస్సు,భక్తి వైశ్యులకును,రజస్సు,కర్మ క్షత్రియులకును సత్త్వము, జ్ఞానము బ్రాహ్మణులకును ప్రధానములై ఉపాసన శూద్రులకు ముఖ్యమార్గమై యున్నది.

## ఉన్నత సాంఘిక ధర్మతత్త్వము

ఇంతవరకు సంగ్రహముగా జెప్పిన దానినిబట్టి మను చోదితమైన సంఘ నిర్మాణము ఒక సమష్టి కుటుంబము వంటిదనియును, నేటి సర్వసామ్య సిద్ధాంతములో ప్రజల మూకకు అధికారము నీయక జ్ఞానుల కధికారము నిచ్చి నట్లు మార్చినయెడల మనువుయొక్క సాంఘిక వ్యవస్థకు సరిపోలు ననియును విశదమగును. నాలుగు వర్ణములును జ్యేష్ఠ కనిష్ఠ సోదరులు అని చెప్పబడినవి. స్వార్థరాహిత్యము, సర్వభూతహితము, ఆత్మత్యాగము, సామ్యము లున్నచోట బాహ్యతలనుకూడ నుంచి గర్వము అహంభావము కలుగకుండ చూచుట, అన్నివర్ణముల వారును తమతమ విధ్యుక్త వృత్తులయం దేమరుపాటు లేక పనిచేయుట, వృత్తిభేదము లుండియు నొకరి నొకరు ప్రేమతోను నమ్మకముతోను, ఉపకారబుద్ధితోను చూచుట: ఇవి యీ సంఘనిర్మాణమున మూలతత్త్వములు. వృత్తి విద్యలు, ఆహారము, వివాహము, శీలము, ప్రవర్తనము, దానము, కృషి మొదలైన ఏ విషయము లిప్పుడు ప్రభుత్వమువారు అవలంబించక ఎవరియదృష్టమును బట్టి వారికి లభించుటకు విడిచిపెట్టిరి. కాని పూర్వ మివి అన్నియును కులపెద్దలు గ్రామయజమానులు చూచు చుండిరి. దానివల్ల ఒకవైపు 'ప్రభుత్వోద్యోగులవల్ల బాధయుండకుండుటయును, ఒకవైపు జనులు అతిస్వతంత్రులు కాకుండ కట్టుబాటులో నుండుటయును సంభవించెను. ఆర్యజాతిలో ఆచరణయోగ్యమైన సంఘ వ్యవస్థ ఇదియొక్కటే ఇంతవరకు ప్రతిపాదింపబడినది. ఇందలి తత్త్వములను మార్చుటకు సాధ్యముకాదు;

సాధ్యముగాలేదు; తత్త్వములు సర్వకాలములయందు వర్తించును. ఏలయన, అవి ప్రకృతిధర్మములను బట్టి నిర్ణయింపబడినవి వివరములు దేశకాలముల కనుకూలముగ మార్చుకొనవచ్చును. ఈ తత్త్వము లీకాలమునవు వరికి రావను వారికి అనుభవమే పాఠము చెప్పవలెను. అహంభావము పోయినగాని ఈ తత్త్వములు నచ్చవు.

క్రొత్త నాగరికత బయలుదేరి ప్రాతనాగరికత నణచివేసిన దని యందురు. అణచి వేసినది ప్రాచీనాగరికత యొక్క నిర్జీవశేషము. పాశ్చాత్యులు తమ భౌతిక శాస్త్రజ్ఞానముచేత ప్రాచీనమూఢత్వము నణచివేసినా మందురు. వా రణచినది యీమధ్య రెండు మూడు శతాబ్దముల క్రిందటి అజ్ఞత. ఆ యజ్ఞత అంతకుపూర్వపు ఔన్నత్యము యొక్క నిర్జీవశేషము. ఆ ప్రాచీన నాగరికతకు ఈ యాధునికులు దిద్దుబాట్లు చేయలేదు. పరిణామవాదమును కనిపెట్టినా మనుకొను ఈ భౌతిక శాస్త్రపండితులు క్రొత్తవిషయమును కనిపెట్టకపోవుటయేగాక పురుషుడు ప్రకృతిలోఁ దగుల్కొని, యందుండి తిరిగి విముక్తు డగుట యీ పరిణామమునకు కారణ మని మరచిపోయిరి. పూర్వము మనువు శాసించిన ధర్మములకొఱకే నేటిభౌతిక శాస్త్రజ్ఞులు గ్రుడ్డిగా తడుముకొనుచు వెదకుచున్నారు. క్రమముగా వారి కవి దొరకును. కాని అధ్యాత్మవిద్య నంగీకరించి తెలిసికొన్నయెడల త్వరలో దొరకును. అప్పుడు వ్యక్తిజీవనము, సంఘజీవనము ఐహికసుఖములతో గాక ఆధ్యాత్మికసుఖముతో నిండియుండును. మనుష్యు లొకరి నొకరు హింసించుకొనుట మొదలైన దుర్వృత్తులు, పోయి శాంతినెలకొని, సకలశాస్త్రము

లను విద్యలును మనుష్యులకు జ్ఞానమును సుఖమును కలిగించునవగును; పురాణము లన్నియు భవిష్యత్తునం దిట్టి స్థితి వచ్చునని చెప్పుచున్నవి.

## సమాప్తి

ఒక్కొక్క యుగమునందు మనుష్యజాతి ధర్మము లొక్కొక్క తీరున నుండును. ఆ యా కాలముల యందు మానవజాతి పొందుచున్న వికాసమున కనుకూలమయిన ధర్మము విధింపబడును. మనువు విధించిన స్మృతిలోని ధర్మముల తత్త్వములు సర్వకాలములయందును అవలంబించదగినవి యైనను వివరములు దేశకాలములను బట్టి మారుచుండక తప్పదని యిదివరకు చెప్పియున్నాము. ఆర్యజాతి యనబడు అయిదవ మానవజాతి యిప్పుడు ప్రపంచమున ప్రబలియున్నది. అందులో అయిదు ఉపజాతులు పుట్టియున్నవి. ఆరవ యుపజాతికి అంకురము లిప్పుడిప్పుడే బయలుదేరుచున్నవి. ఈ యుపజాతుల లక్షణములలో భేదము లున్నను జాతి కంతకును కావలసినది మానసిక వికాసము. మనస్సు తర్కము, విమర్శ, పరిశోధన, వివరములను సంగ్రహించుట మొదలగు స్వభావములు గలది. అది అయిదవ ఉపజాతియం దిప్పుడు విశేషముగా ప్రబలియున్నది. దానివల్ల ఉపద్రవము లెక్కువయై ప్రపంచము నంతను నాశనము చేయు ప్రళయమునకు కారణ మగునేమో యన్న భయము కలుగుచున్నది. ఇట్టి సమయములలో ఇదివరకు వలెనే పరమపురుషులగు లోకపాలు రేదో యొక యుపాయమును చేయుదురు. మన

స్సుతో సంబంధించిన నాగరికతకు ముఖ్యలక్షణములైన అహంభావము, పోటీ - ఈ రెండింటివల్లను పైన చెప్పిన ప్రమాదము రాకుండ కలియుగారంభము నుండియు శ్రీకృష్ణుడు, గౌతమబుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు మొదలైన అవతారపురుషులు అందరును ప్రేమను, అహింసను, భగవంతునికి ఆత్మసమర్పణము చేసికొనుటయును బోధించుచున్నారు. ఎవ్వరు చెప్పినను ఆత్మ యొక్కటియే పరమప్రియమైన వస్తువు; ఆ యాత్మకొరకే సర్వమును ప్రియమగు చున్నవి అన్న సత్యమునే చెప్పియున్నారు. ఇకముందుకూడ అవతార పురుషు లుదయించెదరు. వారును ఆ ధర్మమునే మరియొక విధముగా బోధింతురు. ముందు రానున్న ఆరవ యుపజాతికి ముఖ్యముగా వికసించవలసినది బుద్ధి. ఆయుపజాతిలో పుట్టెడు జీవులము మనమే. మనమప్పుడు బుద్ధివికాసమునకు తగిన ధర్మముల నవలంబించెదము. ఇటువంటి భేదము లున్నను ప్రవృత్తి నివృత్తి మార్గములును వాని ధర్మములును ఉండక తప్పదు. ఇన్ని జాతులకును, ఇన్ని విధములైన వికాసమునకు మూలకారణము ఆత్మవికాసము. ఆత్మ వికాసముకొరకే ఈ సంసార మేర్పడినది. దీనికి మార్గము యోగము; పరమావధి నిత్యుడైన పరమాత్మునియొక్క అనంతమాహాత్మ్యమును గాంచుట !

శాంతిః, శాంతిః, శాంతిః.



# స్వర్ణసోపానములు



పరిశుద్ధ జీవనము, ధారాళమైన మనస్సు,

స్వచ్ఛమగు హృదయము, తీవ్ర జిజ్ఞాస—

అనాచ్ఛాదిత అధ్యాత్మజ్ఞానము,

ఎల్లవారియెడ సోదరభావము,

బోధించుటకు, బోధింపబడుటకును సంసిద్ధుడై
యుండుట.

తనకు కలిగిన అన్యాయమును ధైర్యముతో
సహించుట,

తన నియమముల ధైర్యముతో ప్రకటింప గలుగుట,

అన్యాయముగ ఎదిరింపబడినవారిని సాహసమున
రక్షింపబూనుట—

మానవ పరిణామము – పరిపాకము – అను గూర్చి

పవిత్ర శాస్త్రము బోధించిన ఆదర్శమునందు

సదా దృష్టిని నిలిపియుండుట—

అను స్వర్ణసోపానముల నెక్కి—

బ్రహ్మజ్ఞానాలయమును

ఉపాసకుఁడు చేరఁగలఁడు.

హెచ్. పి. బ్లావట్స్కీ.